# గంగాతరంగిణీ సారస్వత సమితి

గంగాసదనము — మంథని.

స్థాపన :- క్రోధన సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పంచమి
(17-10-1985 గురువారము)

వ్యవస్థాపకులు: 'కవిశేఖర' శ్రీ గంగా రాజేశ్వరరావు.
మార్గదర్శకులు: శ్రీ గీట్ల జనార్ధనరెడ్డి
హితవరులు: శ్రీ చెప్యాల రామకిషన్‌రావు, మేడిపెల్లి
అధ్యక్షులు: శ్రీ ఇల్లెందుల సత్యనారాయణ
ఉపాధ్యక్షులు: శ్రీ గంగా సీతారామశర్మ
ప్రధాన కార్యదర్శి: డాక్టరు శుకశ్రీ
ఆర్థిక కార్యదర్శి: శ్రీ గంగా మనోహరరావు
సహాయ కార్యదర్శులు: శ్రీ పల్లి నారాయణ
,, శ్రీ ప్రభాకర్ అవధాని
,, శ్రీ పెండ్యాల సురేశ్
,, శ్రీ దొంతుల లింగమూర్తి
కార్యవర్గ సభ్యులు: శ్రీ చిలప్పగారి అనంతరాజం
,, శ్రీ తిరువరంగం కృష్ణమాచార్యులు
,, శ్రీ సినట రాజగోపాల్
,, శ్రీ గట్టు నరసింహప్రసాద్
న్యాయ సలహాదారు: శ్రీ అవధానుల రమేశ్, అడ్వకేట

శ్రీ సాయినాథాయనమః

# గంగా రూపకాలు

( గంగా తరంగిణీ పంచమ తరంగం )

## మల్లెమాల (ఏకాంకిక)

## రామరాజ్యం,

## ఎన్నికలొస్తున్నాయి - జాగ్రత్త! (నాటికలు)

## ఝాన్సీరాణి (నాటకం)


కృతికర్త:

"కవిశేఖర" గంగా రాజేశ్వరరావు.

మంథని.



ప్రచురణ:

గంగాతరంగిణీ సారస్వత సమితి

గంగాసదనము — మంథని,

కరినగరం జిల్లా — ఆంధ్రప్రదేశ్.

ప్రచురణ : విభవ సంవత్సరాది
(మార్చి, 1988)
ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు.

మూల్యము : 15 రూప్యములు.

ప్రతులకు :—

**గంగాతరంగిణీ సారస్వత సమితి**
గంగాసదనము – మంథని (505184)
కరినగరం జిల్లా – ఆం. ప్ర.

మరియు

**దొంతుల లింగమూర్తి**
స్టేషనర్స్ అండ్ బుక్ సెల్లర్స్,
గాంధీచౌక్ – మంథని.

ముద్రణ: శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్, జ్యోతీనగర్, కరీంనగర్

కృతికర్త:
**గంగా రాజేశ్వరరావు**

రచనాకాలంలో
రచయిత పరిచర్యలో
మనవరాలు— **సుగీత**
కీ. శే. గంగా రాజలక్ష్మణరావు
కనిష్ఠ పుత్రిక.

కృతికర్త:

"కవిశేఖర" గంగా రాజేశ్వరరావు.

మంథని.

ఓం శ్రీ శారదాయైనమః

# గంగాతరంగిణీ పంచమతరంగ సమాహ్వానము

రసికాగ్రణులారా !

గతమున రుక్మిణీ కళ్యాణాదిక కావ్యముల బ్ర॥ శ్రీ గంగా రాజేశ్వరరావుగారి కృతులు నాలుగును సమాజము నకు అందించితిమి. అయినను నిందు భగవత్ గీతాగానము మాత్రము వెలుగుచూడలేదు. దానినిఁగూర్చి పిదప వ్రాసె దను. ప్రకృతము కవిశేఖరుల నాటికలఁగూర్చి.

శ్రీ రాజేశ్వరరావు తన యధ్యాపనకాలమున రచించి విద్యార్థులచేఁ బ్రదర్శింపఁజేసిన నాటికలు "మల్లెమాల", "రామరాజ్యం", "ఎన్నికలొస్తున్నాయి - జాగ్రత్త", "ఝాన్సీరాణి" అను నాల్గింటిని గంగారూపకాల పేరున అచ్చువేయుటకు సంకల్పించి ప్రయత్నించితిమి. ఇందు డబ్బు సమితి వ్యవస్థాపకులది. ముద్రించుటలోఁగూడ వారి కృషియే సంపూర్ణముగ నున్నది. ఇంతటి వయోభారము నను కవిశేఖరుల నిరంతర సాహితీవ్యాసంగ మభినంద నీయము.

భగవత్ గీతాగానమునుఁగూర్చి వ్రాయుదునంటిని. అది ఇంతవరకును వెలుఁగు చూడకపోవుటకు అనేక కారణ ములు. కార్యదర్శిగా నే ననేక కార్యాంతరములయందు

నిమగ్నుడనై యుండుట, ముద్రాపకుల యలసత మొదలగునవి. ఏది యేమైనను నీ నాటికా సంపుటితోఁబాటు గీతాగానమును వెలువరించగలమని నొక్కి పలుకుచున్నాను.

ఇందు "మల్లెమాల, రామరాజ్యం, ఎన్నికలొస్తున్నాయి_జాగ్రత" అనునవి సామాజిక స్పృహగలవి. "ఝాన్సీరాణి" చారిత్రికము. వీటిని,గూర్చి నేను వివరించుటకంటె రసికులు చదివి యానందించుట సముచితము. రచయితకు సామాజికులకు మధ్య నేనుండుట యనుచితము.

గంగాసదనము
మంథని
తేది 1-8-1988

భవదీయుడు
డా॥ శుకశ్రీ,
B.O.L., M.A., B. Ed., Ph D.

3

# రూ ప కా లో క నం

"కావ్యేషు నాటకం రమ్యం" అన్నారు లాక్షణికులు. నాటకాన్ని రసంతో పరిపుష్టంజేసి, రమణీయ కళాఖండంగా దిద్ది తీర్చి సహృదయ హృదయ సంతుష్టంగా మలచటం మామూలు విషయం కాదు. అదెంత కష్టసాధ్యమో నాటక రచయితలకే తెలుసు.

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్, నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్" అన్న సూక్తి అక్షరాలా నిజమనిపిస్తుంది— ఈ విషయానికి వస్తే.

పాత్రచిత్రణానైపుణ్యం, కల్పనానల్ప శిల్పవైచిత్రం, సంభాషణా రచనాచమత్కారం, కథాసంవిధాన చాతుర్యం, రసనిష్యందనం, ఒక మహత్తర సందేశం ఇత్యాది బృహత్తర విషయాల నెన్నింటినో కలగాపులగంజేసి, శ్రమకోర్చి, నేర్పుగా మథిస్తేనేగాని అమృతం ఉద్భవించదంటారు— రూపకాల్లో.

అసలు రూపక శరీరం ఇతివృత్తం కావటంవల్ల దాని ఎన్నికలో, నిర్వహణలో కవి సహస్రాక్షుడు కావాలి.

ఇట్లా కాకపోతే దమ్ముసోకిన బాణాసంచాలాగా పేల కుండా తుస్సుమంటుంది ఆ రూపకం.

'కవిశేఖర' గంగా రాజేశ్వరరావుగారు ఇంతకు పూర్వం రచించిన రుక్మిణీ కల్యాణం, పార్వతీవిజయం, పరీక్షిచ్ఛరి

తము మొదలైన ప్రబంధాలు చూస్తే ఆయన ఒక పరమ ఛాందసుడుగా, సంప్రదాయవాదిగా, ఆధునిక భావాలు బొత్తిగా లేనివాడుగా గోచరించి ఆయన ఏ 18, 19 శతాబ్దాలకు చెందినవాడుగానో కనిపిస్తాడు.

ఈ రూపకాలు అవలోకిస్తుంటే ఆ రాజేశ్వరరావుగారు ఈయనేనా! అని ఆశ్చర్యంవేస్తుంది.

పైకి కనిపించని మరో రాజేశ్వరరావుగారు ఆయన హృదయంలోనుంచి ఉద్గమించి ఈ రూపకాలు వ్రాసినట్లనిపిస్తుంది.

కవిశేఖరుల జీవలక్షణాన్ని అర్థంజేసుకొన్నవాళ్ళకు ఇందులో విచిత్రం ఏమీ కనిపించదు.

కవి సంఘజీవి. అంతేకాదు శాసనకర్తకూడా.

కాలవశాత్తు సమాజంలో వచ్చే ఒడుదొడుకులకు అతడు ప్రతిస్పందించక మానడు.

సమాజశ్రేయస్సే ధ్యేయంగా పెట్టుకొని ఒక్క కలంపోటుతో తరతరాల మూఢాచారాలను, గ్రుడ్డినమ్మకాలను ఛేదించక తీరడు.

విశ్వకల్యాణానికి నడుం బిగించక మానడు.

ఈ దర్శనానికి గంగారూపకాలే ఒక్క చక్కని నిదర్శనం. గంగారూపకాలు మొత్తం నాలుగు. ఈ నాలుగు కాళిదాసు మాటల్లో చెప్పాలంటే చతురస్రశోభితాలు.

మొదటి రూపకం "మత్తెమాల".

మాలపిల్ల ఐన మల్లి ఈ రూపకంలో కథానాయిక. కథానాయిక పేరు అనుసంధించి తమ నాటికకు వింత గుబాళింపు ఘటింపజేశారు కవిశేఖరులు.

హరిజన సమస్య కేంద్రంగా తీసుకొని ఇతివృత్తం మలచబడింది ఈ రూపకంలో.

సమాజంలో హరిజనులు పడుతున్న అగచాట్లూ, అవమానాలు కళ్లారా చూచి, 'మనం మన కంచాల్లో తినిపిస్తున్న పిల్లులకన్నా, మన మంచాల్లో పడుకోబెట్టుకొంటున్న కుక్కలకన్నా నికృష్టులా వీళ్ళు?' అని ఒక కవి హృదయంలోని వేదనాతీవ్రత చుట్టిన శ్రీకారం ఈ రూపకం.

'హరిజనులను దళిత కులాలని, దళిత వర్గాలని శాశ్వత ముద్రవేసి, ఊరిబయట వాళ్ళకు కాలనీలు నిర్మాణంజేసి ఎన్ని రాయితీలిస్తేనేం? ఎన్ని సౌకర్యాలు కల్పిస్తేనేం? వారిని ఉద్ధరించలేం. ఇవన్నీ కేవలం ఓట్లకోసం పడే పాట్లే' 'ఏ పండుగనాడో, పర్వదినంనాడో హరిజనులతో గుళ్ళో చొరబడితే చాలదు. వారి పంక్తిలో కూచోని విందారగిస్తే సరిపోదు. ఓ హరిజన బాలికను పెండ్లాడినంతలో ఒరిగే దేమీలేదు. వాళ్ళను మన స్థాయికి సంఘంలో ఎదిగేటట్లు జేయాలి—' అని విప్లవ కవితాశంఖం పూరించారు ప్రబోధ రూపంగా కవిశేఖరులు ఈ రూపకంలో.

ప్రాచీన సంప్రదాయానికి శంకరశాస్త్రిని, ఆధునిక భావానికి సాంబమూర్తిని ప్రాతిపదికగా జేసుకొని విభిన్న వ్యక్తులకు, విభిన్న భావాలకు మధ్య సంఘర్షణ రేకెత్తిస్తూ తరతరాల గాఢతమస్సులో చిక్కి దారితెన్ను కానక విలవిల లాడిపోతున్న ఒక వర్గ దయనీయస్థితికి సూరయ్యను, నిష్క ల్మష ప్రణయసౌరభానికి మల్లెను ప్రతీకలుగా తీసుకొని సంఘసంస్కరణమే ధ్యేయంగా– అలనాటి జాతిపిత పిలుపుకు స్పందించిన కవి కలం మలచిన రూపం ఈ రూపకం.

ఇది హృద్యం, ఇది దివ్యం, ఇది భవ్యం.

ఇది రాజేశ్వరుల సమదర్శనానికి నిదర్శనం. కనుకనే వారి పాండిత్యం సార్థకమైంది.

ఇక రెండవ రూపకం "రామరాజ్యం".

గ్రామరాజ్య స్థాపనవల్ల రామరాజ్యం దేశంలో నెల కొంటుందనీ, ఆ లక్ష్యసాధనకు నిర్దేశింపబడ్డ పంచవర్ష ప్రణా ళికల విలువల్ని తన జాతి జనులకు తెలియచెప్పాలనీ ఈ రూపకాన్ని రూపొందించారు రాజేశ్వరరావుగారు. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రవేశపెట్టబడిన ఆ తొలిరోజుల్లో, తాము అధ్యాపక వృత్తిలో వుంటున్నప్పుడు.

ఇది ప్రచారసాధనంగా రూపొందించిన రూపకమైన ప్పటికి నాటకీయమైన విలువల్నిబట్టి రసవత్ఖండంగా అల రారుతున్నది. పేరిశాస్త్రి మీనాక్షుల పాత్రలు ఈ రూపకం లో హైలైట్.

మూడవ రూపకమైన "ఎన్నికలొస్తున్నాయి-జాగ్రత్త!" గ్రామీణ రాజకీయ వాతావరణానికి దర్పణంపడుతున్నది.

సర్పంచ్ పాపారావు ఊళ్లో చేయించిన దౌష్ట్యాలు, సార్థక నామధేయుడైన భుజంగరావు దుష్కృత్యాలు సహించలేని యువత చేసిన తిరుగుబాటు, సాధించిన విజయం ఇందలి ఇతివృత్తం.

మంజులాంజలులు వరుల నెన్నుకోవటంకూడా ఇందులో ఒక భాగమై రూపకానికి పెట్టిన పేరుకు సారు ఘటిస్తోంది.

ఇక నాలుగవది 'ఝాన్సీ లక్ష్మి' చరిత్రాత్మక నాటకం.

ఝాన్సీ లక్ష్మీబాయిపై సారించిన సరికొత్త ఫోకస్ ఇది.

పేద కుటుంబంలోనుంచి వచ్చిన లక్ష్మీబాయి నిరాడంబరత్వం, ఆమె ధీశక్తి, భుజశక్తి, దేశభక్తి, స్వజనానురక్తి నిరూపక రూపకం ఇది.

కంపనీవారికి పట్టుబడి బందిగా రంగూన్‌కు పంపబడక ఢిల్లీ పాదుషా బహదుర్‌షా తన వాగ్దాన ప్రకారం లక్ష్మీబాయికి సైన్యసహాయం చేసివుంటే— ఒక ఆడదాని నేతృత్వం క్రింద పనిచేయనని తాంత్యాతోపే భావించకుండా వుంటే— ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో లక్ష్మీబాయి సర్వసైన్యాధ్యక్షురాలై ఉంటే— ప్చ్! ఇట్లా ఆ రూపకం

చదువుతుంటే మనకు అనిపిస్తుంది. కాని అట్లా ఎందుకు జరుగుతుంది? ఒక పక్క హైద్రాబాద్ సాలార్‌జంగ్, గ్వాలియర్ దినకర్‌రావ్ లాంటి దేశద్రోహులు ఇంగ్లీషు వారితో చేతులు కలిపితే—

ఈ నాటకంలో అంగిరసమైన వీరానికి కాశీ ధోండో పంత్‌ల శృంగారం అంగమైంది.

మొత్తం నాలుగు రూపకాల్లో 'ఝాన్సీలక్ష్మి' ఒక్కటే నాటక లక్షణ లక్షితమైంది. విలక్షణమైందీను.

ఎందుకంటే సంస్కృత నాటకాల్లో మనకు కనిపించే నాందీప్రస్తావనలు, ప్రవేశక విష్కంభాలు, భరతవాక్యం ఇందులో మనకు కనిపించవు.

మొత్తంమీద ఈ రూపకాలు చదువుతున్నంతసేపూ ఏదో సినిమా చూస్తున్నట్లు వింత అనుభూతి.

గుండెలపై కలికి పూదేనె సోనల జల్లులు!

గిరిగింతలు, పులకింతలు, మందహాసాలు, కన్నీళ్లు, గుండెలో రంపపుకోతలు.... ఇట్లా ఎన్నని?

రూపకాలోకనంచేసి ఎన్నింటినని దర్పణం పట్టను! ఇన్నాళ్ళు అసూర్యంపశ్యలాగా పడివున్న ఈ అనర్ఘ రూపకాలు ఈనాడు వెలుగులోనికి రావటం తెలుగువారి అదృష్టం.

ఇంత కలంబలంకలిగిన కవిశేఖరులు ఒక సాంఘిక నాటకం వ్రాసి తెలుగువారికి ప్రసాదిస్తే ఎంతబావుండునో అనిపిస్తుంది.

ఇది వరణీయం. అవశ్యాచరణీయం.

కాని ఇంతకు మనం పెట్టి పుట్టాలి!

ఆ శుభతరుణంకోసం వేయి కళ్ళతో నిరీక్షించక తప్పదు.

కవిశేఖరులైన శ్రీ గంగా రాజేశ్వరరావుగారి కవి రాజశేఖరత్వం ఎంత ప్రౌఢమైందో- ఎంత విలక్షణమైందో- ఎంతగా గుండెను కదలిస్తుందో- ఈ రూపకాలు అవలోకించిన సహృదయలోకం గ్రహించకపోదు.

ఇట్లే చిరకాలం కవిశేఖరుల కలం హలమై తెలుగు సాహితీక్షేత్రంలో వ్యవసాయంచేసి గంగా రసనిర్ఝరులు పారించి, కావ్యఫలాలను తెలుగువారికి అందించగలరని ఆకాంక్షిస్తున్నాను. అస్తు!

'సరస సాహితీచరణచారణ చక్రవర్తి'

**G V. L N. విద్యాసాగరశర్మ,**

ప్రిన్సిపాల్,

ప్రభుత్వ డిగ్రీ కళాశాల.

మధిర, ఖమ్మం జిల్లా.

25-5-1988

Dr. K. V. Ramakoti Shastry,
Professor & Head
Dept. of Telugu
Kakatiya University,
Vidyaranyapuri,
Warangal - 506009.

## అ భి లా ష

మల్లెమాల— రామరాజ్యం— ఎన్నికలొస్తున్నాయి— జాగ్రత్త!— ఝాన్సీరాణి— ఈ నాలుగు రూపకాలను కవి శేఖరులు శ్రీ గంగా రాజేశ్వరరావుగారు రచించారు. జాతీయోద్యమం, వర్ణాంతర వివాహం, హరిజనోద్ధరణ ఈ మొదలయిన నేపథ్యంలో రచింపబడ్డ రూపకం మల్లెమాల. స్వతంత్ర భారతంలో పంచవర్ష ప్రణాళికలు అభివృద్ధి కార్యక్రమాలు గ్రామీణ చైతన్యం మొదలయిన అంశాలను కేంద్రంగా చేసి రచింపబడ్డ రూపకం రామరాజ్యం. ఎన్నికలొస్తున్నాయి - జాగ్రత్త! అనే రూపకం గ్రామజీవితాన్ని అక్కడ భూస్వాముల దౌర్జన్యాన్ని- యువతరంలో వస్తున్న అభ్యుదయకరమైన చైతన్యాన్ని చిత్రిస్తున్నది. వీరరస ప్రధానమైన నాటకం ఝాన్సీరాణి. అవసరమైన చారిత్రక నేపథ్యంలో ఈ నాటకం సలక్షణంగా వ్రాయబడింది. ఇది ముఖ్యంగా ఇంటరు, బి. ఏ. విద్యార్థులకు పాఠ్యంగా ఉండ

దగింది. సంభాషణలను రచించటంలోను, పాత్రలను సము చితంగా పోషించటంలోనూ శ్రీ రాజేశ్వర కవిగారు మంచి శ్రద్ధాసక్తులు కలిగి పనిచేశారు.

ప్రాచీన కవితాసాంప్రదాయ మర్మజ్ఞులయ్యీ శ్రీ రాజేశ్వర కవిగారు ఆధునిక వర్తమాన సామాజిక పరివర్త నలను జాగరూకతగా గమనించటమేకాక, వాటి నొక లక్ష్య సిద్ధివైపుగా మళ్ళించటానికి బాధ్యతగా రూపక రచనావిధా నాన్ని అవలంబించటం ఎంతైనా ప్రశంసింపదగిన విషయం.

శ్రీ రాజేశ్వరరావుగారి ఈ రూపకాలు సహృదయుల ఆమోదానికి పాత్రములు కాగలవని ఆశిస్తున్నాను. శ్రీ రావు గారి రచనాశక్తి మరింత ప్రయోజనవంతంగా పరిణమించా లని అభిలషిస్తున్నాను.

6–7–88 — కేతవరపు రామకోటిశాస్త్రి.

**శ్రీ కాకుటూరు సుబ్రహ్మణ్యం**
ఎం. ఏ. (చరిత్ర) ఎం. ఏ. (ఆర్థిక)
లెక్చరర్ అండ్ జర్నలిస్టు,
మంథని.

## వే డి కో లు

బ్రహ్మశ్రీ గంగా రాజేశ్వరరావుగారు ఇటీవల రచించిన "గంగా రూపకాలు" ఒక ప్రతిని నాకు ఇచ్చి చదవండి అన్నారు. వారి రుక్మిణీ కల్యాణము, పరీక్షిచ్చరితము, పార్వతీవిజయములను రసాస్వాదన దృష్టితో చదివాను; ఆనందించాను. ఆయన కీర్తికేతనాన్ని సాహిత్యాకాశంలో ఎప్పుడును రెపరెపలాడించడానికి ఆ కృతులు చాలు.

తెలుగువారి మేటి నటుడు, కళాప్రపూర్ణ బళ్ళారి రాఘవగురించి ఒక మహనీయుడు "ఈయన రాయలసీమలో జన్మించకపోయి ఉంటే యావద్భారతం బ్రహ్మరథం పట్టిఉండేదేమో" అన్నట్లు ప్రేమమూర్తులు రాజేశ్వరరావు మన తెలంగాణాలో కాక ఎక్కడైనా జన్మించి ఉంటే అనల్పమైన ప్రాచుర్యం పొంది ఉండేవారేమోననిపిస్తుంది.

ఛందస్సు కొద్దోగొప్పో నేర్చుకొన్నవాళ్ళు స్వల్పంగా ఆవేశం ఉన్న భావకవులు తమ ప్రచారపు బాకాద్వారా ప్రచురణ అమ్మకపు ప్రక్రియలలో గల నైపుణ్యంతో వెలుగులోకి వస్తుండగా నా పుస్తకాలు ఎవరైనా చదివినా చాలు

అన్న సంతోషి వీరు. తమ ఉద్యోగ విరమణానంతరము తాను పొందిన ద్రవ్యాన్ని గ్రంథముద్రణకే వెచ్చించుట వారికిగల వ్యాపారరహిత దృక్పథాన్ని వ్యక్తం చేస్తుంది.

పై రచనలన్ని పద్యకావ్యాలు. ప్రబంధశైలిలో నడిచిన మణిపూసలు. "రత్నాన్ని మనుష్యుడు వెతుక్కుంటూ వెళ్ళుతాడు కాని రత్నం మన వెంట పడదు" అన్న నానుడి వీరిపట్ల విపర్యయంగా కనబడుతుంది. అవి పద్యకావ్యాలు అవడంచేత 'గద్యం కవీనా నికషం వదంతి' అనే శాస్త్ర వాక్యంపట్ల విశ్వాసంతో బహుశ ఈ రచనకు ఆయన ఉపక్రమించి ఉండవచ్చు. దానికితోడు 'కావ్యేషు నాటకం రమ్యం' అన్న సూక్తికూడా ఆయన ఈ రూపక సృష్టికి కారణభూతమేమో! నాటిలాగా నేడు సుదీర్ఘమైన నాటకాలను చదివే ఓపికలేని పాఠకులను దృష్టియందుంచుకొని నాటకరూపాత్మైన రూపకాలను ఆయన రచించారు.

"పామరులుల్లసిల్లవలె బాలుడు కేళిని దేలగావలెన్
గోమలి మోహమొందవలె గోవిదుడుం దల నూపగావలెన్
స్వామియు బ్రీతిజెందవలె, జక్కని శైలిని బద్యమల్లుచో
నేమిటికో మరెవ్వరికి నెందుకు గూర్పని పద్యజాలముల్"

మద్దులపల్లి సుబ్రహ్మణ్యంగారి పై పద్యంలోని 'పద్య' బదులు 'గద్య' అని ప్రతిక్షేపిస్తే పై లక్ష్యాలన్నిటిని ఈ రూపక రచన సిద్ధింపజేస్తుంది. పామరులు, బాలురు

కోమలులు, కోవిదులుకూడా ఈ రూపకాలు చదివి ఉల్ల సిల్లి, ప్రీతిజెంది తల ఊపుతారనడంలో ఏమాత్రం విప్రతి పత్తి ఉండబోదు.

పోతే రూపకాల గురించి రెండు మాటలు— ఈ రచనల్లో తెలంగాణా తెలుగు పలుకుబడులు ముద్దులొల్కు తూ ముచ్చటగా కనబడతాయి 'మల్లెమాలలో'— గత్తరిమింగ- (ఇతర ప్రాంతాల్లో పోలేరమ్మ- పెద్దమ్మ), నీ బొట్టు మలగ (తుడవ), ఇక (ఇంక) మొదలైనవి దీనికి ఉదాహరణ.

'ఝాన్సీరాణి' లో ఖాసిం (పే. 149) మాటల్లోని పాత్రౌచిత్యం- వేదంవారి 'ప్రతాపరుద్రీయం', ధర్మవరం వారి 'రామదాసు' నాటకాల స్ఫురణకు తెస్తుంది. శ్రీ రాజేశ్వరరావుగారికి ఉర్దూలోకూడ గణనీయమైన ప్రావీణ్యం ఉండడంవల్ల "బర్ తరఫ్ అయి ఘర్ తరఫ్ కి పోయిండు" (పే. 150). కఫన్ కప్పి దఫన్ చేయడం (పే. 163) అనే మాటల్లో తెలుగు శబ్దాలంకార పోకడలు కనిపిస్తాయి. "ఎన్నికలొస్తున్నాయి—జాగ్రత్త" లో పాపారావు స్వగతాలు సంభాషణలు ఆంధ్రప్రభ వీక్లీలోని బులేనా మాటలను, నాగభూషణం, రావుగోపాలరావు మాటలను గుర్తుచేస్తాయి.

వీరి కలం సినీ స్క్రిప్టులా సాగుతుంది. (పే. 130, 131) సునిశిత హాస్యంలో దత్తపదిలాగు 'నీ ప్రేమ మండా,

నీకు నూరేండ్లు నిండా' అని మంజులతో అనిపించి, అదే చాలదన్నట్లు 'ఇక నా ముందుండవాకురా ఓరి గుండా!' అనేది ఆ సంభాషణలో కొసమెరుపు (పే. 113) జాతీయ గీతాలాపనతో ముగియడం 'రామరాజ్యం' ప్రత్యేకత. వైవిధ్యపరంగా విశ్లేషిస్తే రూపకాలలో రెండు నాటికలు, ఒకటి ఏకాంకిక, ఒకటి నాటకం— ఇంకోరకంగా చెబితే మూడు సామాజికపరమైనవి. ఒకటి చరిత్రాత్మకమైనది. ఈ రచనల (రూపకాల) వైశిష్ట్యం గురించి చెప్పుకుంటూపోతే ముగింపు ఉండదు. స్వాస్థ్య, ప్రతిభ, అభ్యాసం, ఇత్యాది కవిత్వ మాతల ముద్దుబిడ్డడు శ్రీ రాజేశ్వరరాయుడు. ఇది గంగాతరంగిణీ పంచమ తరంగం. తృతీయ తరంగం 'గీతాగానం' ముద్రణ పూర్తిగావించుకొని వెలుగు జూడాలని ప్రార్థిస్తాను.

పాఠకులకు వినమ్రతాంజలి ఘటిస్తూ—

మంథని, — కా. సుబ్రహ్మణ్యం.
21-7-88.

ఓం

శ్రీ శారదాయైనమః

కవిశేఖర 'గంగా రాజేశ్వర' కావ్యావిష్కరణ సమయ

స మ ర్పి త

## స న్మా నా క్ష రా క్ష త సు మాం జ లి

**శ్రీ** మద్గంగావంశ సు
సోమా రాజేశ్వరాఖ్య! సువ్రతకామా!
సామాన్య గృహస్థాశ్రమ
కామిత సుమనస్క సత్య కామ సునామా!

**గం**ధ సువాసనల్ విరియ కమ్మని భావము ప్రోదిచేసి, ప్రా
బంధిక పార్వతీవిజయ భవ్యసుకావ్యత నవ్యరీతి సం
బంధము తేనెలూరు రసమాధురి సత్కవితామృత ప్రవా
హాంధ తమస్సులో మునుగరా? యెఱుకందెడివారు
నిత్యమున్.

**గా**రామొప్పఁగ నీదు కావ్యముల లక్ష్యస్థాయి లోకక్రియా
సారమ్ముల్ చవిచూపునట్టి ధరణీ సంసార సారప్రచా
రారంభః పరిపూజ్యపూత విభవ ప్రాగణ్య సాద్గుణ్య వి
ద్యారామ ప్రవిహారభాజన రుచి ప్రామాణ్యగణ్యంబగున్.

**రా**జుల్ పల్లకిమోసి, పెండెరముఁ దోరంజేసి కాళ్ళేళ్ళ, జ
వ్వాజుల్ పూసి, మడుంగుఁదొడ్గులిడి, సౌభాగ్యాగ్రహారస్థిర

భ్రాజత్కీర్తి సమగ్రతన్ బిరుదముల్ ప్రాపించు
పూర్వంపు నా
యోజన్, నీకిటు నబ్బె గౌరవ మహోద్యోగంబు,
రాజేశ్వరా!

**జే**జేధ్యాసము మంత్రకూట జన రాశీభూత కంఠోద్గత
త్తేజస్ఫార విచారకారక రసాంధీభూత సానంద భా
వాజేయస్థితి నీదు కావ్యసుధ లక్ష్యప్రాగ్ర మార్గాను మో
దాజీవానుభవంబు, సత్కవికులాహార్యా! సుధీగ్రామణీ!

**శ్వ**పచ పవిత్రమంత్రము ప్రశస్తశివా పరమేశ్వరంబు కా
వ్యపథమునందు మూర్తిమయమై భవదాకృతిఁబూని
సత్ప్రబం
ధపరమ భవ్యనవ్య కవితామృతవృష్టి రసప్రవాహ సా
ధ్యఫలమగున్, ప్రబంధ కవితా పరమేశ్వర! కీర్తిసాగరా!

**ర**చితము నీదు జీవితము రమ్యసముజ్జ్వల కావ్యకల్పనా
రుచిమయ లక్ష్యసిద్ధికయి; రుక్మిణి, పార్వతి,
యాత్రరేయముల్,
శుచిమయగీత, నాటికలు శోభితముల్; మఱి
యింకమీఁద నీ
రచనలు మంత్రకూట హృదిరంజక రూపముత్తై
చెలంగుతన్.

**న**వభావమ్ములఁ బ్రోదిచేసి గుణ సంధానంబు గావించి, వ
ర్ణవదాన్యత్వము మీఱు వర్ణణము రాణంగూర్చి
యాలంకృతా

ర్థవిశేష ప్రతిభాసమాన రస విభ్రాజత్కళాశ్శైలి త
త్త్వవిశేషంబులఁ జేర్చినట్టి రచనా తాత్పర్యముల్
చిత్రిముల్.

మోదముతోడ నీ బిరుదముల్ దగఁ బెండెరమున్ సుతృప్తితో
వేదనవీడె నేఁడవి వివేక విలోచనచేసి సాంప్రదా
యోదయ ధర్మశీలుఁడు మహోజ్జ్వల పత్కవితా
దురంధరుం
డేదయఁదమ్ముఁ బూనెనని ఔక్కువహించెను
గ్రొత్తక్రొత్తగన్.

స్తుతమతి మిమ్ము నెల్లరులు స్తోత్రముచేసిరి నేనదెంత? సం
తతము నవోజ్జ్వలప్రతిభ తత్పర నూతన కావ్యగాన మో
దితుఁడను నేనకావలయుఁ, దేజముతోఁడుత మీరచేయఁగా
నిరతమదేల స్వామి! యివియే కయిమోడ్పులు
స్వీకరింపుమా!

సుకవిజన వినయ విధేయుడు,

డా. శుక్రి
ప్రధాన కార్యదర్శి
గంగాతరంగిణీ సారస్వత సమితి,
మంథని.

మంథని
సన్మానవేదిక
5-5-1987

స్వస్తి శ్రీ ప్రభవ సం॥ వైశాఖ శు॥ ౭ తేది 5-5-1987 న స్వీయరచనలు 'పార్వతీవిజయము' 'పరీక్షిచ్చరితము' కావ్యా విష్కరణ మహోత్సవ సందర్భమున- కవిశేఖర, కవికులాలం కార, ప్రబంధ కవితా పరమేశ్వర, కళాప్రవీణ, కవితా పారీణ బిరుదాంచితులు- బ్రహ్మశ్రీ గంగా రాజేశ్వరాయ మహోదయు లకు "మంథని మిత్రమండలి" హృదయపూర్వక గౌరవ పురస్సరముగ సమర్పించిన-

## స న్మా న ప త్ర ము

గంగావంశ రాకాసుధాకరా!

మీ ప్రాదుర్భావంచేత మీ వంశమేకాదు; మీ ఆవాస మైన మంత్రకూటము సరససహృదయాంధ్ర సాహిత్యలోకం నిలువెల్లా పొంగి పులకరిస్తున్నది. మీరు నిలచిన చోట సాహిత్య సరస్వతీ చరణమంజీర శింజినీశింజితాలు ధ్వనిస్తు న్నవి. మీరు పలికిన నోట కమ్మకైతల కస్తూరి వాసనలు గుబాళిస్తున్నవి. సంగీత సాహిత్యములు రాశీభూతమై మూర్తీభవించిన కళాసరస్వతులు మీరు.

సార్థక నామధేయా !

ప్రాక్తనజన్మ సౌహార్దంచేత సంక్రమించిన ప్రతిభకు దీటుగా సాధించిన పాండిత్య ప్రకర్షతో రసికజన మనోభి రామంగా పరువాలు వెదజల్లే ప్రబంధాలు వెలయించిన కవిరాజేశ్వరులు మీరు.

సౌహార్ద్రహృదయా !

మీ పలుకెంత మెత్తనో మీ హృదయమంత మెత్తన. మీ ఆర్ద్రతను కొలిచే కొలబద్దలు విశ్వంలో కనరావటం

లేదు. మీ గుండెనిండా సుధలు. మీ చూపులనిండా వెన్నె
లలు. మీ పలుకులన్నీ ఇక్షుఖండాలు. మహోదయా! మీ
నడవడి ఆశావధులకు వెలిపూతలపోయగాన్ని ప్రచరిస్తున్నది.
ఈశ్వరార్చన కళాశీలీ !

కళను భగవదంకితంచేసి, ఈశ్వరాన్వేషణలో జీవునివేదననే
కావ్యాలుగా మలచి, మీ హృదయపద్మాన్ని పరమేశ్వర చర
ణారవిందాలకు పూజాప్రసూనంగా సమర్పించిన పరమభాగవ
తోత్తములు మీరు. భక్తిరసమున కేతమెత్తిన మీరు మంథెన్న
పోతన్నగా సంభావించబడటంలో ఆశ్చర్యమేమున్నది.

ప్రబంధ కవితాపరమేశ్వరా !

సంప్రదాయంపైగల మక్కువతో, పిచ్చిమొక్కలు మొలిపి
స్తున్న ఆంధ్ర సాహిత్య నందనోద్యానంలో ఈనాడు మధుర
మాకందాలు వెలయిస్తున్న కవికల్పవల్లులు మీరు. మీరు
విరచించిన కావ్యాలు మీ ప్రబంధ కవితాపరమేశ్వరత్వానికి
ఎత్తిన బావుటాలై ఆంధ్రసాహిత్య నభోవీధిలో రెపరెపలాడు
తున్నవి. కవికులాలంకారులైన మీకు మా హార్దిక నమ
స్సుమాంజలులు.

తెలుగువాడి వేడి ఉన్నంతవరకు మీ కవి యశస్సు
నిలిచి ఉంటుందని మా విశ్వాసం. భగవంతుడు ఆయురా
రోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక !

సన్మాన వేదిక — ఇట్లు
మంథని 5-5-87 — మంథని మిత్రమండలి.

ఓం

పార్వతీవిజయము, పరీక్షిచ్చరితము కావ్యావిష్కరణ
మహోత్సవ సందర్భమున 'కవిశేఖర', 'కవికులాలంకార',
'ప్రబంధకవితాపరమేశ్వర', 'కళాప్రపీణ' 'కవితాపారీణ'
ఇత్యాది బహుబిరుద భూషితులు—
బ్రహ్మశ్రీ గంగా రాజేశ్వరరాయ మహోదయులకు
సన్మాన పురస్సరముగ సమర్పించిన

# జయ గీత మాలిక

---

కవితపేరిట విస్ఫులింగాలు రేగి
ఆంధ్ర సాహిత్య నందనోద్యానవాటి
కాల్చి, మసిచేయనున్న రాకాసివేళ
మంచి గంధపు కవిత వర్షించినావు.

సంప్రదాయపు రీతికి స్వస్తిచెప్పి
నాలుగు పదాలుపాడి మీసాలుదువ్వి
పోజురాయళ్ళ గుండెల పొగరు జార
కలికి కైతల వెన్నెల లొలికినావు.

కల్పనానల్ప శిల్ప ప్రకర్ష జూపి
పద్య రచనలో నూత్న శోభలు వెలార్చి
అలతి అలతి మాటలు సామెతలు ఘటించి
రసికు లౌనన కావ్యాలు వ్రాసినావు.

రమ్య భావాలతో భక్తి రంగరించి
తెలుగు హృదయాలలో తేనె లొలికినావు
ఓయి! గంగాకుల సుధాంశు! ఓ రసజ్ఞ!
సుకవిరాజ! రాజేశ్వరా! శుభము నీకు.

జయము! జయము! సుకవిజనగేయ! మహనీయ!
సరస హృదయ సదయ! జయము! జయము!
జయము! జయము! నీకు సత్కవిశేఖరా!
జయము! జయము! దిగ్విజయము! జయము!

మంథని
సన్మాన వేదిక
5-5-1987

ఇట్లు
సరస సాహితీచరణ చారణ చక్రవర్తి
జి. విద్యాసాగరశర్మ.

ఓం

స్వస్తి శ్రీ ప్రభవ సంవత్సర వైశాఖ శు॥ ౭ తేది ౫-౫-87
భౌమవారమున

స్వీయ రచనలు "పార్వతీవిజయ", "పరీక్షిచ్చరిత"
కావ్యావిష్కరణ మహోత్సవ సందర్భమున-

'కవిశేఖర' బ్రహ్మశ్రీ గంగా రాజేశ్వరరావుగారికి
"మంథని మిత్రమండలి" సన్మాన పురస్సరముగా

గండపెండేర సత్కారముతో

**"కవికులాలంకార"**
**"ప్రబంధకవితా పరమేశ్వర"**

బిరుదములు బహూకరించినది.

మంథని
సన్మాన వేదిక
౫-౫-1987

ఇట్లు
మంథని మిత్రమండలి.

ఓం

'పార్వతీవిజయ', 'పరీక్షిచ్చరిత' కావ్యావిష్కరణ
మహోత్సవములో

కృతికర్త 'కవిశేఖర', 'కవికులాలంకార',
'ప్రబంధ కవితాపరమేశ్వర'
బ్రహ్మశ్రీ గంగా రాజేశ్వరరాయ మహోదయులకు
సన్మాన పురస్సరముగా

'సరస సాహితీచరణచారణ చక్రవర్తి'
జి. విద్యాసాగర్ చే
**"కళాపరిపూర్ణ", "కవితా పారీణ"**
బిరుదములు ప్రదానము చేయబడినవి.

మంథని
సన్మాన వేదిక
5-5-1987

ఇట్లు
జి. విద్యాసాగరశర్మ.

## గంగా రాజేశ్వర కవిరత్న ప్రశంసా
## నవరత్నమాలిక

గంగా రాజేశ్వర! కవి
పుంగవ! కవితాతరంగ పూర పరీక్షి
ద్గంగావాహిని దక్షిణ
గంగా సంగతిఁ ద్రివేణిగాఁ బ్రవహించెన్.

శుకముఖ నిర్గత భాగవ
తకథా శ్రుతిసార గర్భిత సుధామజ్జ
త్సుకృతి పరీక్ష ద్విభవ
ప్రకటత్ తావక కృతి కృతివర! శ్లాఘింతున్.

శృంగిరిత శాపంబర
యంగా నరపతిక కాక యడుగని వరమ
య్యేంగద జగతిని లేకు
న్నంగలి భాగవతనిధి కనబడునె లీలన్.

భాగవతాగ్రణి వక్తయు
భాగవతోత్తముఁడు శ్రోత వక్తవ్యంబున్
భాగవత మహాసంహిత
భాగవతాద్వైత గంగ పాఱెడి నిచటన్.

తక్షకుఁడేలం జంపన్
రక్షితుఁడయ్యె వగఁ జచ్చుఁ బ్రతిదిన మజ్ఞం
డక్షయ విజ్ఞాన నిధికి
వీక్షింపఁగ భయమదేల వేతక్షకులన్.

ప్రతివాఁడు పరీక్షితుఁడై
బ్రతుకును హరిచేత విష్ణురాతుండనఁగాఁ
బ్రతిమర్త్యుం డమృతత్వపు
గతి భాగవతామృతమునఁ గనవలె నిచటన్.

తత్త్వము, జ్ఞానంబును భ
క్తిత్వమ్ము, వైరాగ్యము నవతాయుత కవితా
తత్త్వము దీపింపఁ బలికి
"తత్త్వమసి" మహార్థ మిడితి దవుదవ్వులుగన్.

శుకపునరాలోపితముగ
సుకమును గ్రూర్చు భవదీయు సుమధురసూక్తి
పవిత్రకరము వేద సుకద్రు
ప్రకటిత భాగవత పక్వ ఫలరసమందున్.

గంగా రాజేశ్వర కవి
పుంగవ! వివిధ ప్రబంధ పుల్లమరందా
లింగిత కంజమయ నిజ పు
రాంగణ కాసారమున బుధాళులు మ్రోయున్!

మా కందమ్ములు కవివర!
మా కందమ్ములు నవరస మాకందమ్ముల్
మీ కందమ్ముల కందము
లై కందమ్ము లగును హృదయార్ద్రితకెందున్.

మంథని, సన్మానవేదిక — 'కవిశేఖర'
5-5-1987 — చెప్యాల రామకృష్ణారావు, మేడిపెల్లి

ఓం

పార్వతీవిజయ, పరీక్షిచ్చరిత కావ్యావిష్కరము
మహోత్సవమున
పరమ పూజ్య — గురువరేణ్యులు
శ్రీయుత గంగా రాజేశ్వరరావుగారికి జరిగిన
గండపెండేర సన్మాన సందర్భమున సమర్పించు

# కవితాంజలి

సీసమాలికలు :

ఆంధ్రదేశమునందు నన్నిరంగాలలో
మాన్యత పొందిన మంత్రపురము
రాజకీయాలతో రాణకెక్కినవారు
పుట్టి మెట్టిన యట్టి పుణ్యభూమి
సంగీత సాహిత్య శాస్త్రాది విద్యలఁ
బ్రఖ్యాతి గాంచిన పట్టణంబు
నన్ని వేదాలలో నారితేరిన యట్టి
ఘన జటాపాఠుల గ్రామసీమ
కమనీయ శిల్పంపుఁ గళలతో శోభిల్లు
దేవాలయాలున్న దివ్యభూమి
పాకశాస్త్రమునందుఁ బ్రావీణ్యతై నట్టి
వారెందఱో యున్న యూరు నిదియు

రామాయణమ్ముగను రచనచేసిన ముద్దు
బాలన్న యీ యూరి పండిత కవి
కావ్యాలు రచియించి ఘన కీర్తి గాంచిన
గంగ లక్ష్మణ కవి గ్రామమిదియ
గోదావరీతీర కేదారముల పైడి
పంటలు గొను కృషీవలుల యూరు
నాఁటికాలమునుండి నేఁటికాలము దాఁక
వేనిలో మనవారు వెనుక లేరు
గీ॥ అట్టి ఘనమైన మంథెన్న పట్టణమున
జరుగుచున్నవి సాహితీసభలు నేఁడు
నందు పాల్గొన వచ్చిన యట్టి మీర
లందుకొనరయ్య నాయొక్క వందనములు.

సీ॥ కవులఁ బోషణచేసి ఘనత కెక్కిన యట్టి
రాజులెవ్వరు నేఁటి రోజులేరు
పద్యాని కొకలక్ష పసిఁడి టంకాలిచ్చు
భూపతు లెవ్వరీ పుడమి లేరు
అక్షరానికి లక్ష యగ్రషఫీలిచ్చెడు
నవ్వాబు లెవ్వరీనాఁడు లేరు
గండపెండేరాలు ఘనముగా తొడిఁగెడి
నృపతు లెవ్వార లీ నేలలేరు
మడులు మాన్యాలిచ్చి మాన్యత జూపెడు
వసుధాధిపతులు నీ వసుధ లేరు

కష్టాలుపడి యెన్నొ కావ్యాలు వ్రాసిన
నాదరించెడివార లసలు లేరు

గీ॥ ఇట్టి సందిగ్ధకాలాన నిట్టి సభలు
మనదు మంథెన్న గ్రామాన ఘనముగాను
జరుపుచున్నట్టివారలు శ్లాఘనీయు
లనుచు నుతియింతు వారి నీ దినమునందు.

సీ॥ శ్రీగల మంథెన్న సీమలో నీనాఁడు
విజ్ఞానులెందఱో వెలసినార
లట్టివారలలోన నాచార్యులై నట్టి
రాజేశ్వరాఖ్యుండు రాణకెక్కె
గఁగవారి కవిత గంగాప్రవాహంబు
విన్నవారికిఁ జెవి విందుసేయు
నాంధ్రభాషనుగల యందచందాలన్ని
వెలికిఁదీసియు మాకుఁ దెలియఁజెప్పె
కవిగ నీనాఁడు నేఁ గలము పట్టితినన్న
వారి యాశీస్సులే వాస్తవమున
భక్తి కావ్యాలను భజనకీర్తన లెన్నొ
వ్రాసి ప్రచారంబుఁ జేసినారు
పండితశ్రేష్ఠుఁడు భక్తాగ్రగణ్యుఁడు
నభినవ పోతన యనఁగ నొప్పు

ఘనముగా రుక్మిణీ కల్యాణ కావ్యంబు
ప్రకటింపఁబడియెను; పార్వతీ వి
జయము, పరీక్షిత్తు చరితములను కృతు
లావిష్కరణమగు నవసరమున
గంగవారికి జర్గు ఘనమైన సన్మాన
మును గాంచ నాకెంతొ ముదముగలిగె

గీ॥ పరమ పూజ్యులు, గురువులు, భక్తవరులు
గంగ రాజన్న కిదె నాదు కవితలోన
నంజలి ఘటింతు; సిరి సంపదాళి యశము
నాయురారోగ్యములు వారి కలరుగాత!
యనుచు దేవుని వేడెద ననుదినంబు.

మంథని
సన్మాన వేదిక
5–5–1987.

ఇట్లు
కవిరత్న' 'మంథెన వేమన'
రావికంటి రామయ్య గుప్త,
ఉపాధ్యాయుడు.

ఓం
శ్రీ శారదాయైనమః

# సన్మాన వేదికా నివేదిక

ముద్దు బాలంభట్టు వంటి మహా కవిపండితప్రకాండు లకు నిలయమైన మంత్రకూటువాటికను గంగావంశ సరిత్కవితా ప్రవాహముగూడ సస్యశ్యామల మొనర్చుచున్నది. ఈ సందర్భంగా 17-11-1985 న బ్ర॥ శ్రీ గంగా రాజేశ్వర రావుగారి వ్యవస్థాపకమున నవతరించిన గంగాతరంగిణీ సారస్వత సమితి యనేక ముద్రణ కావ్యములు వెలువరించుచున్నది. ప్రప్రథమంగా కవిశేఖరేత్యాది బిరుదాంచితులగు బ్ర॥ శ్రీ గంగా రాజేశ్వరరావుగారి "పార్వతీ విజయ" "పరీక్షిచ్చరిత" ప్రబంధము లావిష్కరింపబడుటకు నిర్ణయింపబడినది.

ప్రభవ సం॥ వైశాఖ శుద్ధ తృతీయ మంగళవారము దివి 5-5-1987 సాయంత్రము 5 గంటలకు స్థానిక శ్రీలక్ష్మీ నారాయణస్వామివారి యాలయప్రాంగణమునుండి బ్ర॥శ్రీ గంగా రాజేశ్వరరావుగారిని జీపులో బాజాభజంత్రీలతో ప్రముఖులు వెంటరాఁగాఁ బ్రదక్షిణాకృతిగా గోదావరిఖని రోడ్డు, మందాటు, నడివీథులగుండా ఊరేఁగింపుగా తీసుకొని వెళ్ళి 6 గంటలకు నగర పురోహితుల వేదఘోషతో పూర్ణకుంభ స్వాగత మొనర్చి స్థానిక శ్రీ శిలేశ్వర సిద్ధేశ్వరాలయ ప్రాంగ

ణమున నిర్ణయింపఁబడిన సన్మానవేదిక కడకుఁ గొనితెచ్చుట జరిగినది.

అనంతరము సమితి ప్రధాన కార్యదర్శి సాహితీ ప్రార్థన యనంతరము, శ్రీ. గీట్ల జనార్దనరెడ్డిగారిని కార్యక్రమాధ్యక్షులుగను, ప్రాచార్య, డా॥ కేతవరపు రామకోటి శాస్త్రి (కాకతీయ విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు) గారిని ముఖ్యాతిథులుగను, బ్ర॥ శ్రీ జి. వి. ఎల్. ఎన్. విద్యాసాగరశర్మ (స్థానిక ప్రవర కళాశాల ప్రధానాచార్యులు) గారిని పార్వతీ విజయ ప్రబంధ ప్రశంసకులుగను, శ్రీ సిహెచ్. రామకిషన్‌రావుగారిని పరీక్షిచ్ఛరిత్రావిష్కర్తలుగను, శ్రీ డి. వి. ఆర్. ఎం. ఎస్. నరసింహారావు (ఆంధ్రా బ్యాంక్ మేనేజర్) గారిని పార్వతీ విజయావిష్కర్తలుగను వేదికపైకాహ్వానించుచు, మిగిలిన సామాజిక సదస్యులందరికి స్వాగతములు పలికిరి.

అధ్యక్ష స్థానమున నున్న శ్రీ జి. జనార్దనరెడ్డిగారు తమ తొలిపలుకులో గంగాతరంగిణి కృషిని ప్రశంసించిరి. పిదప సారస్వత సమితి ప్రధాన కార్యదర్శి డా॥ శుకశ్రీగారు తమ నివేదికలో గంగాతరంగిణి యావిర్భావమును గూర్చియుఁ దద్ద్వారా సాగించుచున్న కృషినిగూర్చియు వివరించిరి. ఆ పిదప శ్రీ డి. వి. ఆర్. ఎం. ఎస్. నరసింహారావుగారు పార్వతీవిజయ ప్రబంధము నావిష్కరింపఁగా, శ్రీ సిహెచ్. రామకిషన్‌రావుగారు పరీక్షిచ్ఛరితము నావిష్కరించిరి.

తదనంతరము సన్మాన కార్యక్రమము ప్రారంభమైనది. ఇటీవలఁ బ్రారంభింపఁబడిన మంథని మిత్రమండలి కోశాధ్యక్షులుగా శ్రీ నరసింహారావుగారు శ్రీ రాజేశ్వరరావుగారికి గండపెండెరము సమర్పించఁగా మంథని మిత్రమండలి యధ్యక్షులుగా శ్రీ విద్యాసాగరశర్మగారు కవిగారికి, "కవి కులాలంకార, ప్రబంధ కవితా పరమేశ్వర" బిరుదములును, వ్యక్తిగతముగ "కళాప్రవీణ, కవితాపారీణ" బిరుదములును, రసజ్ఞుల కరతాళధ్వనుల మధ్య ప్రకటించుచు, సన్మానపత్రమును సమర్పించిరి. కవిశేఖరుల నుతించుచు, సర్వశ్రీ కవిశేఖర_ సిహెచ్. రామకిషన్‌రావు, రావికంటి రామయ్యాగుప్త (మంత్రకూటవేమన), విద్యాసాగరశర్మ, డా॥ శుకశ్రీ మున్నగువారు సన్మాన పద్యముల సమర్పించిరి. గంగా తరంగిణి వేదికాసీనులైన యతిథులకు యథోచితముగను, 'కవిశేఖర' గంగా రాజేశ్వరులను దుశ్శాలువతోను సత్కరించఁగా, పట్టణములోని వివిధ సంస్థలు, పాఠశాలలు, సంఘములు కవిగారి ననేకవిధముల సన్మానింపఁగాఁ గొందఱు ప్రముఖ వ్యక్తులును, వారి పూర్వ విద్యార్థులును ప్రత్యేకముగా సన్మానించిరి.

తర్వాత ముఖ్యాతిథులు ప్రాచార్య డా॥ శ్రీ కె. రామకోటిశాస్త్రిగారు తమ ముఖ్యాతిథి ప్రసంగమున స్వయముగఁ గావ్యప్రశంస యొనర్చుచుఁ బరీక్షిచ్చరితము- మహాభాగవ

భాంతార్గత కథ నెన్నికొని భక్తియు, సామాజికస్ఫూర్తియు, ధార్మికనీతియుఁ బ్రోదిచేసి ప్రాబంధిక శైలిలో మహోత్తమ కావ్యముగఁ దీర్చిదిద్దినారని కవిని ప్రశంసించిరి. శ్రీ జి.వి. ఎల్. ఎన్. విద్యాసాగరశర్మగారు పార్వతీ విజయ ప్రశంస చేయుచుఁ గాళిదాసు నన్నెచోడుల కథాకథనవైఖరీ ఋణికి పుచ్చుకొని నూత్న ప్రబంధశైలిలోఁ బార్వతీ విజయమును భక్తివిజయముగా నిర్మించినట్లు ప్రశంసించిరి. డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డిగారలు పంపిన యభినందనములను డా॥ శుకశ్రీగారు సభాముఖమున వినిపించి, గంగా తరంగిణీ సారస్వత సమితి, కేవలము రాజేశ్వరరావుగారి గ్రంథములేకాక; రాజేశ్వరరావుగారి పితృదేవులు, కీ. శే. లక్ష్మణ వరకవి గారివి, తదితర ప్రముఖులవి యనేక గ్రంథములు సేకరించి ప్రకటించగలమనియు, మరికొందఱు కవిని నుతించుచు మాట్లాడిరి.

అనంతరము కవిశేఖరులవారి కావ్యగానము, పార్వతీ విజయము, పరీక్షిచ్చరితములనుండి కొన్ని ప్రధాన ఘట్టములు మధురతరముగ గానము చేయఁబడినవి. అధ్యక్షస్థానమున నున్న శ్రీ గిట్ల జనార్దనరెడ్డిగారు తమ తొలిపలుకుగా, మంత్రకూట వైశిష్ట్యమును, శ్రీ రాజేశ్వరరావుగారిని, గంగాతరంగిణి సారస్వత సమితి కృషిని విశిష్టరీతిలో శ్లాఘించిరి.

ఈ కార్యక్రమ నిర్వహణలోఁ దమకుఁ దోడుపడిన సర్వశ్రీ యన్. శేఖర్, కొండేల మారుతి, పి. సునీత, పి. సురేశ్, జి. శోభారాణి, జి. రమేశ్, జి. రాజేంద్రప్రసాద్ తదితరులకు సమితి ప్రధాన కార్యదర్శి డా॥ శుకశ్రీ కృతజ్ఞతాపూర్వకాభినందనలు తెలుపఁగా, శ్రీ కొండేల మారుతి కార్యక్రమాంతమున కృతజ్ఞతావందన సమర్పణము గావించిరి.

రాత్రి 10 గంటలకు కార్యక్రమము నిర్విఘ్నముగ ముగిసినది.

" ఇతిశమ్ "

ఇట్లు
సుకవిజన వినయవిధేయుడు
డా॥ శుకశ్రీ,
**B. Sc., M. A. B. Ed., Ph. D.**
మంథని.

ఓం

శ్రీ సాయినాథాయనమః

# నా మా ట

కవితాలతాలతాంతం నాటకం. కావ్యపరిపుష్టికి, కవి పరిపూర్ణతకు ఏకూన్చి నాటకం మాత్రమే. శ్రవ్యాలు, దృశ్యాలు అని కావ్యాలు రెండు విధాలు. ప్రస్తుత ప్రకటిత గంగాతరంగిణీ పంచమ తరంగం. "గంగారూపకాలు" దృశ్య కావ్య సంపుటి. ఇందు 'మల్లెమాల' ఏకాంకిక, 'రామ రాజ్యం', 'ఎన్నికలొస్తున్నాయి - జాగ్రత్త' అను రెండు నాటికలు, 'ఝాన్సీరాణి' నాటకం చేరి ఉన్నాయి. ఇయ్యవి బహుకాల సుభద్రితాలు, ప్రస్తుత ముద్రితాలు.

నాకు చిన్ననాటినుండి వీధి భాగోతాలు, నాటకాలు తిలకించుటంటే చాలా సరదాగా ఉండేది. వానిని చదువుట యందును, ప్రదర్శించుటయందును అమితానందం పొందే వాణ్ణి. విద్యార్థిదశయందు చతుర చంద్రహాసలో దుష్టబుద్ధి (మిత్రులు శ్రీ వానమామలై వరదాచార్యులు చంద్రహాసుడు)- గయోపాఖ్యానమున గయుడు- శ్రీకృష్ణరాయ బారములో భీముడు (మిత్రులు శ్రీ ఇల్లెందుల రామచంద్ర రావు శ్రీకృష్ణుడు)- మరియు ఉపాధ్యాయ దశయందు సతీ సావిత్రిలో యముడు- భువనవిజయంలో పెద్దన- అను ముఖ్య పాత్రలను పోషించి మన్నన లందాను.

భారత స్వాతంత్ర్యానంతరం మంథని ఉన్నత పాఠశాల విద్యార్థులకొరకు రచించిన మల్లెమాల, రామరాజ్యం, ఝాన్సీరాణి అను రూపకాలు ప్రదర్శింపబడ్డాయి. కరీంనగరం జూనియర్ కాలేజి విద్యార్థినులకై వ్రాయబడ్డ ఎన్నికలొస్తున్నాయి – జాగ్రత్త అను నాటికా ప్రదర్శనకు వీలు కలుగదాయె. అవియే ఇప్పటి సంపుటీకృత ప్రచురితాలు. వీనిని రసికలోకం ఆదరిస్తుందని, ముఖ్యంగా నా పూర్వ విద్యార్థులు చదివి ఆనందిస్తారని నా విశ్వాసం.

గంగాతరంగిణీ ప్రచురణములకై కృతికర్తచే దత్తమైన రూ. 15000/– నుండి రుక్మిణీకల్యాణ ముద్రణకు రూ. 3000/– పోగా మిగిలిన రూ. 12000/– మరియు పార్వతీవిజయ ముద్రణార్థం శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ప్రసాదిత ఆర్థిక సహాయం రూ. 2900/– వెరసి రూ. 14900/– వ్యయం అగుటవల్ల నా కృతులను ముద్రితాలుగా కన్నులారగాంచి కన్నుమూయ్యాలి అను ఆపేక్షచే ప్రస్తుత పంచమ షష్ఠ తరంగాల ముద్రణకు అప్పుచేయవలసివచ్చింది. మిత్రులు, అభిమానులు, నా పూర్వ విద్యార్థులు నా పుస్తకాలు కొనుగోలుచేసి నా ఋణవిముక్తికి దోహదం చేస్తారని ఆకాంక్షిస్తున్నాను.

మూడవతరంగం 'భగవద్గీతాగానం' దివి 8–8–85 నుండి శ్రీ భామ ప్రింటింగ్ వర్క్స్, తిలక్ రోడ్, హైదరా

బాదువారికడ మూలుగుతున్నది. ముద్రణ ఖర్చులకిగ్రింద వారికి ఇంతవరకు రూ. 4000/- ముట్టియున్నవికూడాను. అది అత్యంత దురదృష్టకర విషయము, శోచనీయాంశము కూడాను. శ్రీ గంగాతరంగిణీ సారస్వత సమితి, మంథని వారు ముఖ్యంగా డా॥ శ్రీ శుకశ్రీగారు దీనిని అనతికాలంతో విడుదల చేయింతురుగాక! అని నా ప్రాధేయపూర్వక ప్రార్థన.

ఈ గీతాగాన ముద్రణకై దత్తంచేసిన ధనం కృతిభర్త శ్రీ చెప్యాల రామకృష్ణారావు, మేడిపెల్లి గారివద్దనే భద్రంగా వున్నది. సకాలాన గ్రంథ ప్రచురణ జరుగని కారణాన వారిని ఎదిరిచూపులకు గురిచేసినందులకు మిక్కిలి చింతిస్తూ క్షమాపణ తెలుపుకొనుటకు సిగ్గవిపిస్తున్నది.

ఈ రూపకాలకు సమాహ్వానమును సన్మానవేదికా నివేదికను అందించిన డా॥ శుకశ్రీగారికిని, అభిమానంతో 'రూపకాలోకనం' వ్రాసి పంపిన శ్రీ జి. వి. ఎల్. ఎన్. విద్యాసాగర శర్మగారికిని, తమ 'అభిలాష' దయతో అంద జేసిన శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారికిని, ప్రేమతో 'వేడికోలు' ఒసంగిన శ్రీ కా. సుబ్రహ్మణ్యంగారికిని నా హార్దికాభివందనములు.

దివి 5-5-87 నాటి మంథని సన్మానవేదికపై గండ పెండేరము బహూకరించిన మిత్రమండలి కోశాధికారి శ్రీ డి. వి. ఆర్. ఎం. ఎన్. నరసింహారావుగారికిని, గంగా

తరంగిణీ సారస్వత సమితి పక్షమున శాలువాకప్పి సన్మానా క్షరాక్షత సుమాంజలి ప్రసాదించిన డా॥ శుకశ్రీ, ప్రధాన కార్యదర్శిగారికిని, మిత్రమండలి పక్షమున సన్మాన పత్రి మును, "కవికులాలంకార"- "ప్రబంధ కవితా పరమేశ్వర" అను బిరుదములను మరియు తన తరఫున జయగీతమాలిక తోపాటు "కళాప్రవీణ"- "కవితాపారీణ" బిరుదములను బహూకరించిన 'సరస సాహితీచరణచారణ చక్రవర్తి' శ్రీ జి. వి. ఎల్. ఎన్. విద్యాసాగరశర్మగారికిని, పద్య నవరత్న మాలను దయచేసిన 'కవిశేఖర' చెప్యాల రామకృష్ణారావు, మేడిపెల్లి గారికిని, కవితాంజలిని ఒసంగిన కవిరత్న శ్రీ రావి కంటి రామయ్య గుప్త గారికిని, నాడు సన్మానవేదికపై సభా ముఖమున కృతజ్ఞతలు సమర్పితములు; నేడు పుస్తక ముఖ మున పునః అభివాదములు అందజేయుటకు గర్విస్తున్నాను.

వస్త్రాదుల రూపంలో సత్కరించిన శ్రీ కర్ణె పుల్లయ్య ఇత్యాది పురప్రముఖులకు ఇందుమూలమున మరల అభివా దాలు అందజేయుచున్నాను. కవి సన్మాన నిర్వాహక కమిటీ నియోజకులగు శ్రీ కె. మారుతి మరియు శేఖర్‌గార్లకు ధన్య వాదాలు. గండపెండేర సత్కారపు ఫోటోకాపీలు రెండు అదనంగా తయారుచేసి యిచ్చిన శ్రీ రాజేశ్వర్‌గారికిని, ఆ ఫోటోలను నాయందుగల అభిమానముతో నాకొరకు ప్రత్యే కముగా కరీంనగర్ ప్రెస్సులో సకాలమునకు తెచ్చియిచ్చిన

నా పూర్వవిద్యార్థి శ్రీ అంజయ్య, రిటైర్డు హెడ్‌పోస్టుమాస్టరు గారికిని కృతజ్ఞతలు తెలుపకుండ ఉండలేను.

గంగారూపకాల వ్రాతప్రతిని సరిచూచిన డా॥ శుకశ్రీ గారికిని, పరిశీలనతోపాటు ప్రూఫులు చూడటమందు సర్వ విధాల సహకరించిన మిత్రులు శ్రీ పారువేళ్ళ గోపాలకృష్ణ శర్మగారికిని మరియు మంథెనలోనేకాక ముద్రణకాలంలో కరీనగరంలో ఈ కార్యనిర్వహణమున సహకరించిన శ్రీ కా. సుబ్రహ్మణ్యంగారికిని మరిమరి కృతజ్ఞతలు.

గంగాతరంగిణీ ప్రచురణలకు నన్ను ప్రోత్సహించి సర్వవిధముల సహకరించిన సర్వశ్రీ గట్టు గణపతి, జి. విద్యాసాగరశర్మ, డా॥ శుకశ్రీ మరియు పారువేళ్ళ గోపాల కృష్ణశర్మగారల మేలు ఈ జన్మలో మరువరానిది.

ఈ గ్రంథమును సకాలంలో చక్కగా ముద్రించుటయే కాక ముద్రణకాలములో నివాసవసతియు, ఇతర సౌకర్యా లను ప్రేమతో సమకూర్చిన మిత్రులు శ్రీ ఎన్. మధుసూదన్ ప్రొప్రయిటర్, శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్, కరీంనగర్ గారికి మిక్కిలి కృతజ్ఞుడను.

— కృతికర్త.

# కృతి సమర్పణ

క॥ జననికి రాజేశ్వరికిన్
జనకునకున్ లక్ష్మణార్య సత్కవికిం, బెం
చిన యన్నమ పితృభగినికి
ననుస్మరణపూర్వకముగ నంజలు లిడుదున్.

క॥ కంటివి, నవవర్షంబులు
కంటివి కంటికిని ఱెప్పగా నను, నాలోఁ
గంటివి పతిరూపంబును,
గంటివి యుపశమనఁ జలువకంటిరొ! తల్లీ!

క॥ వింటివి పుత్రోత్సవ, మను
కొంటివి పితృ ఋణవిముక్తిఁ గొంటి నటంచున్,
నింటను బనిలే దంటివి,
మింటికి నెగసితివి కీర్తి మిగిలెను. దండ్రీ!

— సీస గర్భ గీతమాల —

పాలు గుడుచునాడు పారాడునాడును,
నడచునాడు పరుగు లిడెడునాడు,
మాటపలుకునాడు పాటపాడెడునాడు,
శాలకుఁ జనునాడు చదువునాడు,
ఊరు విడిచి వెళ్ళె దుద్యోగి యగునాడు,
నీడవోలెను నన్ను వీడకుండఁ
బ్రేమను నను నాదు పెండ్లాము పిల్లల
మంచి మనసుతోడఁ బెంచుచుంటి

కన్న పేర్మికన్న మిన్న పెంచిన ప్రేమ
యన్న వాక్య మిట యథార్థమయ్యె.
నీదు ఋణముదీర్ప నే నేర, నత్తమ్మ!
హస్తములను మోడ్తు మస్తకమున.

ఆ. వె॥ నవ్వ్రరాజు నీవు నవ్వుచునుంటివి
యేడ్వరాజు నీవు నేడ్చుచుంటి;
రాజు సర్వమంటి రాజున కీ విప్డు
దూరమైతి సుఖము దూరమయ్యె.

క॥ అవ్వమ పెంచుటచే నన్
నన్నమరాయ డనిరి వ్యవహారమునందున్
కన్నయ యశోద కృష్ణుం
డన్న బిరుదుఁ బొందలేదె? యలనా డుర్విన్.

సీ॥ శ్రీకృష్ణదేవరాడ్జీవితకథ నాఁటు
కంబుగాఁ బలచిన ఘన కవీంద్ర!
దంకారణ్యంపుఁ దాపసుల చరిత్ర
వ్రాసి వాసినిగన్న వర కవీంద్ర!
చంద్రకాంత పేర చక్కని నాటక
రచన గావించు సరస కవీంద్ర!
భక్త కుచేలుని భద్ర చరిత యను
హరికథఁ జేయు మహాకవీంద్ర!

తే. గీ॥ ప్రథమములు రెండు కాలగర్భమునఁ గలసె;
చివరి రెండిప్డు వెలుగును జేరఁగలిగె
లక్ష్మణార్యుల కృతులు సలక్షణములు
నొజ్జబంతులు సుకవిజనోత్తములకు.

క॥ గంగావతరణ మయ్యెను
గంగాధరు జటలఁ ద్రిపథగామిని యనగన్;
గంగారూపక కావ్యము
గంగా రాజేశ్వర కవి కలమున వెలసెన్.

క॥ దేవసముండగు మత్పితృ
దేవుని చరణాబ్జములకు దివ్యంబౌ నా
యీ వరకృతి నర్పించెద
పావనమౌ జన్మ యింక భ్రాంతులు దొలగున్.

శా॥ గంగాధారి శిరఃప్రసూనమగుడున్, గాంతుల్ విశేషించె, శ్రీ
శృంగారంబులు హెచ్చెఁ జందురునకుం జేకూరె భద్రశ్రీంబులున్;
గంగా లక్ష్మణ పాదపద్మయుగ సౌగంధ్య ప్రయుక్తంబులౌ
గంగారూపక కావ్యపుష్పసురభుల్ క్ష్మామండిలిన్నించెడున్

క॥ సుమనో గురు సమబుద్ధికి
సుమనో విభు సదృశ సుగుణ సుందరునకు నే
సుమనస్సున నిడెద నమ
స్సుమనస్సులు లక్ష్మణ కవి శుభచరితునకున్.

# ప్రస్తుతి

క॥ శ్రీరామా! గాంధీ హృద
యారామా! పతితహారి జనావన! శ్రీ రా
జారామా! రాఘవ! సీ
తారామా! నిను స్మరింతుఁ దారకనామా!

క॥ ఆసేతు శీత కుధర ని
వాసిత జన జనని! సదయ! భారత మాతా!
నీ సుతుల నాదుకొను మా
భాసుర గాంధేయ సత్య పథగాములుగన్.

ఉ॥ దైత్యునడంచి వామనుఁడు ధాత్రి విశృంఖలజేయు ప్రక్రియన్
సత్య, మహింస, శాంతులను శస్త్రములంగొని తెల్లవారితో
నిత్యముఁబోరి మాతృధరణీ పరతంత్రత బాపు బాపు, సం
స్తుత్యు! మహాత్ము, జాతిపిత స్తోత్రముచేసెద గాఢభక్తిమై.

క॥ మఱచితి గాంధీతత్త్వము;
మఱచితి గాంధీవిధాన మహిమా బలమున్;
మఱచితి గాంధిని సహితము;
మఱువను గాంధేయుడ నను మాట యొకటియే.

క॥ తెలియని దుష్టసుతుని త
ప్పులు వెంచక భారతాంబ! ప్రోవవె వానిన్
ఇలను గుపుతుస్త్రిం డుండును
గలదే యారయఁ గుమాత కరుణా హృదయే!

ఓమ్

శ్రీ గణేశాయనమః

శ్రీ శారదాయైనమః

# గంగా రూపకాలు

## మల్లె మాల

(ఏకాంకిక)

### ప్రథమ రంగం

ప్రదేశం : శివశంకరశాస్త్రి పూజామందిరం,

సమయం : ఉదయం 7 గంటలు.

ప్రవేశం : శివశంకరశాస్త్రి.

శివ : (హారతి వెలిగించి గంట వాయిస్తూ పాడుతాడు)

హారతిదుగో నీకు సాంబలింగయ్యా!

హారతిదుగో కొనర ప్రాణలింగయ్యా!

నీరాజనం నీకు నే భక్తితో నిత్తు;

మారారి నన్ను నీ మార్గాన పైకెత్తు.

రాజలింగా! వృద్ధాప్యంలో కల్గిన ఏకైక పుత్రుడు, ప్రాణ తుల్యంగా పెంచుకొన్న నా ముద్దుల తనయుడు, గారాల బిడ్డడు దుష్ట సాంగత్యంవల్ల దినదినం చెడిపోతున్నాడు.

వాణ్ణి నీవు ఎలా వుద్ధరిస్తావో? అన్న విచారం తప్ప వేరే విచారం ఏదీలేదు. లోకం క్షణక్షణం అధోగతికి దిగజారి పోతూవున్నది. ఎటుచూచినా చూడనొల్లని దృశ్యాలే, విన నొల్లని వాక్యాలే. ఏ అఘాయిత్యం చూడకుండా- ఏ అన ర్థం వినకుండా నన్ను నీలో ఎలా చేర్చుకుంటావా? అన్న కోర్కె తప్ప వేరే కోరతగింది లేదురా తండ్రీ!

(తెరలో చాటింపు)

నేడు అంటరానితనం రూపుమాపు దినోత్సవ సందర్భాన సాయంకాలం నాలుగు గంటలకు రామలింగేశ్వర దేవాల యంలో హరిజన ప్రవేశం జరుగుతుంది. కనుక స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొని తగిన ప్రోత్సాహం ఇస్తారని, హరిజనోద్ధరణ సమితివారు కోరుతూవున్నారు. హో! ఢమ ఢమ ఢమ ఢాం ఢాం ఢాం.

శివ : (వినుటకుపక్రమిస్తూ) ఆఁ, అదేదో చాటింపువలె వున్నది. సరిగా వినబడ్డంలేదు. (భార్యనుద్దేశించి) ఏయ్ పిల్లా! ఎవరే అక్కడ? ఏమిటే ఆ చాటింపు?

(ప్రవేశం భ్రమరాంబ)

భ్రమ : ఓ! ఏమీలేదండీ! సాయంకాలమటా- గుళ్ళో హరి జనప్రవేశమట.

శివ : ఏమిటే? హరిజనులా! గుళ్ళోనా! చొరబడటమా! శివ! శివ! (చెవులు మూసుకొంటాడు) ఏం పాపిష్ఠికాలం

దాపరించిందే! అందుచే కాలం యిలా భగ్గునా మండి పోతోంది. శంభో! శంకరా! హరహరా! కాలకంధరా! నీగ్గూడా యిష్ట మేనా యిది? పాపం నువ్వుమాత్రం ఏం చేస్తావు? సాక్షిమాత్రుడవుగదా! ఎవళ్ళ కర్మఫలం వాళ్ళ కందజేస్తూవుంటావు. సరే! నీయిష్ట మెకానీ, ఇంతకూ ఎవడే ఈ పాపానికి ఒడిగట్టింది? వాడేనా? ఆ శర్మగాడు, పరమ నాస్తికుడు, నీతిమాలినవాడు. చండాలపు పను లన్నిటికీ నేనే ముందంటాడు. మాలల నుద్ధరిస్తాడట– మాదుగుల చదివిస్తాడట, చివరకు మన్నెపుదాన్ని పెండ్లి కూడా చేసుకునేట్టుంది వాని వాలకంచూస్తే. తాచెడ్డ కోతి వనమెల్లా చెర్చిందన్నట్లు మన చవటనుగూడా తనతోపాటు భ్రష్టుణ్ణి చేస్తున్నాడాయె. వాని మొగం చూస్తే అన్నం పుట్టదు; వాని పేరుతలిస్తే పాపం చుట్టు కొంటుంది. వానికి వినాశకాలం ఎప్పుడోస్తుందోరా? దేముడా!

భ్రమ : (మధ్యలో అందుకొని) ఏమండోయ్! మీకుఙ్ఞాణి తిట్టుకుంటె తిట్టుకోండి, కాని పరాయి పిల్లవాణ్ణి ఆడి పోసుకుంటేమాత్రం నేను సహించలేను సుమండీ!

శివ : అవును; ఎందుకు సహిస్తావు. ఇష్టమైంది ఇంగుతో సమానంకదూ! బంగారంలాంటి పిల్లవాడు పాడైంది నీ మూలానకాదుటే! ఓ లక్కీ ఇంగ్లీషు చదువు వాణ్ణి చది

వించొద్దంటే విన్నావా? ఒసే! ఆ గాంధి పూజలు మాన మంటే నువ్వు మానుతున్నావా? పోనీ నీ కుమారరత్నానికి ఆ దుష్ట సావాసం మాన్పించమంటే మాన్పించావా? చివరికి ఆ మాలవాడలపొంటి తిరక్కుండా నిల్పమంటే నిల్పావా? 'తల్లి కొద్ది బిడ్డలు- ఇల్లుకొద్ది పందిరి' అని వూరకే అన్నారా? తల్లి రాణి- తనయుడు ప్రధాని. నన్నెవరు కాంతారే ఈ పాడు కొంపలో? ఇదంతా ఆ గాంధీతత్త్వం- ఆ నాస్తిక మత ప్రభావమే.

భ్రమ: ఇదిగోనండీ! నన్ను మీరు ఏమన్నా వింటాను; ఎన్నితిట్టినా పడతాను; ఏంచేసినా సహిస్తాను కాని ఆ మహాత్ముణ్ణి, ఆ అవతార పురుషుణ్ణి, ఆ ఆదర్శమూర్తిని ఆ భారత నేతను, జాతిపితను వొక్క మాట అన్నారంటే నా వోర్పంతా నశిస్తుంది; నావిధేయత అంతా వొక్కసారి అణగారిపోతుంది. ఇగ జవాబివ్వకుండా వుండలేనంటే నమ్మండి. మహాత్ముడు చేసిన తప్పేమిటండీ? అనేక కడగండ్లకు పాలై దేశమాత దాస్యశృంఖలాలు త్రెంప టమా అతడు చేసిన తప్పు? పతితులనిపించుకొని, బహి ష్కరింపబడి దిక్కుమొక్కులేక వూరిబయట పడియున్న వారికి హరిజనులని పేరుపెట్టి, వారిని వుద్ధరించుటకు కంకణం కట్టుకోటమేనా అతడు చేసిన తప్పు? నల్లని అద్దాలగుండా చూస్తే కైలాసపర్వతంకూడా నల్లగానే

తోస్తుంది. మనవలె హరిజనులు మానవులు కారా? మనలో
ప్రవహిస్తూవున్న రక్తం వారిలో ప్రవహించడంలేదా?
మన కంచాల్లో తినిపిస్తూవున్న పిల్లులకన్నా, మన మం
చాల్లో పడుకోపెట్టుకుంటూవున్న కుక్కలకంటే నికృ
ష్టులావాళ్లు? వాళ్లను అంటుకుంటే మైలపడతాంకదూ!
వాళ్ల నీడసోకుతే అపవిత్రులమౌతాం కదూ! వాళ్లు
పండించి తెచ్చిన ధాన్యం పనికివస్తుంది— వాళ్లు పిండి
ఇచ్చిన పాలు పనికివస్తాయి కాని వాళ్లుమాత్రం పనికి
రారు అంతేనా? అయితే వాళ్లు పంచములుగా ఎందుకు
వూరిబయట వుంచబడ్డారని కదూ! మీ ప్రశ్న— వారి
పూర్వులకు పూర్వులకు పూర్వులెవరో సాంఘిక నీతినియ
మాలకు విరుద్ధంగా ప్రవర్తించి ఉంటే విధించిన ప్రాయ
శ్చిత్తాలకుకూడా వప్పుకోకపోతే శిక్షారూపంగా వాళ్ళను
వెలివేసివుంటారు. అంతమాత్రాన తమ పూర్వీకుల పాప
ఫలితాలను వాళ్ళ సంతతివాళ్ళందరూ నేటికినీ శాశ్వ
తంగా అనుభవించాల్సిందేనా? వాళ్ళకు ఇక మోక్షం
లేదా? ఇది అన్యాయం, అమానుషం, అసహ్యం. పతు
తులకూ ఉద్ధరణ వుంది. మొన్న మీరేకదా పురాణ కాల
క్షేప సందర్భాన సెలవిచ్చింది— 'శ్వపచులైనా గీతాశ్ర
వణంచేతనే వుత్తమగతి పొందుతా' రని. అవన్నీ పుక్కిటి
పురాణాలేనా? కావు; కదాపి కావు. కావున మీరు

లోతుగా ఆలోచించండి- స్వార్థం వదలండి- పతితులను వుద్ధరించుటకు మీ పాండిత్యం వుపయోగించండి- లెండి- కాలప్రవాహానికి ఎదురీదటం పనికిరాదనినమ్మండి నామాటలు దయచేసి వినండి- మీకు పుణ్యంవుంటుంది.

శివ : ఒసీ, దౌర్భాగ్యురాలా! నంగనాచీ! ఎన్ని మాటలు నేర్చావే! ఎంత సాహసానికి పూనుకున్నావే! ఎంత పాపానికి ఒడిగట్టావే! ఏదో బీద యింటి పిల్లవనీ, చదువు కున్నదానివనీ, నన్ను వుద్ధరిస్తావనీ, నా తలపుండ్లు కడు గుతావనీ మోసపోయి నిన్ను అంటుగట్టుకున్నాను. కాని నాస్తికురాలవని, నట్టేట పుట్టిముంచేస్తావని ముందే తెలిస్తే నేను ఆజన్మ బ్రహ్మచారిగానే వుండేవాణ్ణిగదే! తప్పు తప్పు, మరిచాను మరిచాను. నేను మొదట్లో సుబ్బలక్ష్మి మొగుణ్ణికదూ! నా సుబ్బులూ! నా మేనమామ కూతురూ! నా నోములపంటా! నా ప్రేమరాశీ! నీ తోడి జీవితం మున్నాళ్ళ ముచ్చటాయెగదే! నన్నీ పాపపం కిలంలో త్రోసి హంసవలె యెగిరిపోతివిగదే! (కంట నీరు పెట్టుకుంటాడు) అవును నీవు పుణ్యాత్మురాలివి; నీకు భవిష్యత్తు తెలుసు; ఈ దుష్ట ప్రపంచంతో పని లేదని, తొందరగానే లింగైక్యం చెందావుకదే! నాకు కొంచ మైన సూచనచేస్తే నేనుకూడా నీతోనే వచ్చేవాణ్ణికదే! 'పాపీ చిరాయుః సుకృతీగతాయుః' అని ఊరకే పుట్టించా

సామెత? అయ్యో, అయ్యో! (తల బాదుకొంటాడు) నా పాపంపగలా! ఈ ముతనష్టపు లోకంలో ఈ పనికి మాలిన బ్రతుకిక బ్రతుకలేను. హరహరా! ఇక సనాతన ధర్మానికి భరతవాక్యం పలుకవలసిందేనా? వేదాలు అడుగంటవలసిందేనా? ఓరి నా భగవంతుడా! (భార్య వైపు తిరిగి) ఓసీ! నీవు భ్రమరాంబవుకదూ! అందుకే భ్రమరమువలె నా మతిని భ్రమింపజేస్తున్నావు కాని, నీవు అంబవుమాత్రం కావు; వుత్త డాంబికురాలివి. (ఆవేశంతో) నువ్వూ, నీ పుత్రరత్నమూ నేడే ఈ ముహూర్తం లోనే మాలల్లో కలిసిపోండి, ఓ మన్నెపుదాన్ని తెచ్చుకోండి ఇంటి కోడలుగా, మీ మాదిగరాజ్యం ఏలుకోండి ఇది నా ఆత్మలింగసాక్షిగా భర్తనైనందుకు ఆజ్ఞాపూర్వకంబుగా చెబుతూవున్నమాట (కనులు మూసుకొని) హరహరా! కాలరుద్రా! అగ్నినేత్రా! విషగళా! పాహిమాం! పాహిమాం! లింగా, భవభంగా! నన్ను నీలో చేర్చుకోరా! (చిన్నపంచె గొంతుకుచుట్టి బిగించుకోపోతూంటాడు).

భ్రమ : అయ్యో, అయ్యో ! రక్షించండి_ రక్షించండి. (కంఠం తడబడుతుంది).

(తటాలున సాంబమూర్తి ప్రవేశించి పంచె లాగివేస్తాడు)

సాంబ : (ఖిన్నుడై) నాన్నా! నీకు వచ్చిన ఆపత్తేమి?

(తల్లివైపు మొగమై) అమ్మా! నాన్న ఈ అఘాయిత్యా నికి పాలుపడటానికికారణం? (ప్రశ్నార్థకంగాచూస్తాడు)

భ్రమ: (తేరుకొని) నా కొడుకా! నా నాయనా! నువ్వు రాకుంటే మన కొంప మునిగేదిరా, నా బొట్టు రాలేదిరా. నా పసుపు కుంకుమ కాపాడి, వైధవ్య సముద్రంలో కొట్టుకోపోకుండా నన్ను రక్షించావురా తండ్రీ! (ఏడుస్తూ కొడుకును కౌగిలించుకుంటుంది).

సాంబ: (ఓదారుస్తూ) అమ్మా ఏడువవాకు. నేడు మనం లేచిన వేళ మంచిది. మన పూర్వపుణ్యం ఇంకా మిగిలి వుంది. అసలు సంగతేమిటో చెప్పావేకాదు.

భ్రమ: (నిట్టూర్పు విడుస్తూ) సంగతీలేదు; చత్రుబండలూ లేవు. ఇవ్వాళ్ళ లేచినతోడనే యెవరిమొగం చూచానో కాని ఇంత అపవాదుపాలు కావలసివచ్చింది.

సాంబ: అది సరే, కాని జరిగిందేమిటి?

భ్రమ: ఆయనగారేదో మిమ్మల్ని ఆడిపోసుకుంటూంటే నేను మెదలకుండానే వున్నాను_ ఇవన్నీ మనకలవాటే కనుక_ కాని మహాత్ముని విషయంలో ఏదో అనేవరకు నా వోపిక కాస్తా హారతికర్పూరంలా హరించుకోపో యింది. ఉద్రేకం పట్టలేక ఖచ్చితంగా రెండు ముక్క లనివేశాను. అదే ఆయనగారిని ఈ స్థితికి తెచ్చిందిరా బాబూ! (మరల యేడుస్తుంది).

(శివశంకరశాస్త్రి తటాలున లేస్తూ దయ్యంపట్టినవాని వలె తూలుతూ)

శివ: ఆగు. నువ్వు ఆలివికావు; నేను మగణ్ణికాను- వీడు కొడుకుగాడు; నేను తండ్రినికాను- మీకూ నాకూ నేటితో రుణం తీరింది; నేను చస్తాను; నన్ను చావనివ్వరుకదూ! (కొడుకువైపు తిరిగి) అయితే ఈ మాదిగ రాజ్య పట్టాభిషేకం నీకు కట్టేపోతాను. ఏదీ! ఆ మారి గాని బిడ్డ మల్లిని తీసుకరండి; ఇద్దరికీ ముద్దుగా ఆమూడు ముళ్ళూ వేయిస్తాను; ఆవెనుక నా దారి నాది; ఏగంగో గోదారో చూసుకుంటాను.

సాంబ: అయ్యో! నాన్నా! నీకేమైన మతిపోయిందా ? ఏ గ్రహమైన సోకిందా ఏం?

శివ: మతి వుంటేకదరా పోవటానికి- నేనే బ్రహ్మగ్రహాన్ని ఇక ఏ గ్రహం నన్ను సోకగలదు? (బయటకు చూచి) ఎవర్రా అక్కడ? వివాహమంటపం వేయించండి- బాజా బజంత్రీలు పిలువండి- సమస్త శోభనద్రవ్యాలు సిద్ధం చేయండి. అయ్యో! యెవ్వరూ పల్కరేం ? ఎందుకు పల్కుతారు? నేను మతిలేనివాణ్ణి, జీవచ్ఛవాన్ని. అదిగో శివుడు పిలుస్తున్నాడు. వస్తున్నాను. (పోబోతాడు)

సాంబ: (పట్టుకొని) నాన్నా! నువ్వు కలువరిస్తున్నావా? ఇది నిద్రావస్థ కాదుకదా!

శివ: (పెనగులాడుతూ) ఔను, ఇది నిద్రే; పెద్ద నిద్దురకు నాంది. నేను లింగైక్యం చెందాను. ఇప్పుడు అంతా సమం; ఉచ్చనీచాలు లేవు; మిట్టపల్లాలు లేవు. రండీ! హరిజనులను పిలవండి; దేవాలయం ప్రవేశిద్దాం, లెండీ! సపంక్తి భోజనాలు చేద్దాం. అయ్యో! యెవ్వరూరారేం? సరే నేనే పిల్చుకొవస్తాను. (పోబోతూ పడిపోతాడు; సాంబమూర్తి పట్టుకుంటాడు) ఇప్పుడంతా ఏకరసం— అభేదం— అఖండం— అద్వితీయం— శివోహం— శివోహం.

(తెర పడుతుంది)

## ద్వితీయ రంగం

స్థలం : శివశంకరశాస్త్రి ఇంటిముందటి యరుగు.

సమయం : 12 గంటలు పగలు.

ప్రవేశం : సాంబమూర్తి ఉదాసీనుడై

(స్వగతము)

సాంబ: నేడు అస్పృశ్యతా నివారణ దినోత్సవం. అంటే— అంటరానితనాన్ని రూపుమాపుటకై భారతదేశమంతటా జరుపుకోబడు పండుగదినం. ఈ వుత్సవంలో మనస్ఫూర్తిగా పాల్గొనేందుకు నాకెందుకో కాళ్ళాడకున్నవి. ఇంటివద్ద వుదయపు సంఘటన చూస్తే అంతా అయోమయంగా వుంది. నా ప్రవర్తన నచ్చని తండ్రికి హృదయ

భారంవల్ల మతిచాంచల్యం ఏమైనా సంభవిస్తుందా? అని పిస్తుంది. ఒక్కొక్కసారి నేను దారితప్పి నడుస్తు న్నానా? అను శంక బాధిస్తుంది. సర్వ మానవులను సమానంగా చూట్టం తప్పా? పతితుల నుద్ధరించడం నిషిద్ధమా? సాంఘిక దురాచారాలను రూపుమాపుటకు ప్రయ త్నించడం దూష్యమా? కాదు; ఎన్నంటికి కాదు; కాని తండ్రిని ఎదిరించడం, అతనికి మనస్తాపం కల్గించడం తప్పే, ముమ్మాటికీ తప్పే. ఇప్పుడు కింకర్తవ్యం? తల్లి చేయూత యున్నది కనుకనే నేనింతవరకు నా లక్ష్యసా ధనయందు ముందడుగు వేయగల్గుతున్నాను. (కొంత ఆలోచించి) వ్యక్తులవల్లనే సంఘం ఏర్పడుతుంది, నిలు స్తుంది. ప్రతి వ్యక్తికి సంఘంలో ప్రత్యేక వ్యక్తిత్వం వుండేవుంటుంది. కాని సంఘానికి ప్రాధాన్యత వచ్చిన ప్పుడు వ్యక్తి మరుగునపడిపోతాడు. కావున సమాజాన్ని గూర్చి పాటుపడుతున్నప్పుడు వొక్క వ్యక్తియొక్క కష్ట సుఖాలు లెక్కించాల్సిన అవసరం లేదు.

ఓహో! మరిచాను; మల్లె తండ్రికి జబ్బు తీవ్రరూపం దాల్చింది. మల్లెకు తండ్రిగురించే మనాది యేర్పడ్డది. ఏలాగైనా ఆయన వ్యాధి కుదుర్చుటకై మంచి డాక్టర్ ను సంప్రదించాల్సి వుంది. అతగానికి నామీద ఏదో మొదటినుంచి అనుమానం. అతని దృష్టిలో నేనొక

శత్రువునై పోయాను. నిన్న నా యింటి కడప త్రొక్క వద్దని ఖచ్చితంగా చెప్పేసాడు. కాని మల్లెను చూడంది నేనొక్క క్షణం ఉండలేకపోతున్నాను. మల్లె ఉమ్మెత వనంలో వొక్క తులసిమొక్క. ఆ వుమ్మెతవనాన్ని తులసివనంగా మార్చాలి అని ఆమె ఆశయం. ఇచ్చట మా యిద్దరి ఆశయాలూ, లక్ష్యాలు ఏకమైనాయి. ఆ యేక లక్ష్యమే మా యుభయుల మనస్సులను ఏకం చేసింది. ఈ సంఘ సంస్కార మహాయజ్ఞంలో ఈయమ నాకు చేదోడు వాదోడుగా నిల్చింది. నా లక్ష్యసాధనలో నేను ఇంత శీఘ్రముగా పురోగమించగలిగానంటే దానికి కేవలం మల్లె చేయూత చలువయే కారణం. మల్లెకు నేనంటే ఎందుకో వల్లమాలిన ప్రేమ; నాకు మల్లె అంటే బహిః ప్రాణంగా తోస్తుంది. మల్లె సంతోషమే నా సంతోషం. ఎన్ని అవాంతరాలు కల్గినా మల్లెకై నా జీవితాన్ని సయితం అర్పణచేయడానికి సంసిద్ధంగా వున్నాను.

(వెనుకనుండి సూరిశర్మ ప్రవేశించి వీపు తట్టుతాడు_ మూర్తి వులిక్కిపడి చూస్తాడు).

సూరి: అదేవిట్రూ ఫ్రెండ్! ఏం? ఇలావున్నావు?

సాంబ: ఎలావున్నా? బాగానే వున్నాను.

సూరి: నీ మనోభావానికి నీ మొగమే అద్దంపడుతున్నది.
అఖిల భారతదేశంలో ఈనాడు బ్రహ్మాండమైన వుత్సవ

దినం కదా! ఇట్లాంటి సందర్భాన మనకు ఘనమైన ప్రోగ్రాం స్వాగతం పలుకుతూ వుండగా నీయీ విచారాలు, పరధ్యానాలేమిట్రా? నీ మల్లె యేమైనా అలిగిందా? మీవుభయుల ప్రేమాయణంమధ్య ఆ మారయ్య 'నీవుడ్ బి ఫాదరిన్లా' అంటే నీ కాబోయే మామ పానకంలో పుడుకైనాడా? లేక మీ ప్రేమ బాంధవ్యాలను మీ నాన్న ససేమిరా అన్నాడా? ఇవన్నీ తర్వాత విచారిద్దాం, గాని సంఘ సంస్కార సమితివారు ఏర్పాటు చేసిన సపంక్తి భోజనాలకు వేళ అవుతున్నది. లే! పోదాం.

సాంబ: ఆ సంఘ సంస్కార సమితివారి ఆశయాలూ, లక్ష్యాలూ అన్నీ బాగానే వున్నాయి; సభలతో సంతోష పడతారు, మాటలతో కోటలు కడుతారు, స్వార్థంకోసం ఎన్ని వేషాలైనా వేస్తారు, క్రియామాత్రశూన్యులువారు.

సూరి: అదేవిట్రా? క్రియాశూన్యులంటావు. సపంక్తి భోజనాలూ, దేవాలయ ప్రవేశాలూ, వర్ణాంతర వివాహాలూ యివన్నీ క్రియలుకావా? వీటిని జరుపుతూవున్నవాండ్లం మనమేకదా! ఇవ్వేళ్ళ నీకీ పిచ్చెందుకుపట్టిందో నాకర్థం కావడంలేదు. మాంచి జిలేబీలు, ఆలుభాత్, బూందీ, పకోడీల దావత్; ఊఁ, లే! (గడియారంచూస్తూ త్వరపడ్తాడు) తర్వాత మనమున్నాం, మన విచారాలున్నాయ్.

సాంబ: ఏమోనోయ్ శర్మా! నాకీవేళ వంట్లో బావుంటం లేదు; మనసులో మనసులేదు; ఆకలి అసలుకేలేదు; నన్ను క్షమించు; నువ్వు పోయిరా.

సూరి: ఓహో! నీ మనసు మంచిగా లేకుంటాన్కి కారణం ఊహించలేనంతటి దద్దమ్మననుకుంటున్నావా? ప్రొద్దున ఇంట్లో నీమూలాన జరిగిన అలజడికదూ ఇందుకుకారణం? ఆరి నీ యమ్మకడుపు బంగారంగానూ- ఈలాంటి అల్లరు మా యింట్లో ఐతే నిత్యకృత్యాలు. చూడు ఇందాక మా నాన్న నన్నెట్లా బాదాడో! (వీపు చూపుతాడు) అయినా 'ఐ డోంట్ కేర్' నేను లెక్కించను. దీనివల్ల నావుత్సాహం ద్విగుణీకృతం అవుతుంది; ఉషారు పెరుగుతుంది; కార్యశూరత్వం బలపడుతుంది. మనలాంటి దీక్షాపరులు ఐన యువకులు 'సోకాల్డ్ జెంట్స్' పేరుకు పెద్దమనుషులరీతి కాకుండా సమయపాలన తప్పకుండా చేయాలి- ముఖ్యంగా భోజనాల విషయంలో- అందుకే అన్నారు పెద్దలు 'భోజనాలకు ముందూ, స్నానాలకు వెనుక' అని.

సాంబ: సారి బ్రదర్! నీవు వెళ్ళిరా; తరువాత తీరిగ్గా మాట్లాడుకుందాం.

సూరి: మూర్తీ! ఇదా నీ దేశభక్తి? ఇదా నీ సంఘసంస్కరణానురక్తి? ఇదేనా నీ యస్పృశ్యతా నివారణా దీక్ష?

దీనజన శ్రీరామరక్ష? ఇదంతా చూస్తూవుంటే ఆ మల్లె అను చేపను పట్టటానికి నీవు పన్నిన వలలాగుంది. ఇప్పుడు నీ స్వార్థబుద్ధి బయటపడింది. నీవేవో ఘన కార్యాలు చేయబోతున్నావనీ, నిన్నేదో బహుళ కీర్తి వరించ వేచివున్నదనీ నమ్మి, నిన్ను అనుసరించడం, ఎండమావుల్లో నీళ్ళు వెదకడమే అని తేలింది. అది హతా శకే దారితీయగలదని తెల్సింది. ముందుగానే హెచ్చ రించావ్– మెనీమెనీ థ్యాంక్స్. (పోబోతు వెనుదిరిగి) ఒకమాట– మిత్రుడవు కాబట్టి నిన్ను పతనంనుండి కాపాట్టం నా విధి. రోగికి ఔషధంవలె నా మాటలు నీకు వెగటుకల్గించడం తథ్యం– నిన్నిదే హెచ్చరిస్తూవున్నాను. రెండు చెవులుపెట్టి విను.

సాంబ: సరే! కానీ.

సూరి: దేశభక్తిలో నీలాంటివాళ్ళను వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. సంఘ సంస్కరణలో నువ్వు అగ్రగణ్యుడవనడం అతిశయోక్తికాదు. హరిజనోద్ధరణలో నీకు నివే సాటి యని చెప్పటం ముంజేతి కంకణానికి అద్దం పట్టటమే అవుతుంది. రాబోయే ఎన్నికల్లో ఎం. ఎల్. ఏ. లేక ఎం. పి. పదవి నీకే స్థిరమని గుసగుసలు, పిసపిసలు నా చెవిని పడకపోలేదు. హరిజనులైతే– ఆ వొక్క మారయ్య తప్ప తక్కినవారంతా నీకు ప్రాణాలర్పించటానికిగూడా

సంసిద్ధులన్నది నిర్వివాదాంశం. ఇటువంటి తరుణంలో నువ్వు నేటి కార్యక్రమంలో, ముఖ్యంగా సపంక్తి భోజనాల్లో పాల్గొనకపోతే, ఇన్నాళ్ళార్జించిన నీ పూర్ణ చంద్ర చంద్రికలాంటి కీర్తికి చెరగని మచ్చ రాకమానదు. నీ హరిజనోద్ధరణ లక్ష్యం అను వృక్షం కూకటివేళ్ళతో పెల్లగించబడి కూలిపోక మానదు. ఈ దెబ్బతో నీ మనఃపీఠంపై అలంకరించుకొన్న నీ వుపాస్యదేవత, నీ మల్లె శాశ్వతంగా నీకు దూరమైపోవడం ఖాయం. నిన్ను రంగం నుండి తుడిచిపెట్టుటకు వేచి కాచుకొని వున్న దుష్ట శక్తులకు ఇప్పుడు మాంచి అవకాశం చిక్కుతుంది. నిన్ను ఆశ్రయించుకొని నీ మూలాన బాగుపడదామనుకొన్న నాకు నిరాశయే ఆశ్రయమౌతుంది. నీ యశస్సుకొరకు కాకున్నా, నా శ్రేయస్సుకోసం కాకున్నా, కనీసం నీ మల్లె ప్రేయస్సు గురించైనా నువ్వీ భోజనానికి రాక తప్పదు. (చేతి గడియారంచూస్తూ) ఒంటిగంటకు పదిహేను నిమిషాలే మిగిలాయి; సమయానికి చేరాలి_ 'టైం ఇజ్ శర్మ_ శర్మ ఇజ్ టైం' అను మాట దక్కించు. (గడ్డం పట్టుకొని బ్రతిమాలుతాడు)

సాంబ: తమ్ముడూ! ఇన్నాళ్ళు నా సంగతిలో వుండికూడా నా సంగతి తెలిసికోలేకపోయావనే మరో విచారం నా కిప్పుడు ఏర్పడింది. అది నన్ను పూర్తిగా అర్థం చేసు

కొన్నాళ్ళనాడే నీకు అర్థమౌతుంది. నా నిశ్చయంనుండి నన్ను ఏశక్తీ తప్పింపలేదు. ఈవిషయంలో కన్నతండ్రిని కూడా కాదనడం నువ్వు ఎరుగని విషయం కాదు. నేటి యీ సపంక్తి భోజనాలల్లో నేను పాల్గొనకపోవటానికి బల మైన కారణం లేకపోలేదు.

సూరి: అదేమిటో ?

సాంబ: సంస్కరణం అంటే_ నిమ్నజాతులు వున్నతి చెందాలి అని, కాని ఉన్నతజాతులు పతనం కావాలి అని ఎన్న టికీ కాదు.

సూరి: అంటే నీ వుద్దేశ్యం? (ప్రశ్నార్థకంగా చూస్తాడు).

సాంబ: నిమ్నజాతులను వుద్ధరించడమే హరిజనోద్ధరణ. అనగా హరిజనులకు విద్యాబుద్ధులు గరపి, సత్యం, దయ, శుచిత్వం మొదలగు సద్గుణములు నేర్పి, తీర్చి దిద్ది, ఉత్తమ పౌరులుగా తయారుచేసి, జాతిలో అగ్రశ్రేణిలో వున్నవారితో పోటీకి నిలబెట్టడం. అప్పుడు అంటరాని తనం, గాలిలో హారతికర్పూరంలా తనంతతానే హరించు కోపోతుంది; కాని వారివి దళిత కులాలని, దళిత వర్గా లని శాస్త్రీయ ముద్రవేసి, ఊరిబయట వారికి కాలనీలు నిర్మాణంచేసి, ఎన్ని రాయితీలిస్తేనేమి, ఎన్ని సౌకర్యాలు కల్పిస్తేనేమి వారిని వుద్ధరించలేము. ఇవన్నీ కేవలం వోట్లకోసం పాట్లు పడటమే. భారతదేశవాసులు అంతా

భారతీయులే, అందరు సమానులే అని చట్టం డంకా బజా యించి చాటుతుంటే, మేము హిందువులమని, ముసల్మానులమని, సిక్కులమని, క్రైస్తవులమని, బౌద్ధులమని, పారసీకులమని వేరుపడి కొట్టుకొ చస్తున్నాము. ఇంకో వైపు ఆంధ్రులమని, కర్నాటకులమని, తమిళులమని, మలయాళులమని, మహారాష్ట్రులమని, గుజరాతీయులమని, పంజాబీలమని, రాజస్థానీయులమని, ఔత్తరాహులమని, బీహారీలమని, బంగాళీలమని, ఆసామీలమని భాషా వివాదాలతో క్రుంగుతున్నాము. ఇంక మనకు జాతీయభావం కల్గడం ఎన్నడో కదా! భగవన్!

సూరి: చంపేశావురా— నీ వుపన్యాసమూ నీవూనూ. (గడియారంవైపు చూస్తూ) ఇగ పది నిమిషాలు మాత్రమే మిగిలాయి భోజనాలకి. అరేయ్! నా కొరకైనా రారా. వుపన్యాసాలకి సాయంత్రం సభ వుండనేవుంది తీరుపారి వినుటకు. పదా! (ముందు దారి తీస్తాడు)

సాంబ: (చేయి పట్టి ఆపి) నిజంగా నువ్వు అన్నార్థివేరా.

సూరి: అక్షరాలా నిజంరా. ఇంతవరకు నోట్లో నీళ్లు పోసుకున్నానంటే వొట్టె; మీదు మిక్కిలి జులాబుకూడా తీసుకొని కడుపును క్లియర్ చేశాను. కడుపులో ఎలికలు తోడుతున్నాయంటే నమ్ము.

సాంబ: ఈ కాలంలో వుత్సవాలూ వూరేగింపులూ— సభలూ

వుపన్యాసాలతో తృప్తిపడి, మేం దేశోద్ధారకులము అంటే నాకు సుతరాం గిట్టదురా. ఈ వుత్సవాలు మనల్ని సుషుప్తినుండి జాగ్రత్తులోనికి ఈడ్చుటకు మాత్రం సహ కరిస్తాయి.

సూరి: అయితే మనం ఏం చేయాలి?

సాంబ: ఈ హరిజనోద్ధరణ కార్యక్రమం మన నిత్య జీవి తాంశం కావాలి. అప్పుడే మన జీవితాశయం నెరవేరు తుంది, లక్ష్యం సిద్ధిస్తుంది, మహాత్ముని అడుగుజాడల్లో నడిచినవాళ్ళమూ అవుతాం, అతని ఆత్మను సంతృప్తి పర్చినవాళ్ళమూ అవుతాం. ఇందుకు చట్టం మన కెంతో అనుకూలంగా వుంది. ఏ పండుగనాడో, పర్వదినంనాడో హరిజనులతో గుళ్ళో జొరబడితే చాలదు– వారి పంక్తిలో కూర్చుండి విందారగిస్తే సరిపోదు– ఓ హరిజన బాలికను పెండ్లాడినంతలో ఒరిగే దేమిలేదు.

సూరి: మరి ? (కండ్లలోకి చూస్తాడు)

సాంబ: మన హరిజన బంధువులను సంఘంలో మన స్థాయికి ఎదిగేట్టు చేయాలి; అదే మన ప్రస్తుత కర్తవ్యం. మన హరిజన మిత్రులు మనతోపాటు విందులు కుడువడం లేదా? మన హరిజన విద్యార్థులు మనతో కూడి దైవ దర్శనానికి రావడంలేదా? మన హరిజన భృత్యులు మనకు పానీయాలందివ్వడంలేదా? ఇంతెందుకు హరిజన

స్వాములు పాదపూజ లందుకోడంలేదా? వీరల కీ శక్తి చట్టంవల్ల నే సంక్రమించిందా? కాదు, అది వారి విజ్ఞానం, సత్ప్రవర్తనం, సభ్యత, సేవాభావం వల్ల నే కల్గింది. సంఘాన్ని మార్చేది చట్టంకాదు; సంఘమే. నిమ్నజాతి గొంగళిపురుగులను సీతాకోక చిలుకలుగా తయారుచేయడం సంఘ విధి అనగా అది మన ధర్మం.

సూరి: ఇక చాలించరా ఐదు నిమిషాలే మిగిలాయి 'ఆలస్యాదమృతం విషం'- నీ వుపన్యాసాలు వినుటగ్గూడా నాకు వోపికలే దిప్పుడు. ఇంట్లో పోట్లాడి వచ్చాను. ఇంటికెడితే అన్నం దొరకడ మేమోకాని తన్నులు గ్రుద్దులు మాత్రం పుష్కలంగా లభిస్తాయి. నన్ను కనికరించి లేద్దూ! సైకిలు పట్టుకొస్తా (పోబోతాడు).

సాంబ: (చేయి పట్టుకొని) నేను రానంటే రాను- అంతే- ఏమనుకోకు. నీకంతగా పోవాలని వుంటే పోవచ్చు; తరువాత తీరిగ్గా మాట్లాడుకుందాం.

సూరి: అయితే నువ్వు రావన్నమాట. (బిక్క మొగం పెడతాడు).

(తెరలో కలకలం)

సాంబ: ఆఁ, ఏవరో పోట్లాడుకొంటున్నట్లున్నారు. సద్దుపాటు చేద్దాం పద!

సూరి: (తనలో) ప్రొద్దున లేవంగానే ఆ నాంచారమ్మ

మొగం కన్పించింది. ఇవ్వాళ అన్నం సున్న.

(నాంచారమ్మ రోజుచూ ప్రవేశిస్తుంది)

నాంచా: ఒసే! మాలముండా! నీ గాజులు పగలా! నీ బొట్టు మలగా! నీకు నా అంతగతి యెన్నడు పడుతుందే? నీకు పోగాలం దాపరించిందే. మా కొంపల్లో మమ్మల్ని బ్రతకనివ్వరటే? మా బావుల్లో మేం నీళ్లు చేదుకోరాదటే? మా వీధుల్లో మేం నడువకూడదటే? ఏం కాలమొచ్చిందిరా! దేముడా! సోమయాజుల ఇంట్లో పుట్టీ, చైనుల ఇంట్లో మెట్టీ, అవధానుల రెట్టువట్టీ. ఇంత బ్రతుకు బ్రతికి నేటికి ఈ నీచుల దృష్టిలో నీచమైపోయానంటే ఇగ బ్రతుకెందుకురా? నాయనా! (నెత్తి కొట్టుకుంటుంది) 'బండగట్టుక నూత బడుట మేలూ' (కూనిరాగం తీస్తుంది) ఆ నూతిలో పడటాన్కి కూడా మా కధికారం లేదు కామోసు. అయ్యో! నా ఖర్మంకాలా!

సాంబ: అత్తాయీ! ఏమిటే? ఎప్పుడూ ఏదో గొడవే_ పద లోపలికి,

సూరి: అవ్వా! మైలపడ్డారు కదూ! పేగుమీది కాలు పెంట మీద_ పెంట మీది కాలు పేగుమీద వేస్తూ నడుస్తూ వుంటే మైలపడ కేంజేస్తుంది. (ఎగతాళిగా నవ్వుతాడు)

నాంచా: ఒరే, నీతిమాల్నవాడా! నిన్ను గత్తరి మింగా! నీ దృష్టిలోకూడా నేను లోకువైపోయాను గదరా?

మా ఆయనే వుంటే నాకీ గతి పట్టేదట్రా? (కంట తడి పెడుతుంది) అయ్యో! నా ఖర్మం కాలా!

సూరి: (మధ్యలో అందుకొని) రోజూ కొట్టుకోళ్ళూ మొత్తుకోళ్ళేగా! (నవ్వుతాడు).

నాంచా: (కోపంతో) నీకేం పోకడకాలం వచ్చిందిరా– నువ్వు జుట్టూగులాడంగా పోనూ– నీ దినాలుగానూ– మీకందరికి నేనంటేనే ఎగతాళిరా– అయ్యో! నాఖర్మం కాలా! నే నిక బతక్కూడదు– గొంతు పిసుక్కొని చస్తాను. (కుతికె పట్టుకుంటుంది).

సూరి: పోలీస్! పోలీస్!

సాంబ: అత్తయ్యా! ఆత్మ హత్యకు పాల్పడితే పోలీసులు పట్టుకెడతారు.

నాంచా: అమ్మో! పోలీసులే! (భయపడుతూ, ఇటూ అటూ చూస్తూ) ఇంటిలో అధికారం లేదు, ఇంటి బైట అంతకంటే లేదు. ఒంటిమీద అధికారం ఉందా? అంటే, అదీ లేదాయె. చివరకి యముని బంటుల వెంటనంటి పోవుట కూడా అధికారం ఉందో, లేదో! (చేతులు వెల్లికల వేస్తూ) మా ఆయనే ఉంటే ! వీళ్ళ తఖరు తీప్పేవాడు. (గుడ్లు మిటకరిస్తూ) అయ్యో! నా ఖర్మం కాలా! (పారిపోవుటకు చూస్తుంది).

సూరి: అదిగో పోలీస్!

నాంచా: అమ్మ బాబోయ్! (గంతువేసి వెనక్కి చూస్తూ చూస్తూ, అయ్యో! నా ఖర్మం కాలా! గుండుమీది బట్ట జారిపోగా పరుగుతీస్తుంది).

(తెర పడుతుంది)

## తృతీయ రంగం

స్థలం: మారయ్య ఇల్లు.
సమయం: సాయంకాలం నాలుగు గంటలు.
ప్రవేశం: మల్లె — ఆమె తండ్రి మారయ్య మంచంలో మూలుగుతూ—

మల్లె: (స్వగతం) హా! దుర్విధీ! సరిగా మాటలుకూడా రాకముందే తల్లి యొడి బాపితివి. వరుసగా అనుంగు తోబుట్టువు లందర్ని నీ పొట్టబెట్టుకొంటివి. తల్లి లేని లోటు రానీకుండా అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసిన కన్నతండ్రి చల్లని నీడకూడా లేకుండా చేయాలని చూస్తున్నావు. సరే! చూపూ నీ ప్రతాపము. (నిట్టూర్పుంది).

నాన్నా! నాకు చదువు సందెలు చెప్పించి, నన్నొక మనిషిని చేసినందుకు నీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను. కనీసం నిన్ను సంతోషపెట్టాలని చేసిన ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరైంది. మూర్తిబాబుతో కలువవద్దని

కదా నీ శాసనం? దాన్ని అతిక్రమిస్తున్నాననే కదా నాపై నీకేర్పడ్డ ఈ అయిష్టత? సంఘ సంస్కరణకే నా జీవితం అర్పణ చేశానన్న సంగతి నీవు ఎరిగినదే కదా! అందుకు గాను మూర్తిబాబుతో కలిసి పని చేస్తూవుంటే సంబరపడేవా డివిగదా! ఇప్పుడు ఆ సాధుమూర్తిపై ఇంత ద్వేషం ఎందుకు ఏర్పడ్డదో తెలియటంలేదు. మా ఏకైక లక్ష్య సిద్ధికోసం చేస్తూవున్న కృషియే తరచు మా వుభయుల కలయికకూ, అన్యోన్యానురాగానికి కారణం- ఇదే నీ అనుమానానికి దారి తీసి వుండోచ్చు. మా గురించి పొరపడుతున్నావు నాన్నా! ఇప్పుడు అతడు గురుదేవుడు, నేను అంతేవాసినిని అంతే. (కొంచం విచారించి) ఓహో! తెలిసింది. వర్ణాంతర వివాహాలవల్ల వచ్చే కులతప్పు భయం నిన్ను పీడిస్తుండవచ్చు- అయినా హంసకు కాకిజన్మ ఇస్తానంటే అది శాపం అవుతుంది, కానీ కాకిని హంసగా పుట్టిస్తానంటే అది వరమౌతుంది నాన్నా!

మార: (దగ్గుతూ కండ్లుతెలిచి) మల్లెవ్వా! దాహం- దాహం.

మల్లె: ఇదో నాన్నా! (మంచినీళ్ళందిస్తుంది)

మార: (రుచి చూచి) మంచినీళ్ళుకాదే నాకు కావలసింది మందు- మందు. (గ్లాసు అందిస్తాడు)

మల్లె: (గ్లాసు అందుకొని) సరే, మందిస్తాను. (మందు సీసా అందీయబోతుంది)

మార: ఈ మందుకాదే నాక్కావాల్సింది_ నా మందే నా పిచ్చితల్లీ!

మల్లె: ఇది నీ మందే నాన్నా! డాక్టరిచ్చింది.

మార: ఓసీ! నీ తెలివి తెల్లారా! నా మందంటే తెలీదూ? మందబుద్ధీ! అన్ని మందుల సారం, నా సారా. ఆర్ని తస్సాదియ్యా!

మల్లె: అయ్యా! ఈ సారాయే నిన్నీ స్థితికి తెచ్చింది. ఇది విషతుల్యం. డాక్టరు మానేయమన్నాడు.

మార: ఇషతులియం_ ఓరంటారు? ఇది నాకు అమ్మోరుతల్లి, నా పేనాన్కి పేనం_ నా రోగాన్కి ఒసుదం_ తే, తొరగా తే; మా అవ్వవు గదూ! (బిడ్డవైపు దీనంగా చూస్తాడు)

మల్లె: మొదట ఈ మందు తాగు నాన్నా! తరువాత_

మార: నా నరాలు పీక్కోపోతా వున్నాయి_ నాల్క ఆర్చుకపోతా వున్నాది_ జీవాలు పైపైకి ఎగిరిపోతావున్నాయి_ నా చిట్టివ్వా! కాసింత ఇత్తూ_ నీకు పున్నెం వుంటాది.

మల్లె: అది పనికిరాదు నాన్నా!

మార: (కోపంతో) సీ! పనికిమాల్నదానా! నేను సావాలని సూస్తున్నావు. నేను సస్తె నీ పేమాయనాన్కి ఏ అటకాయింపులూ వుండవనికదూ నీ ఎత్తు_ పో! నా కండ్లముందట్నుంచి. (త్రోసివేస్తాడు)

మల్లె: (క్రింద పడిపోతుంది)

( ప్రవేశం సాంబమూర్తి )

సాంబ: (తనలో) డాక్టరును తీసుకొరమ్మని శర్మను పంపాను, వాడింకను రాలేదెందుకో? సరే! నేను లోపలికెళ్ళి మారయ్యను చూస్తాను– ఎట్లా వున్నాడో? ఏమో? పాపం !

మల్లె: (మెల్లిగా లేస్తూవుంటుంది)

సాంబ: ఆఁ, ఇదేమిటి? (మల్లెను చేరబోతుంటాడు)

మార: ఆరీ ! రాచ్చసీ! నువ్వు మల్లీ రానేవచ్చావా? నా మల్లినే చేరబోతావున్నావా? ఆర్నీ తస్సాదియ్యా! బత్కదలిత్తే పారిపో– పారిపో! పోవా? ఇంద చత్తివి– (చేతి కర్ర విసిరివేస్తాడు)

మల్లె: అయ్యో– అయ్యో! (మధ్యకు వస్తుంది అమాంతం మల్లె తలకు బలమైన దెబ్బ తాకి తూలి పడ్తుంది. రక్తం చిమ్ముతుండగా మూర్తి తటాలున పట్టుకుంటాడు.)

సాంబ: అబ్బ! ఎంత దెబ్బ! (తల అదిమి పట్టుకుంటాడు)

మార: అయ్యో! అయ్యో! మా యవ్వా! నా చిట్టితల్లిని, నా మల్లవ్వను రచ్చించండి–రచ్చించండి! (ఏడుస్తాడు)

(ప్రవేశము డాక్టరుతో సూరిశర్మ)

డాక్ట: అరే, తల పగిలిందే!

సూరి: అయ్యో! మల్లెకే !

సాంబ: డాక్టరుగూరూ! ప్లీజ్ పట్టీ–

డాక్ట : డోంట్ వరీ. (తొందరగా పట్టీ కడతాడు)

సూరి: మూర్తీ! ఎవఁడా మల్లెను కొట్టింది?

మార: ఈడేనయ్యా! ఈ పాపాల బయిరవుడే. కన్న బిడ్డను చంపుకునోడు ఈడేనయ్యా! (బిడ్డవైపు తిరిగి) నా చిట్టవ్వా! బంగారవ్వా! నన్నిడ్చి పోతాన్నావా? అద్గో! యమకింకరోళ్ళు_ పట్టొస్తొంద్రు_ కట్టొస్తొంద్రు_ ఆళ్ళ చేతుల్లో తాళ్ళు. నా మల్లి తల్లి! నేనూ అస్తుండాను నీకు తోడు. ఆగు_ ఆగు. ఆగకుంటే నాతోడే_ (లేవ బోయి పడిపోతాడు_ కొంతవరకు తేరుకొని) నేను పెద్దింటోణ్ణి_ పాపాలుసేయడంలోనూ పెద్దోణ్ణే_ ఇప్పుడు వొంటోణ్ణి_ దిక్కుమాసినోణ్ణి- (పైకి చూచి) ఈ ఆసాలు నన్ను బెదిరిస్తుండాయి_ బాపనోణ్ణి సంపుతానన్న పాపం ఊకెనే పోతుందా? అది నా కన్నకడుపునే బలితీసుకుంది. (ఆవేశంతో) నన్ను నరకండి_ ముక్కలు ముక్కలు చేయండి_ నా మాముసం కాకులకూ గద్దలకు ఏయండి_ దాన్ని అవ్వికూడా ముట్టవు కామోను. (మూర్ఛపడి పోతాడు)

సాంబ: మల్లెకు ప్రాణభయం లేదు కదండి!

డాక్ట : పరవాలేదు, 'బి అస్యూర్డ్' దెబ్బ అంత ప్రమాదకరం కాదు. వారం రోజుల్లో 'షి విల్ బి ఆల్ రైట్'.

సూరి: మా మూర్తి పుణ్యం చాలా గొప్పది.

సాంబ: అయ్యో! మారయ్య మూర్ఛపోయాడే! అతణ్ణి కాస్త చూడండి డాక్టర్‌గారూ! అతడు దిక్కుమాల్న పక్షి.

సూరి: చావనీ దుర్మార్గుడు. నిన్ను చంపటానికి సిద్ధమైన వాడిమీదకూడా జాలేస్తున్నదా- మూర్తీ?

సాంబ: అన్ని ప్రాణులు దైవస్వరూపాలే కదా!

సూరి: నీ వేదాంతం నువ్వూనూ- అదుగో నీ చల్లని మల్లెకు తెలివొస్తోంది చూడు.

మల్లె: (మెల్లిగా కండ్లు తెరుస్తుంది).

సూరి: చెల్లీ! ఎలా వున్నావ్?

మల్లె: మూర్తిబాబు బాగేనా?

సూరి: అదిగో! నీ దైవం వాడిలోనేగా నీ వున్నది?

మల్లె: మూర్తిని చూచి సిగ్గుపడుతుంది. (వెంటనే) నాన్నా!

మార: (హీన స్వరంతో) ఏదీ నా మ-ల్లి!

మల్లె: ఎలా వున్నావ్? నాన్నా! (మెల్లిగా లేవబోతుంది)

డాక్ట: మీ నాన్న కేం పర్వాలేదు- తొందర పడవాకు.

మార: (మెల్లిగా కళ్ళు తెరిచి) నా మల్లి! (ఇటు అటు చూస్తాడు)

డాక్ట: బావుంది- భయపడవాకు.

మల్లె: (మెల్లిగా దగ్గరకెళ్ళి) నాన్నా! (మీద పడి యేడుస్తుంది)

మార: నా మ ల్ల వ్వా! (ఆప్యాయతతో ఎదకు హత్తు

కుంటాడు. మల్లె లేచి దుఃఖిస్తూ వుంటుంది. మారయ్య అశ్రుపూరిత నేత్రాల్తో మూర్తి కళ్ళల్లోకి దీనంగా చూస్తూ వుంటాడు)

సాంబ: అంతా ఆ మహాత్ముడి దయ. (గాంధి పటం వైపు చూపుతాడు)

మార: (కొంత శక్తి కూడగట్టుకొని) మూర్తి బాబూ— నేను రాచ్చ సుణ్ణి— నువ్వు దేముడ్వి— నా కండ్లు తెరిపిచ్చావ్— మా కులంకి చేనికి ఎనుగులా, మా యింటికి కంటికి రెప్పలా— రచ్చిస్తుండావు— నేను చచ్చినోణ్ణి— నాకు పాచిత్తం? (ఏడుస్తూ చూస్తాడు)

సాంబ: పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం. మరేం బెంగ పెట్టుకోవాకు.

సూరి: అల్లుని కాళ్ళు కడగడమే ప్రాయశ్చిత్తం.

మల్లె: (తలవంచుకుని మూర్తిని సిగ్గుతో చూస్తుంది).

మార: (లేని బలం తెచ్చుకొని) మూరితిబాబూ! నా పాపం పోద్దా?— ఆ— మాతుముడు (గాంధి పటం చూపుతూ) మాకు హరిజనోళ్ళు— అని పేరు పెట్టిండు— ఈ మాతుముడు— (మూర్తివైపు చూపిస్తూ) మమ్మల్ని నిబద్దిగా అరిజనోళ్ళను చేసిండు— ఇద్దరూ కల్సి— ఉప్పుడు నన్నేం చేస్తారో? (దండాలు పెడుతూ వెక్కి వెక్కి ఏడుస్తాడు)

డాక్ట: ఏడ్వకు— మళ్ళా గుండెజబ్బొస్తుంది.

మార: ఏదీ_ నా_ మల్లి?

మల్లె: నానా్న! (దగ్గరకు నడుస్తుంది)

డాక్ట: ఏదో చెప్పు.

మార: నా మల్లిని_ దానవ్వ_ నా సేతుల్లో పెట్టి_ పాయ_ ఉప్పుడో_ అది_ నన్నూ్న రమ్మంటుందాయ. దీనో్నరి సేతుల్లో పెట్టాలి గదా! (మూర్తివైపు ఆశాపూరిత నేత్రాల్తో చూస్తూ వుంటాడు.)

సూరి: మరెవ్వరి చేతుల్లో ఏం? నిక్షేపంలా అల్లుడు ముందుం టేనూ. "ఆలస్యం అమృతం విషం".

డాక్ట: అవును మరి! "శుభస్య శీఘ్రం" అన్నారు పెద్దలు.

మూర్తి: (కళ్ళవెంట ఆనందబాష్పాలు తొణికిసలాడుతుం డగా మల్లెను ఆప్యాయంగా చూస్తాడు.

సూరి: (వెనుకనుండి మూర్తిని తడుతూ) ఊఁ! మాటాడ వేం? బెల్లం కొట్టిన రాయిలా.

సాంబ: మల్లె నా ప్రాణానికి ప్రాణం; మాలమల్లెను మల్లె మాలగా చేసుకొని, నా కంఠంలో అలంకరించుకుంటాను. జీవితాంతం ఆ పరిమళాన్ని నా గుండెల్లో పదిలపరచు కుంటాను. ఆ మల్లెమాల సహచర్యంతో దేశ ప్రగతికి బంగారు బాట నిర్మించుకుంటాను.

మార: (మల్లె చేయి మూర్తి చేతిలో పెట్టి) నే నుప్పుడు_ హరిజనుణ్ణి_ అరి నా దిక్కై అస్తూవుండాడు_ ఆ అరే!

రా- దండాలు- అరే- దండాలు- ఓ! బొల్లి గద్ద మీదెక్కి వస్తుండావా? అగ్గో! ఆ నెత్తిమీద బంగారు కిరిటీటం- ఆ మొగంమీద తెల్లోటి నావాలు- ఎలా మెరుస్తుండాయి- ఆఁ, నీకు- నాల్గు సేతులుండాయా?— అదగ్గో- ఓ సేతిలో- సంకూ- ఓ సేతిలో- చక్కురం- ఓదాంతో- గదా- ఇంకోదాంతో- పద్దుమం- పట్టుకుండావా?— (దమ్ము తీసికొని) ఆర్లి తస్సాదియ్యా!- మెళ్లో అనమాలా- ఆరాలూ ఏసుకుండావా?- బంగార్రంగు బట్ట- నీ నల్లని రంగు పెయికి మరీ బాగుండాయి. భలే! నన్నుకూడా నీ గద్దమీద కూకోమంటావా? మరి జాగాయేది? తెల్సింది తెల్సింది- నీ తొడలమీద కూకోమంటుండావు కదూ! సరే- నాకు రెక్కలేవీ ఎగరడాన్కి? అయితే నీవే దిగి వస్తుండావా?- బాగుంది! రా- నా యయ్యా- రా- అరిజనోళ్ళంటే నీకు ఎంత దయే- (కండ్లు మూసుకొని) రా- మ- రా- మ- రా- మ- (పడిపోతాడు- మల్లె మీదపడి బోరుమంటుంది).

అందరు: (పాడుతారు)

రఘుపతి రాఘవ రాజారాం। పతిత పావనా సీతారాం।

(తెర పడుతుంది)

—: మంగళం మహత్ :—

ఓం శ్రీ సాయినాథాయనమః

# రా మ రా జ్యం

( నాటిక )

## ప్ర థ మాం క ం

### ప్రథమ రంగం

ప్రదేశం: రాజారావు పఠన మందిరం.

రాజా: సాధిస్తాం సాధిస్తాం- రామరాజ్యమును సాధిస్తాం- స్థాపిస్తాం స్థాపిస్తాం- శాంతి సుఖాలను స్థాపిస్తాం.

(సుందర్‌రావు ప్రవేశిస్తాడు)

సుంద: రాజా! ఏమిట్రా ఇది? ఎప్పుడు చూచినా చేతిలో పుస్తకం నువ్వూనూ! నీకు రెస్టు అవసరం లేదనుకొంటే ఆ పుస్తకానికైనా కాస్త విశ్రాంతి ఉండాలా? వద్దా? చూడు పాపం అదెంత దీనంగా చూస్తున్నదో! (పుస్తకం లాగి బల్లమీద వేస్తాడు.) మన హిస్టరీ సార్ చెప్పిన మాట అప్పుడే మర్చిపోయావేంటి? ఒక సబ్జక్టు పరీక్ష కాగానే ఆ సబ్జక్టును పూర్తిగా మర్చిపోవాలి. రెండో సబ్జక్టుకు బ్రేన్‌లో తావివ్వాలి. ఇప్పుడు మన పరీక్షలు అన్నీ అయిపోయినవి. కాబట్టి బుర్రలో ఇక ఏ విషయానికి చోటులేదు. చూడు !ఇప్పుడు ఎంత హాల్లో గావుందో! (తల పుణుక్కొంటాడు.)

రాజా: ఈ వొట్టి బుర్రతోనేనా? నీవు ఐ. ఏ. యస్. పరీక్షకు వెళ్ళేది? (ఆశ్చర్యంగా చూస్తాడు)

సుంద: అక్కడ బుర్రతో అవసరంలేదు బ్రదర్! అదృష్టం ఉండాలి అదృష్టం! (నొక్కి పల్కుతాడు) ఊఁ– లే! లే! అట్లా షికార్ వెళ్ళివద్దాం పద!

రాజా: ఒరే! సుందరం! ఇంకా నీ పిల్లకాయ వృత్తి నిన్ను విడువలేదే! దేశం స్థితి, మన బాధ్యతను గూర్చి మన లాంటివాళ్ళే పట్టించుకోకపోతే ఇంకెవ్వరు పట్టించుకుంటారు? ఈ పంచవర్ష ప్రణాళికలో చేరింది కదా! మన గ్రామం. మనమంతా సంపూర్ణంగా ఆ ప్రణాళికకు సహకరించి, దానివల్ల పూర్తి లాభం పొందాలిసుమా!

సుంద: ఈ వ్యవహారమంతా గవర్నమెంటువారు చూసుకుంటారు. మనకెందుకయ్యా ఈ లేనిపోని తలనొప్పి? నిన్ను నీవు బాగుచేసుకోలేవు, కాని దేశాన్ని బాగుచేస్తావా? ఊఁ– ఉట్టికెగురలేని కుక్క స్వర్గానికెగురుతుందట! (నవ్వుతాడు హేళనగా)

రాజా: (ఆవేశంతో) నీ మాటలు నువ్వు వాపసు తీసుకో. ఈ పని నేను చేసితీరుతాను. నా జీవితం దేశసేవకై ఇదే అంకితం చేస్తున్నాను. ఇవి శిలాక్షరాలు.

సుంద: రాజూ! వట్టి ఆవేశపు మాటలు మాట్లాడవాకు. ఇవే మాటలు మీ నాన్న చెవిని పడ్డాయా ఇక నీకింట్లో

ఉంటానికూ్కడా తావుండదు— జాగ్రత్త!

రాజా: నీబోటి పిరికిపంద ననుకున్నావా భయపడ్డానికి? నా కర్తవ్యం నేను నెరవేర్చి తీరుతాను.

సుంద: ఆఁ! రాజారావు మాటలు నీళ్ళ మూటలు; ముందుంది ముసళ్ళ పండుగ. నీవు రావుకదూ! నేను వెళ్ళొస్తా.

రాజా: సరే! మంచిది— కుశాలుగా.

(తెర పడుతుంది)

## ద్వి తీ య రం గం

ప్రదేశం: భూషణరావు ఇంట్లో వరండా.

ప్రవేశం: భూషణరావు చేతిలో టెలిగ్రాం పట్టుకొని—

భూష: ఒసే, సీతారత్నం! ఇదిగో! ఇటు— ఇటు! (కేకవేస్తూ) ఫస్టు క్లాస్! ఫస్ట్ ఇన్ ఫస్ట్! డుమినియన్ ఫస్ట్! నా కొడుకు— నా కొడుకు— (పరవశమున అరుస్తాడు)

(సీతారత్నం ప్రవేశిస్తూ)

సీతా: ఏమిటండీ ఈ ఆర్భాటం? ఈ కేకలూ మీరూనూ.

భూష: నా కొడుకే— బి. ఏ. లో ఫస్ట్ ఇన్ పస్ట్— డుమినియన్ ఫస్ట్ ప్యాసయ్యాడే. నవ్వుల మొగమా! టెలిగ్రాం చూపుతాడు. ఒరే, రాజా! (కుమారుని పిలుస్తాడు)

సీతా: (సంబరంతో) నా చిట్టితండ్రి ప్యాసయ్యాడా? నా మొక్కులు ఫలించాయి; కోర్కెలు నెరవేరాయి. (వేంకటేశ్వరస్వామికి దండాలు పెడుతుంది పైకి చూస్తూ)

రాజా: (ప్రవేశించి) నాన్నా! పిలిచారా?

భూష: (టెలిగ్రాం అందిస్తూ) నీ కృషి ఫలించింది నాయనా!
(దగ్గరకు తీసుకుంటాడు)

సీతా: మా పుణ్యం పండింది. తండ్రీ! (కౌగిట చేరుస్తుంది)

రాజా: (నమ్రుడై) ఇదంతా మీ పెద్దల ఆశీర్వాద బలం.
(తలిదండ్రులకు నమస్కరిస్తాడు)

భూష: (కుమారుని తల నిమురుతూ) దీనితోపాటు ఇంకో శుభవార్త నీ చెవిని వేయాలని వుంది నాయనా! నువ్వు ఊఁ అంటే చాలు, రేపిపాటికి ఆ కాస్త అయిపోతుంది.

సీతా: ఆ శుభఘడియకొరకే చకోరపక్షుల్లా ఎదురుచూస్తు న్నాం నాయనా!

రాజా: ఏమిటి సంగతి? నా కర్థం కాకుండా వుంది. (ఉభయులను ప్రశ్నార్థకంగా చూస్తాడు)

సీతా: అయ్యో- పిచ్చితండ్రీ! నిన్నో ఇంటివాణ్ణి చేయాలని మా ఆతురత.

భూష: అంతా రెడీ.

సీతా: ఆ కాస్త నీ నోట ఊఁ అనిపించుకోవాలని వారి అభిమతం. 'సరే' అన్రా నాయనా!

భూష: నీవేమి ఎదురాడవని మా నామ్మకం. నీ బాగోగులు మాకు పట్టిలేవా? బాబూ!

సీతా: అయిన ఇంటి పిల్ల.

భూష: బాగా చదువుకున్నది.

సీతా: చక్కని చుక్క.

భూష: పదివేల రూపాయల వరదక్షిణ.

సీతా: వారికి మగసంతానంకూడా లేదట; ఒకే ఒక ఆడపిల్ల.

భూష: నాయనా! ఇంకా సందేహం దేనికి? నీవు పెట్టిన గడువుకూడా పూర్తి అయింది కదా! అందుకే నీ రిజల్టు రేపు అందేది నేడే ఎక్స్ప్రెస్ టెలిగ్రాం ద్వారా తెప్పించాను.

రాజా: నాన్నా! పెండ్లి కేం తొందర ఇప్పుడు?

సీతా: కుర్రాళ్ళకు సిగ్గు గదండీ! నాకు పెండ్లి కావాలి అని అంటాడుటండీ! మీరూనూ, మీ చిన్నతనం కాస్త యాదికి తెచ్చుకోండి.

భూష: (నవ్వుతూ) అవును_ అవునే! పెళ్ళివాళ్ళకు కబురు పంపిస్తాను. (లేవపోతాడు)

రాజా: కాదు; నాన్నా!

సీతా: అదేవిట్రా! అయ్యో! నా ఖర్మం! సిరిరా మోకాలొడ్డుతార్రా! (ముక్కుమీద వేలు వేసుకుంటుంది)

భూష: మంచి సంబంధం అదృష్టంవల్లనే దొరుకుతుందిరా!

రాజా: నే నిప్పుడు పెళ్ళి చేసుకోదలచుకోలేదు. (మొండిగా చెప్పేస్తాడు)

భూష: కొంచెం బిరుసుగా గొంతెత్తి) మరేం చేయదలచుకున్నావ్?

రాజా: (శాంతంగా) దేశ సేవ చేయాలనుకుంటున్నాను.

సీతా: (ఎగజారుతూ) నాయనా! ఇదేం పిచ్చిరా? అయ్యో! నా ఖర్మం! నీకేమైనా సోకిందా ఏం? ఇవాళ. తండ్రి మాట కెదురాడకురా తండ్రీ! (బ్రతిమాలుతుంది గదువ పట్టుకొని)

రాజా: అమ్మా! ఈమట్టుకు నన్ను క్షమించు. ఇది నా స్వవిషయం. (బింకంగా) దీనిని నాకే వదలండి.

భూష: నువ్వే స్వతంత్రుడివారా? (కోపంతో చూస్తాడు)

రాజా: ఈ వొక్క విషయంలో మాత్రమే. నన్ను నా దోవన నడువనీయండి నాన్నా! (బ్రతిమాలెడు ధోరణిలో)

భూష: అంతేనా? (పండ్లు బిగబడుతాడు)

రాజా: ఆ! అంతే. (చూపులు దించుకుంటాడు)

సీతా: (విచారంతో) ఆలోచించుకోరా చిట్టీ! (గదువపట్టి బతిమాలుతుంది) అయ్యో! నా ఖర్మం! (నెత్తికొట్టుకుంటుంది)

రాజా: ఆలోచించే చెబుతున్నాను.

భూష: (గంభీరంగా) సరే! మేమునూ మా త్రోవనే నడుస్తాం. (ఉగ్రుడై) ఇదిగో! రేపీపాటికి నువ్వు మా మాట విని, పెళ్ళిచేసుకు నేదీ లేక ఇంటినుండి బయటికి వెళ్ళేదీ _ఏదో ఒకటి తేల్చుకో. ఇది సుగ్రీవాజ్ఞ. (చురచుర కొడుకును చూస్తూ, భార్య రెక్కపట్టి) ఊఁ, పద లోపలికి! (సరసర లాక్కొనిపోతాడు)

సీతా: అయ్యో! నా ఖర్మం! (ఏడుస్తూ భర్తను అనుసరి
స్తుంది. రాజారావు దిగాలుబడి చూస్తాడు)

(తెర పడుతుంది)

## తృతీయ రంగం

[ప్రవేశము: రాజారావు తన గదిలో పచార్లుచేస్తూ]

రాజా: (విచారముతో తనలో) "ఇదిగో, రేపిపాటికి నువ్వు
మా మాట విని పెళ్ళి చేసుకునేదీ, లేక ఇంటినుండి బయ
టికి వెళ్లేదీ– ఏదో ఒకటి తేల్చుకో. ఇది సుగ్రీవాజ్ఞ."
(గడియారము చూసుకుంటాడు) ఆ సమయం సమీపి
స్తున్నది. తొందరగా నిశ్చయానికి రావలసి వున్నది.
'ముందు నూయి– వెనుక గోయి'– అన్నట్లున్నది నా స్థితి.
(ఆలోచించుకొని) రాముడు రాజ్యాన్ని వదలి వనాల
కెందుకు పోయాడు? దేశసేవకు– బుద్ధుడు భార్యాబిడ్డల
వదలి ఎందుకు వెళ్ళాడు? ప్రజాసేవకు– ఆ మహా పురు
షులు వేసిన బాటలో నే నెందుకు నడువకూడదు?
(నిశ్చయ బుద్ధితో) ఇదే దేశ సేవకై నా సర్వస్వాన్ని
ధారవోస్తున్నాను– దీనికి తిరుగులేదు– ఇది శిలాశాసనం.

(ప్రవేశము: ప్రతాపరెడ్డి, పేరిశర్మ– రిజల్టు పత్రికతో)

ప్రతా: హల్లో! కన్గ్రాచులేషన్స్! మిస్టర్ రాజారావ్! (చేయి
చాస్తాడు)

పేరి: థ్యాంక్యూ! టీ పార్టీ - ఇడ్లీసాంబర్ - ఆలూబోండా - మైసూర్‌పాక్ - గర్మాగరం.

ప్రతా: (రాజారావు మొగం చూచి నిర్విణ్ణుడై) ఏం ఫ్రెండ్! ఇలా వున్నావు? కారణం తెలుసుకోవచ్చా?

పేరి: నాకు తెలుసునోయ్ ఆ దొంగ ఎత్తు. మనకు దావతు ఎగ్గొట్టాలని చూస్తున్నాడు. అచ్చం అయ్యకొడుకుగా తయారవుతున్నాడనుకో.

రాజా: సారీ! పార్ట్నర్స్. అయ్యకూగాని, అవ్వకూగాని కొడుకుగా అయిపోయాను. (దిగులుగా చూస్తాడు)

ప్రతా: నీకు పట్టుకున్న ఆ గ్రహచార మేమిటో? దాచక చెప్పు బ్రదర్! (బుజంపై చేయివేసి అనునయిస్తాడు)

రాజా: నా కాశ్రయమిస్తానని అభయమిస్తే - (ఆశగా చూస్తాడు)

ప్రతా: సరే! మరేం పర్వాలేదు; ఊఁ! చెప్పు? (చేతిలో చేయి వేస్తాడు)

పేరి: హిమ్మతుకు నేను వున్నానుగా - (రొమ్ము చరుచు కుంటూ చూస్తాడు)

రాజా: మా తండ్రి నాకు పెండ్లిచేయాలని పట్టుబడుతు న్నాడు. నేనేమో దేశ సేవకు కంకణం కట్టుకున్నాను. పెండ్లి దానికి అంతరాయం అని నిరాకరించాను. కోపం వచ్చి ఇంటినుండి వెళ్ళమని తండ్రి శాసించాడు. (నిట్టూ రుస్తాడు)

ప్రతా: మరేం చింతపడకు. మా కుటుంబంలో నువ్వొక డివి. (ధైర్యమిస్తాడు)

పేరి: మరి నేనో? మా ఆవిడ నన్ను రోజూ ఇంటినుండి నడూ అంటుంది. (కండ్లు చిపిలిస్తూ చూస్తాడు)

ప్రతా: దానికేంలే! అది మనకు అలవాటే గదా! (నవ్వుతాడు)

(అందరు నిష్క్రమిస్తారు— తెరబడుతుంది)

## ద్వితీయాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: ఊరు బయట మర్రిచెట్టు క్రింద మైదానం.

ప్రవేశం: రాజారావు, ప్రతాపరెడ్డి, పేరిశర్మ, రామయ్య, కరీం, జాన్, శారద, మీనాక్షులు కూర్చుండి భజనచేస్తూ వుంటారు.

రాజా: రఘుపతి! రాఘవ! రాజారామ్!

ఇతరులు: పతిత పావనా! సీతారామ్!

రాజా: ఈశ్వర్, అల్లా తేరే నామ్

ఇత: సబ్ కో సన్మతి దే దే, శ్యామ్!

రాజా: మందిర్, మస్జిద్ తేరే ధామ్

ఇత: సబ్ కా పాలన్ తేరా కామ్

అందరు: రఘుపతి! రాఘవ! రాజా రామ్!

పతిత పావనా! సీతారామ్!

రాజా: మహాత్మా గాంధీకి—

ఇత: జై!

రాజా: రామరాజ్యం—

ఇత: సాధిస్తాం.

రాజా: శాంతి సుఖాలు—

ఇత: స్థాపిస్తాం.

రాజా: నేస్తల్లారా! ఇవాళ మీకొక మంచి మాట చెబుతాను. దేశస్థితి బాగుచేయడానికి ప్రభుత్వంవారు పంచవర్ష ప్రణాళికలు సిద్ధంచేశారని నిన్న చెప్పాను కదూ! ఈ ప్రణాళికలో గ్రామాలను బాగుచేయడానికి నూరేసి గ్రామాలు కలిపి వొక బ్లాకుగా ఏర్పాటు చేశారు. మన గ్రామంకూడా ఓ బ్లాకులో చేరింది. మనకు దొరతనంవారు అన్నివిధాలా సాయం చేస్తారు. మనమంతా కలిసి కట్టుగా పని చేసి ఆ సహాయాన్ని అందుకోవాలి.

రామ: బాబూ! మన కేలాంటి సాయం చేస్తారు వాళ్ళు?

రాజా: పడావా భూములను వ్యవసాయ యోగ్యములు చేయడం, కాలువలు— చెర్లు నిర్మించడం, నిర్బంధ విద్యను ప్రవేశపెట్టడం, ఆరోగ్యమూ పారిశుద్ధ్యమూ పెంచడం, కుటీర పరిశ్రమలు వృద్ధిచేసి— అందరకు చేతినిండా పని కల్పించి— కూడూ, గుడ్డా, గూడూ ఎవరికి కొదువ లేకుండా చూడడం— ఇట్లాంటిపనులు చేస్తారు.

రామ: మన పొలాలకు కాల్వలు తేవాలి బాబూ!

కరీం: స్టేషన్‌కి దగ్గర్కి ఏక్ సడక్కి వేయించాలి- భాయి సాబ్! మాకీ టాంగా నడ్పడ్కి బహుత్ తక్లీఫ్ కీ వుంది.

జాన్: మన బడికి గవర్నమెంటు గ్రాంటు రావాలి పంతులు గారూ! అప్పుడు నాకేమైన స్కేలు పెరుగొచ్చు.

పేరి: మా ఇంటిదాపున ఓ బావి తోడించాలి బ్రదర్! కావడి మోయలేక చస్తున్నాను. (బుజాలు పుణుక్కుంటాడు.

శార: మన ఊళ్ళో ఓ వైద్యశాల ఏర్పాటుచేస్తే బావుండదా? బావగారూ! (సూటిగా చూస్తుంది)

ప్రతా: కావాలి, రావాలి, అంటే ఏదీ కాదు- ఏదీ రాదు- మనమంతా కలిసి మనకే సాయం చేసుకోవాలి. అప్పుడు సర్కారుకూడా మనకు సాయం చేస్తుంది. అంటే మనకు కావల్సిందంతా మనమే సాధించి తెచ్చుకోవాలి అన్నమాట.

రామ: బీదోళ్ళం బాబూ! మేమేం సాయం చేయగలం?

రాజా: మీకున్నదే.

పేరి: వాళ్ళకున్న తలే ముంతా దానంచేసి దేంట్లో తినమంటావ్? దేంతో తాగమంటావ్?

రాజా: డబ్బున్నవాడు డబ్బివ్వాలి- వస్తువులున్నవాడు వస్తువులివ్వాలి- ఏం లేనివాడు శ్రమదానం చేయాలి. (పేరిశర్మవైపు తిరిగి) తెలిసిందా? (ప్రశ్నార్థకంగా చూస్తాడు)

(ప్రవేశము- సుందరరావు కోపంతో)

సుంద: శారదా! శారదా! ఇంకా ఇంటికి వచ్చే వేళ కాలా? నడూ!

శార: అన్నయ్యా! వొస్తున్నా. (లేస్తుంది- మీనాక్షి చెవిలో ఏదో చెప్పి ముందుకు అడుగు వేస్తుంది)

సుంద: (రాజారావు నుద్దేశించి) "తాచెడ్డ కోతి వనమంతా చెరిచిం" దన్నట్టు, మగవాళ్ళను తనవలె సన్యాసులను చేసేది చాలక- ఆడవాండ్లనుకూడా రచ్చకు లాగుతున్నాడు; సిగ్గు లేకుంటేపాయ్.

పేరి: (ధీమాగా) ఆడవాళ్ళకుమట్టుకు స్వాతంత్ర్య మక్కర్లా? మన రాజ్యాంగంలో ఆడా మగా అంతా 'ఈక్వల్' అంటే సమానం.

సుంద: (పేరిశర్మవైపు తిరిగి) నీకు నీ ఇంట్లో ఉన్న స్వాతంత్ర్యం తెల్సులేవోయ్. అందుకేగా కావడి మోయలేక చస్తున్నావు- షరంలేదు.

మీ: (లేచి) మా ఇంటి జోలి నీకెందుకయ్యా! అది మా ప్రైవేటు సంగతి. చాలు చాలు! శాణాతనం.

సుంద: (మీనాక్షి మొగమై) అవును. మీ సావాస పున్నెమేకదా! మా చెల్లెలి యీ తెగువకు కారణం. (హేళనగా చూస్తాడు)

పేరి: (లేచి కోపంతో) ఏయ్! నోరుముయ్- విప్పావంటే గుద్ది చంపేస్తా- ఏమనుకున్నావ్ ఈ పేరిశర్మను? (పిడికిలి బిగించి పైకురకబోతాడు)

సుంద: మందబలం చూసుకొని కుక్క మొరుగుతుందిలే. నీదో లెక్కా- పక్షీ! మెడలు విరిచేస్తా కదిలావంటే. (ఆ స్తీన్లు పైకెక్కిస్తాడు)

రాజా: (మధ్య వచ్చి) శర్మ! ఊరుకో. బావా! శాంతించు. అలసి వచ్చినట్లున్నావు. కాసిన్ని మంచినీళ్లుతెప్పించనా?

జాన్: పంతులుగారూ! ఆవేశపడకండి. ఇంటికి పదండి. (గడ్డం పట్టుకొని బతిమాలుతూ ఆవలకు దాటిస్తాడు)

సుంద: సరే! చూసుకుంటాను. (వెనుకకు వెనుకకు చూస్తూ నడుస్తాడు. శారద అతన్ని అనుసరిస్తుంది.)

ప్రతా: ఇవాళ ఏదో తప్పతాగి వచ్చినట్లున్నాడు. పాపం! బి. ఏ. లో ఫేలయ్యాడుకదా!

పేరి: కాకేంచేస్తాడు వెధవ! (మొసదీస్తుంటాడు)

రాజా: ఉద్యోగాల వేటకై తిరిగి తిరిగి వేసారి వచ్చినట్లుంది చూస్తే!

మీా: వీని అండలో వున్న చెల్లిని, శారదను వీడు పెట్టు బాధలు ఇన్నన్ని కావన్నయ్యా!

రాజా: సరే! మన పనికి వద్దాం.

(అందరు స్థిమితులౌతారు)

ప్రతా: పానకంలో పుడుకలా వీడోడు వచ్చిపడ్డాడు మధ్యన (విసుక్కుంటాడు)

రాజా: మీరు సాయశక్తులా మీ గ్రామానికి ఏమేం సాయం చేస్తారో చెప్పండి?

ప్రతా: నేను మన గ్రామాభ్యుదయానికి శక్తివంచన లేకుండా ధనసహాయం చేస్తాను.

పేరి: నేను వాక్సహాయమైతే చేయగలను.

జాన్: నేను బుద్ధిదానం చేస్తాను.

రామ: మమ్ములను ఏమిమ్మంటారు బాబూ!

కరీం: మా బదన్‌లే వుండాయి.

రాజా: అవియే కావాలి. మీరు శ్రమదానం చేయండి.

రామ: చిత్తం! బాబయ్యా! పేదోళ్ళం.

కరీం: బహుత్ అచ్ఛా- బాబూసాబ్!

అందరు: (నిలబడి)

సాధిస్తాం! సాధిస్తాం! రామరాజ్యమును సాధిస్తాం!
దేశం స్వయం సమృద్ధిగ జేస్తాం!
కూడూ గుడ్డా అందరికిస్తాం!
గ్రామసీమనూ స్వర్గసీమగా
మారుస్తాం! మారుస్తాం! రామరాజ్యమును సాధిస్తాం!
భ్రాతృభావమును కలిగిస్తాం!
ఐకమత్యమును స్థాపిస్తాం!
అహర్నిశంబులు మాతృభూమికై
కష్టిస్తాం! కష్టిస్తాం! రామరాజ్యమును సాధిస్తాం!

స్వతంత్ర భారత్ కి- జై!
పంచవర్ష ప్రణాళికలకు- జై!

(అందరు నిష్క్రమిస్తారు - తెర పడుతుంది)

## ద్వితీయ రంగం

ప్రదేశం: సుందర్‌రావ్ యిల్లు.

ప్రవేశం: సుందర్‌రావు‌_ శారదలు.

సుంద: శారదా! అమ్మా నాన్నలు నిన్ను నాకు అప్పగించి పోయారు. ఇంతవరకు ఏలాగో నిన్ను పెంచి పెద్ద చేశాను. ఇకమీదట నిన్ను సంభాళించడం నా వశం గాదు. నీకు పెళ్ళి చేస్తేనా నా బరువు తీరుతుంది; తలి దండ్రుల కిచ్చిన మాటా నిలబెట్టుకున్నవాణ్ణి అవుతాను; ఏమంటావ్?

శార: ఇప్పుడే పెళ్ళి కేంతొందరొచ్చిం దన్నయ్యా!

సుంద: నాకు తెలును_ నీ మనసు బావమీదుందని; అతడు మనకు అందని మ్రానిపండు, కొరకరాని కొయ్య. లేని పోని ఆశలుపెట్టుకోక, నేను తెచ్చిన సంబంధం ఒప్పుకో, సుఖపడతావు.

శార: నా పెండ్లి విషయం నేను చూసుకుంటాను. నీవేమీ కంగారు పడవాకు అన్నయ్యా!

సుంద: (కోపంతో) శారదా! నన్ను ధిక్కరిస్తున్నావా? నీకు పెండ్లిచేయడం నా ధర్మం; కర్తవ్యమూనూ. ఇది మన తలిదండ్రుల శాసనంకూడానూ.

శార: (నెమ్మదిగా) క్షమించన్నయ్యా! (ప్రార్థనాపూర్వకంగా చూస్తుంది)

సుంద: (గట్టిగా) శారదా! శ్రుతిమించి రాగాన పడుతున్నది నీ వ్యవహారం. ఈ పెండ్లి నేను చేసితీరుతాను. బ్రహ్మాదులు కూడా దీనిని తప్పించలేరు, లేరు లేరు.

శార: అయితే నా పెండ్లి బావతోనే కావాలి; మరెవ్వరితోను కాజాలదు. ఇది అక్షరాలా నిజం; నిజం- నిజం.

సుంద: (దిగివచ్చి) అతను కాదంటే?

శార: ఆజన్మ బ్రహ్మచారిణిగా వుంటాను; అంతే! కాని మరొకణ్ణి చేసుకోను.

సుంద: ఎట్లా చేసికోవో చూస్తాను.

శార: ఎట్లా చేస్తావో నేనూ చూస్తాను.

సుంద: అంతేనా?

శార: ముమ్మాటికి అంతే.

సుంద: అలాగైతే నీకీ యింట్లో స్థానం ఉండదు.

శార: (రోషంతో) మంచిదన్నయ్యా. (కండ్లనీరు నించు తుంది)

సుంద: ఆఁ! ఇంతకు తెగించావన్నమాట. సరే! తక్షణం బయటకు నడూ! ఊఁ! (గర్జిస్తాడు)

శార: (ఏడుస్తూ) సరే! వెడుతున్నాను. (కంఠం రుద్ధం అవు తుంది. మెల్లిగా వెడుతుంది)

సుంద: (నోరు తెరచుకొని దిగ్భ్రాంతితో అటు చూస్తూ) పోనీ! ఎటు పోతుందో అదీ చూస్తాను.

(తెర పడుతుంది)

## ద్వితీయ రంగం

ప్రదేశం: సుందర్‌రావ్ యిల్లు.

ప్రవేశం: సుందర్‌రావు— శారదలు.

సుంద: శారదా! అమ్మా నాన్నలు నిన్ను నాకు అప్పగించి పోయారు. ఇంతవరకు ఏలాగో నిన్ను పెంచి పెద్ద చేశాను. ఇకమీదట నిన్ను సంభాళించడం నా వశం గాదు. నీకు పెళ్ళి చేస్తినా నా బరువు తీరుతుంది; తలి దండ్రుల కిచ్చిన మాటా నిలబెట్టుకున్న వాణ్ణి అవుతాను; ఏమంటావ్?

శార: ఇప్పుడే పెళ్ళి కేంతొందరొచ్చిం దన్నయ్యా!

సుంద: నాకు తెలుసు— నీ మనసు బావమీదుందని; అతడు మనకు అందని మ్రానిపండు, కొరకరాని కొయ్య. లేని పోని ఆశలు పెట్టుకోక, నేను తెచ్చిన సంబంధం ఒప్పుకో, సుఖపడతావు.

శార: నా పెండ్లి విషయం నేను చూసుకుంటాను. నీవేమీ కంగారు పడవాకు అన్నయ్యా!

సుంద: (కోపంతో) శారదా! నన్ను ధిక్కరిస్తున్నావా? నీకు పెండ్లి చేయడం నా ధర్మం; కర్తవ్యమూనూ. ఇది మన తలిదండ్రుల శాసనంకూడానూ.

శార: (నెమ్మదిగా) క్షమించన్నయ్యా! (ప్రార్థనాపూర్వకంగా చూస్తుంది)

సుంద: (గట్టిగా) శారదా! శ్రుతిమించి రాగాన పడుతున్నది నీ వ్యవహారం. ఈ పెండ్లి నేను చేసితీరుతాను. బ్రహ్మాం[ద్రాదులు] కూడా దీనిని తప్పించలేరు, లేరు లేరు.

శార: అయితే నా పెండ్లి బావతోనే కావాలి; మరెవ్వనితోను కాజాలదు. ఇది అక్షరాలా నిజం; నిజం_ నిజం.

సుంద: (దిగివచ్చి) అతను కాదంటే?

శార: అజన్మ బ్రహ్మచారిణిగా వుంటాను; అంతే! కాని మరొకణ్ణి చేసుకోను.

సుంద: ఎట్లా చేసికోవో చూస్తాను.

శార: ఎట్లా చేస్తావో నేనూ చూస్తాను.

సుంద: అంతేనా?

శార: ముమ్మాటికి అంతే.

సుంద: అలాగైతే నీకీ యింట్లో స్థానం ఉండదు.

శార: (రోషంతో) మంచిదన్నయ్యా. (కండ్ల నీరు నించుతుంది)

సుంద: ఆఁ! ఇంతకు తెగించావన్నమాట. సరే! తక్షణం బయటకు నడూ! ఊఁ! (గర్జిస్తాడు)

శార: (ఏడుస్తూ) సరే! వెడుతున్నాను. (కంఠం రుద్ధం అవుతుంది. మెల్లిగా వెడుతుంది)

సుంద: (నోరు తెరచుకొని దిగ్భ్రాంతితో అటే చూస్తూ) పోనీ! ఎటు పోతుందో అదీ చూస్తాను.

(తెర పడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: ఊరిబయట నదీతీరం.

ప్రవేశం: శారద విచారంతో_

శార: (అటు ఇటు చూచి, చీరకొంగు నడుముకు గట్టిగా బిగించుకొని చేతులు జోడించి) భగవంతుడా! చిన్నప్పుడే తల్లిదండ్రుల్ని దూరంచేశావ్_ రాక్షసుడైన అన్నయ్య పంచలో నానా యాతనలకు గురిచేశావ్_ నేను కోరుకున్న బావని కాదని ఓ ముసలాడికి నన్నంటగట్టటానికి సిద్ధపడ్డాడు వాడు. డబ్బుకు గడ్డితినే రకం ఆ పాపి_ ఎంతకైనా సాహసిస్తాడు ఆ రాకాసి. నాకు నా అన్నవాళ్ళెవళ్ళూ ఈ లోకంలో లేరు ఇప్పుడు. నా తలిదండ్రులను చేరబోతున్నాను; అనుజ్ఞనిమ్ము. (నది నుద్దేశించి) ఓ నదీమతల్లీ! నన్ను దయతో నీ ఒళ్ళోకి తీసుకొని, అమ్మా నాన్నలకు అప్పగించు. (నదిలో దూకడానికి సిద్ధమౌతుంది)

రాజా: (తటాలున ప్రవేశించి) శారదా! శారదా! ఆగు_ ఆగు. (వచ్చి అమాంతం పట్టుకుంటాడు)

శార: (వెనుకకు చూచి) బావా! నన్ను వొదులు_ నన్ను వొదులు బావా! (ఏడుస్తూ గింజులాడుతుంది)

రాజా: ఎంత పిచ్చిదానవు శారదా! నీలాంటి స్త్రీ ఆత్మహత్యకా_ పాల్పడటమా_ చాలా విచిత్రంగా ఉంది.

ఇంత సాహసానికి నీవు పూనుకున్నావంటే– దీని వెనుక ఏదో భాగోతం వుంది. అదేదో చెప్పు.

శార: (నేల మాపు చూస్తూ, కన్నీరు కారుస్తూ వుంటుంది).

రాజా: చెప్పు శారూ! (గడువపట్టి బతిమాలుతాడు)

శార: ఎవరికోసం నేను బ్రతుకాలి బావా! కన్నవాళ్ళు దూరమయ్యారు– ఉన్నవాళ్ళు గొడ్డునమ్మినట్టు నన్ను అమ్మాలని చూస్తున్నారు. వలచినవాని మనస్సు తెలియకుండా వుంది. నా దారి అడ్డగించి ఏం పుణ్యం కట్టుకో బోతున్నావు బావా? (మొగాన కొంగు కప్పుకొని ఏడుస్తుంది)

రాజా: (ఉద్రేకంతో) ఒక భారతరత్నాన్ని బ్రతికించుకున్న పుణ్యం కట్టుకున్నాను.

శార: 'నా' అన్నవారు లేని ఓ నిరాశ్రయ పక్షి జీవించుట వ్యర్థము– అసంభవము.

(పేరిశర్మ తొందరగా ప్రవేశిస్తాడు)

పేరి: రాజా! రాజా! (ఇటు అటు వెతికిస్తూ) మా రాజారా విటు వెళ్ళాడుటండీ! (రాజారావును చూచి త్రుళ్ళిపడి) థ్యాంక్యూ! నువ్విక్కడికి వచ్చావా? నేను నీకోసం ఊరంతా తిరిగి చచ్చాను. (శారదను చూచి దిగాలుపడి) శారదా! నీవెలాగో కనిపిస్తున్నావు– కారణం తెలుసుకోవచ్చా?

శార: నా ఖర్మ- అన్నయ్యా!

పేరి: (రాజారావును చూచి) ఏం సంగతి? ఏవిటి ఆలోచి స్తున్నావు?

రాజా: నా గతే పాపం ఈవిడకూ పట్టింది. ఈయమకు ఆశ్ర యమిచ్చి యెవరుకాపాడుతారా? అని ఆలోచిస్తున్నాను.

పేరి: గుట్టవలె బావవు నీవుండగా వేరు అండకై వెదకడం ఎందుకో?

రాజా: నేను పరుల పంచలో పడియుండడం నీవు మరుస్తు న్నావు. ఇప్పుడు నా ఆశంతా నీమీదనే పెట్టుకున్నాను శర్మా!

పేరి: థ్యాంక్యూ. నేను నా భార్య పంచన ఉన్న సంగతి నీకూ తెలుసుగా! అయినా ఈ కేసు మా శ్రీమతికి రిక మండ్ చేసి ఆర్డర్ తీసుకవస్తాను- థ్యాంక్యూ! (దౌడు తీస్తాడు)

శార: బావా! వ్యర్థంగా నాకోసం బాధపడుతున్నావు నీవు.

రాజా: కాదు, శారదా! సార్థంగానే. అందులో స్వార్థం కూడా లేకపోలేదు. (అదోలా చూస్తాడు)

శార: (తనలో) నిరాశా మేఘం మాటున ఆశా నక్షత్రం ఒకింత మినుకు మినుకు మంటున్నది. అంతయు దైవా ధీనం.

(ప్రవేశము- అఘూన మేఘూన పడి మీనాక్షి- వెనుకనుండి పేరిశర్మ)

మీ: (అమాంతం కౌగిలించుకొని) ఎంత అఘాయిత్యానికి పూనుకున్నావమ్మా! శారదా! నేనున్నానుగా, నీ కే కొరత రానీయను. పద, మనింటికి పోదాం.

పేరి: థ్యాంక్యూ! మై డియర్ మీనా!

శార: "పాపీ చిరాయుః" అన్నట్లు ఇంకా ఈ పాడు బ్రతుకెన్నాళ్లో— ఎవరికోసమో!

మీ: ఏం మాటలమ్మా అవి శారదా! చీకటి రాత్రులు ఎప్పటికీ వుండవుగదా!

రాజా: మీనాక్షక్కయ్యా! పోయివస్తా.

పేరి: శారద చెల్లమ్మా! వెళ్ళివస్తా.

(రాజారావు పేరిశర్మలు ఒకవైపు— మీనాక్షీ శారదలు మరోవైపు నిష్క్రమిస్తారు)

(తెర పడుతుంది)

## తృతీయాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: మీనాక్షి ఇంట్లో అరుగు.

ప్రవేశం: శారద విచారంతో.

శార: (స్వగతం) వరించినవాణ్ణి పొందటానికి నోచిపుట్టాలి. ఎంత అందం వుంటేనేం? ఎంత చదివివుంటే నేం? ప్రియుని ప్రేమను చూరగొనలేని ఆడబ్రతుకో బ్రతుకా? బావ హృదయం ఎంత విశాలమో అంత గంభీరం;

అదెంత దృఢమైందో- అంతకన్నా మృదువైంది. తన లక్ష్యసాధనకోసం సర్వస్వాన్ని తృణప్రాయంగా వదలిన త్యాగమూర్తి బావ. 'సార్థంగానే- అందులో స్వార్థం కూడా లేకపోలేదు'- అని అతడన్న మాటల్లోని ఆ స్వార్థానికి అర్థమేమిటో? సరిగా అర్థమవడంలేదు. కాని ఆ చూపుల్లో ఆశకు కొంచం తావున్నట్లే తోస్తున్నది. (కొంచెం ఆలోచించి తన్ను తాను సంభాలించుకొంటూ ఆవేశంలో ప్రకాశంగా) బేలా! ఏల? యీ లీల 'అందని మ్రాని పండ్లకు అర్రులు చాచుట'. అతని దీక్షాయజ్ఞంలో నా సేవా సమిధను వ్రేల్చమనడమే ఆ స్వార్థానికి అర్థము (నిట్టూర్పు విడుస్తూ) ఆ పుణ్యమూర్తిని చేపట్టనున్న ఆ ధన్యజీవి, ఆ తపశ్శీలిని ఎవరోకదా.

( మీనాక్షి నవ్వుతూ ప్రవేశించి )

మీ: ఆ ధన్యజీవివి, ఆ తపశ్శీలినివి నీవేసుమా!

శార: ( ఉలిక్కిపడి, సిగ్గున తలవాల్చి) అక్కా! నీకుగూడా పరిహాసమే తోస్తున్నదా? నా బ్రతుకే పరిహాసాలకు గురి ఐంది. ( కన్నీరు తుడుచుకుంటుంది. )

మీ: కాదు తల్లీ! (చెంపలు నిమురుతూ) నీ కైకిలి నువ్వు సరిగా చెయ్యి- కూలి మాట నేను చూసుకుంటానుగా.

శార: అంతా ఆ భగవంతుని దయ.

మీ: పాప మా భగవంతు డేంచేస్తాడమ్మా! పిండికొద్ది రొట్టె

యిస్తాడు_ అంతేకదా! సరే! కాని నీ ఆరోగ్య శాఖలో నీ సేవ ఎంతవరకొచ్చింది?

శార: మన టీకాలకు భయపడి మశూచికం మాయమైపో యింది. కలరా చాలావరకు అదుపులోనికి వచ్చింది. ఇప్పుడు మలేరియాపై దండయాత్ర సాగుతున్నది. వేళైంది. ఇక నేను వెడతా. రోగుల్ని చూడాలి.

మీా: నాకూ టైమైంది. భోజనం చేయాలిగా_ మీా అన్న య్యగా రెదిరిచూస్తారు.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు _ తెర పడుతుంది)

ద్వితీయ రంగం

ప్రదేశం: వీధి.

ప్రవేశం: రాజారావు, పేరిశర్మలు మాట్లాడుతూ.

రాజా: శారద తన విధిని తాను ఏంచక్కా నిర్వర్తిస్తూవుందో చూశావా? ఆమె ఓ చిన్న డాక్టర్‌గా తయారైంది.

పేరి: ఈ పక్షపాతం పనికిరాదు. ఎప్పుడూ నువ్వు శారదనే పొగుడుతూ వుంటావు. మా ఇంటావిడ మాత్రం తన డ్యూటీలో ఏమన్నా వెనుకంజ వేస్తుందనుకొన్నావా? చూడు_

రాజా: (మధ్యలో అందుకొని) ఆమాట ఎవరన్నా అన్నారా?

పేరి: మరి లేకుంటే! మబ్బులో మేలుకొల్పులు పాడి, నన్ను నిద్ర మేల్కొలిపిన లగాయతు తాను తూగుటు

య్యాల్లో ఊగుతూ అన్ని పనులు ఫర్మాయిస్తూ నాచేత ఏం చక్కగా చేయిస్తుందనుకున్నావు! ఒక్కనాడైనా పొగిడావా?

రాజా: ఒక్కనాడైనా నాకీ సంగతి చెప్పావా? ఇక ముందు పొగడ్తానులే !

పేరి: సరే! ఇప్పుడు మీ టీచర్ వృత్తి ఎట్లా సాగుతుంది?

రాజా: దానికేం, మీ అందరి సహకారంవల్ల బలే జోరుగా సాగుతోంది. మన గ్రామంలోని పురుషులు సగం మంది అక్షరాస్యులయ్యారు. మన ప్రణాళికాంతంవరకు వారిలోని నిరక్షరాస్యత పూర్తిగా నిర్మూలింపబడుతుందని నా విశ్వాసం.

పేరి: మరి స్త్రీలమాటో?

రాజా: దానికో చిక్కొచ్చిపడ్డది. ఒక లేడీ టీచర్—

పేరి: (సగంలో అందుకొని) మన శారదుందిగా!

రాజా: ఆమె పనియే ఆమెకు చేతినిండా వున్నదాయె. రెండు పనులెలా చేయగలదు?

పేరి: థ్యాంక్యూ! అబ్బా! శారదంటే ఎంత ప్రేమ! ఆమెకెప్పుడూ శ్రమ కాకూడదు. అంతేకదూ! (నవ్వుతాడు)

రాజా: కాదు! కాదు! శర్మా! చక్కగా పని నిర్వహించాలంటే ఏక లక్ష్యం కావాలి.

పేరి: థ్యాంక్యూ! ఈ పనికి మా శ్రీమతిని కాస్త రిక్వెస్టు చేయమంటావా?

రాజా: అవశ్యం.

పేరి: థ్యాంక్యూ.

(శారద ప్రవేశిస్తుంది)

శార: ఓహో! టీచర్‌గారికి నమస్తే!

రాజా: డాక్టర్‌గారికి కుశలమా?

పేరి: టీచరూ— డాక్టరూ— (వారిని చూపుతూ) మరి నేనో?

రాజా: నీవా ? టీచర్ వైపుంటే స్టూడెంటువి, డాక్టర్‌వైపుంటే పేషెంటువి.

పేరి: (రాజారావువైపు వెళ్ళి) టీచర్ వైపు వుంటే— స్టూడెంటుని, (శారద వైపు వెళ్ళి) డాక్టర్ వైపు వుంటే— పేషెంటుని— (అదరిపడి) అమ్మో పేషెంటుగా మాత్రం వుండలేను. స్టూడెంటు పనే నయం— (రాజారావువైపు దూకుతాడు.) ఇంట్లోనూ నేను మా ఆవిడకు స్టూడెంటునే. బేసిక్ శిక్షణ సరిగా ఇస్తుంది.

(శారదా రాజారావులు నవ్వుతూ ఒకరినొకరు చూసుకుంటారు)

పేరి: (శారద మొగమై) డాక్టరమ్మా! ఒక మందు కావాలి. ఈ మధ్య మా రాజు ఓ వ్యాధిలో తగులుకొన్నాడు. (రాజును చూస్తూ) ఏమిటోయి దాని పేరు ? (నెత్తి గోక్కొంటూ) ఆఁ! ఆఁ! అదే! అదే! ప్రేమ వ్యాధి. దానికి తగిన మందు మీ దగ్గరే లభిస్తుందని నా ఆశ. థ్యాంక్యూ !

(శారద సిగ్గుపడుతుంది- రాజారావు చిరునవ్వు నవ్వుతాడు)

(అందరు నిష్క్రమిస్తారు - తెర పడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: మీనాక్షి ఇల్లు.

ప్రవేశం: తూగుటుయ్యాల్లో అకు నముల్తూ మీనాక్షి-

(పేరిశర్మ రొప్పుతూ ప్రవేశిస్తాడు)

పేరి: థ్యాంక్యూ! మై డియర్ మీనా! ఇవాళ అర్జంటు పని ఏర్పడ్డంవల్ల ఆలస్యం ఐంది. ఏమీ అనుకోవుకదూ! మా మీన మంచిది- చాలా మంచిది; థ్యాంక్యూ! (క్రింద చతికలపడ్తాడు అలసటతో)

మీ: (నవ్వుతూ) మీ థ్యాంక్యూలూ, నక్క వినయాలూ కాసేపలా వుంచి, ఒక కావెడు నీళ్ళందుకొండురూ. పుణ్యం వుంటుంది. ఇంట్లో తాగడానికిగూడా ఒక చుక్క లేదు. ఊఁ! (త్వరపెడుతుంది)

పేరి: అయ్యో! రెండు కావళ్ళ నీళ్ళు అప్పుడే ఐపోయాయా! (ఆశ్చర్యంగా చూస్తాడు)

మీ: ఇవాళ శనివారం కదండీ! స్నానానికి-

పేరి: (మధ్య అందుకొని) మరిచాను, మరిచాను- కాస్త ఆగి తేకూడదూ! కాళ్లు పీక్కోపోతున్నాయి. (తన కాళ్లు పట్టుకుంటాడు)

(శారద లోపలినుంచి వస్తుంది)

శార: ఇంవాక చెప్పారుకాదు వదినమ్మా! ఇప్పుడే అందు కొస్తాలేండి! (బిందె తీసుకొని పోబోతుంది)

మీ: వద్దు, శారదా! వద్దు! నీకెందుకులే యీ కష్టం? ఇవ్వాళ వచ్చి రేపు పోయేదానివి. మా రుటీను మాకు ఉండనీ; అలవాటు కుంటుపడితే కష్టం.

శార: పర్లేదులెండి. నేటినుండి ఈ డ్యూటీ నాది; అన్నయ్యకు ఆటవిడుపు సుమండీ. (నవ్వుతూ పేరిశర్మను చూస్తూ చకచకా పోతుంది)

పేరి: థ్యాంక్యూ! (మీనాక్షివైపు అదోలా చూస్తాడు)

మీ: (మగనిని చూస్తూ) చాలు చాలు– మీ మూలాన ఎంత అపఖ్యాతి రానున్నదో! పాపం, పరాయిపిల్ల పని చేయాలా! (చేతులు తిప్పుతుంది)

(మీనాక్షి లేచి నిల్చుంటుంది. పేరిశర్మ అనుసరిస్తాడు)

మీ: మగడ! నీకేల యీ లండుతనమూ!

నీ, ఠీకూ ఠాకు చూస్తే నాకేమి ఘనమూ ॥నీ॥

పేరి: మగువ! నాకైతె లేదు లండుతనమూ–

నీ హూడ్తూ. హోడ్తే వింటేను నాకెంతో భయమూ ॥నా॥

మీ: నిన్న మొన్నటిపిల్ల– అన్నపూర్ణ మొగుడు–

పొన్నయ్య ఎంతో మంచివాడూ–

పేరి: అంతకన్నా ఎంతో మిన్న నేనూ–

మీ: నగ, తన్నెన్నో చేయించుతాడూ_

పేరి: మిగిలున్న చేయిస్తాను నేనూ_

మీ: ఓర, కున్నా తానే వండుతాడూ.

పేరి: లే, కున్నా నేనే వండుతానూ_

మీ: దాని, కన్నాము పెడ్తాడు_ తిన్నాకు తీస్తాడు.

పేరి: అపగ, కున్న వడక వేస్తాను_ తిన్నగాను పీస్తాను.

మీ: మగడ! నీకేల యీ లండుతనమూ_

పేరి: మగువ! నాకైతె లేదు లండుతనమూ_

మీ: తెల్లావారగ లేచి, ఇల్లూ గుమ్మము లూడ్చి,
కల్లాపు తా జల్లుతాడూ_

పేరి: ముగ్గు, లెల్లా నేనే దిద్దుతానూ_

మీ: తెల్ల, తెల్లాగ బోళ్ళు తోముతాడూ_

పేరి: మెల్ల, మెల్లాగ నీళ్ళు మోస్తానూ_

మీ: బట్ట, లెల్లా తానే ఉదుకుతాడూ_

పేరి: బాజార్, కెళ్ళి సామాన్లు తెస్తానూ_

మీ: దాని, పిల్లాల నెత్తుకొని_ ఇల్లిల్లు తిప్పుతాడు.

పేరి: నా, యిల్లాలి నెత్తుకొని (మీనాక్షిని ఎత్తుకొని)
యిల్లిల్లు తిప్పుతాను. (గిరగిర తిప్పి దించుతాడు)
(సుందర్‌రావు మారువేషంతో ప్రవేశిస్తాడు)

సుంద: శర్మా! శర్మా!

పేరి: ఎవర్నీవు? (గట్టిగా అరుస్తాడు)

మీ: ఎవడో దొంగసాధువులా వున్నాడు; బయటికి పొమ్మను.

సుంద: అవును; దొంగసాధువునే. (గడ్డం మీసం తీసేస్తాడు)

పేరి: (నోరు తెరుచుకొని) అరే! నువ్వా సుందరం! థ్యాంక్యూ!

సుంద: (నిట్టూర్పు విడుస్తూ) అవును! నేనే సుందరుణ్ణి— ఆడుబిడ్డను ఉసురుపోసుకొనుటలో ఆరితేరిన దురంధరుణ్ణి. (కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి) క్షమించు శర్మా! (మీనాక్షిని గని) మన్నించు వదినమ్మా! (హడావిడి పడుతూ) ఏది? మా శారదేది? (ఇటు అటు చూస్తాడు)

మీ: శారదుంది, కాని సంగతేమిటి?

(శారద నీళ్ళ బిందెతో ప్రవేశిస్తుంది)

సుంద: శారదా! నా శారదా! (చేతులు చాచి ఎదురు నడుస్తాడు)

శార: (బిందె దించి) అన్నయ్యా! (కాళ్ళమీద పడుతుంది)

సుంద: చెల్లీ! ఈ రాక్షసుణ్ణి క్షమింపలేవా? (ప్రాధేయపడతాడు)

శార: ఆ పీడ కలను మరుద్దాం అన్నయ్యా! (కండల్లో నీరు కమ్ముతుంది)

మీ: (శారద భుజంపై చేయివేసి) ఏడ్వకు తల్లీ!

పేరి: థ్యాంక్యూ! ఇన్నాళ్ళూ ఎక్కడ తిరుగుతూవున్నావ్ ఫ్రెండ్?

శార: (సాపేక్షగా) ఔను! చెప్పు- అన్నయ్యా!

సుంద: శారద ఎలాగూ ఆత్మహత్య చేసుకుంటుందని భయాన పారిపోయాను. ఇందాకటి వేసంలో తిరుగుతూ వున్నాను; ఇప్పుడు శారద బ్రతికే వుందని తెలిసి ఇటు చేరుకున్నాను.

మీ: పొద్దు పోయింది. భోజనానికి లే- బాబూ!

సుంద: భోజనం తరువాత. మన రాజునుకూడా క్షమాపణ కోరాలి. వెళ్ళొస్తా వదినమ్మా! సెలవు పేరయ్యా!

పేరి: థ్యాంక్యూ! (అటే చూస్తూవుంటాడు)

(సుందర్‌రావు సరసర వెడతాడు)

(మిగిలినవారూ నిష్క్రమిస్తారు — తెర పడుతుంది)

## చతుర్థాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: వీధి.

ప్రవేశం: సుందర్‌రావు భూషన్‌రావులు

సుంద: నమస్కారాలు- మావయ్యా!

భూష: సుందరం! ఎప్పుడు రాక? ఎక్కడికి పోయావురా? అల్లుడూ! సంగతులేమిటి?

సుంద: ఏదో ఇంటిమీద విసుగొచ్చి అలా తిరిగొచ్చాను. మావయ్యా!

భూష: చూచావా? మన వూరు ఎట్లా మారిందో! రెండేండ్ల క్రితం చూచినవారు దీన్ని అట్టే గుర్తుపట్టలేరు కదూ!

సుంద: నిజం మాఁవయ్యా! మీరన్నట్టు ఈ వూరు చేరంగానే నేను సంశయంలో పడ్డాను. ఇది మన వూరేనా? దారి తప్పలేదుకదా! అని; ఆశ్చర్యకరంగా మన గ్రామం మారింది. ఇదంతా మన_

భూష: రాజు కృషియే. మొదట్లో నేను వాణ్ణి గురించి_

సుంద: పొరపడ్డారు కదూ! నేనుకూడా పొరపడ్డాను మాఁవయ్యా!

భూష: ఏదో మాట విన్లేదని ఆవేశంతో ఇంటినుండి పొమ్మన్నాను. ఇప్పుడు ఎన్నిసార్లు పిలిచినా ససేమిరా రానంటాడు. మీ అత్తయ్య బెంగతో మంచం పట్టింది. (కన్నీరు తుడుచుకుంటాడు) వానిది సున్నితమైన మనస్సు.

సుంద: మకరం పట్టుకూడా మాఁవయ్యా!

భూష: ఈ మధ్య పెండ్లి చేసుకునే ధోరణికూడా కనబడుతున్నది.

సుంద: పిల్లెవరు? మాఁవయ్యా!

భూష: మేనమామ కూతురు.

సుంద: ఏ మేనమామ కూతురు? మాఁవయ్యా!

భూష: వాని కెందరు మేనమామ లున్నార్రా?

సుంద: (గంతేసి) మా శారదనా! మాఁవయ్యా! నిజంగానా! మాఁవయ్యా! (చకితుడై చూస్తాడు)

భూష: నే నెప్పుడైనా అబద్ధమాడానా? నాయనా!

సుంద: ఇగ మీ ఆజ్ఞ ఒకటే నట్టు మాఁవయ్యా!

భూష: నా ఆజ్ఞ అయినపుడు వానికి పెళ్ళి అవసరం లేకుండె; వానికి పెండ్లి కావలసినపుడు నా ఆజ్ఞతో పని లేదు. (నిట్టూర్పాడు)

సుంద: ఎంత మాట! మాఁవయ్యా! మీరు తథాస్తు! అనంది ఆ కార్యం జరుగుతుందా?

భూష: ఇప్పుడు వాని యిష్టమే మా యిష్టం– అంతేకాదు ఊరి ఇష్టమూనూ అదే. ఇప్పుడు పంచవర్ష ప్రణాళికా ఉత్సవాలు జరుగుతున్నవి మన గ్రామంలో.

సుంద: అందుకే కాబోలు ప్రారంతాక శకళ్లాడుతూ వున్నది. మీరక్కడికేనా? మాఁవయ్యా!

భూష: అవును.

సుంద: నేనూ వస్తాను.

భూష: పద.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు – తెర పడుతుంది)

## ద్వితీయ రంగం

ప్రదేశం: ఊరి బయటి మైదానం

ప్రవేశం: శారద మీనాక్షి మొదలగు మహిళలు చప్పట్లు కొడుతూ బృందగానం చేస్తూ.

అందరు: నెహ్రూ ప్రభుత్వమే– ఉయ్యాలో, మాకు
నిత్యమూ కావాలి– ఉయ్యాలో
సగంమంది: జాతిపిత కోరిన రామరాజ్యంబును
మిగిలిన సగం: సాధించుటకు సర్వశక్తియుతమైనట్టి
అంద: నెహ్రూ ప్రభుత్వమే– ఉయ్యాలో, మాకు
నిత్యమూ కావాలి– ఉయ్యాలో

స. మం: బంజరు భూములను– ఉయ్యాలో, మిగుల
మి. స: ఫలవంతముగ జేయ– ఉయ్యాలో
స. మం: ప్రాజెక్టు లెన్నియో– ఉయ్యాలో, మాకు
మి. స: బహుగాను నిర్మించు– ఉయ్యాలో
స. మం: కాల్వలను చెరువులను– ఉయ్యాలో, మాకు
మి. స: ఘనముగా కట్టించు– ఉయ్యాలో
స. మం: పంచవర్షంపు ప్రణాళికలు సమకూర్చి
మి. స: బాగుగా దేశాన్ని పైకి గొనివచ్చేటి
అంద: నెహ్రూ ప్రభుత్వమే– ఉయ్యాలో, మాకు
నిత్యమూ కావాలి– ఉయ్యాలో

స. మం: చేతినిండా పనులు– ఉయ్యాలో, మాకు
మి. స: చేకూర్చి పెట్టేది– ఉయ్యాలో
స. మం: కూడు గుడ్డలు గూడు– ఉయ్యాలో, మాకు
మి. స: కొల్లలుగ నిచ్చేది– ఉయ్యాలో
స. మం: పాడి పంటలు పసులు– ఉయ్యాలో, మాకు

మి. స: బహుళముగ నిచ్చేది- ఉయ్యాలో
స. మం: పంచవర్షంపు ప్రణాళికలు సమకూర్చి
మి. స: బాగుగా దేశాన్ని పైకి కొనివచ్చేటి
అంద: నెహ్రూ ప్రభుత్వమే- ఉయ్యాలో, మాకు
నిత్యమూ కావాలి- ఉయ్యాలో
స. మం: చదువు సందెలకొరకు- ఉయ్యాలో, పాఠ
మి. స: శాలలను స్థాపించు- ఉయ్యాలో
స. మం: రోగములు రాకుండ- ఉయ్యాలో, జాగ
మి. స: రూకతను గాపాడు- ఉయ్యాలో
స. మం: మందులూ మాకులూ- ఉయ్యాలో, మాకు
మి. స: అందజేయగ జాలు- ఉయ్యాలో
స. మం: పంచవర్షంపు ప్రణాళికలు సమకూర్చి,
మి. స: బాగుగా దేశాన్ని పైకి గొనివచ్చేటి
అంద: నెహ్రూ ప్రభుత్వమే- ఉయ్యాలో, మాకు
నిత్యమూ కావాలి- ఉయ్యాలో

(పాడుతూ నిష్క్రమిస్తారు)

(మరొక ప్రక్కనుండి- రాజారావు మొదలగు పురుషులు కోలాటం వేస్తూ బృందగానం చేస్తూ ప్రవేశిస్తారు)

శాంతగుణ మూర్తివయ్య గాంధితాతా! మాకు
స్వరాజ్య మిస్తివయ్య గాంధితాత!

ప్రజలంత నిను గొల్వ గాంధితాతా! – నెహ్రు
ప్రభుత్వ మిస్తివయ్య గాంధితాత!
విద్యార్థులు నినుగొల్వ గాంధితాతా! – చదువు
వృద్ధిచేయు మందువయ్య గాంధితాత!
పంతుళ్ళు నినుగొల్వ గాంధితాతా! – బాగ
పాఠాల్ చెప్పుమందువయ్య గాంధితాత!
కర్షకులు నినుగొల్వ గాంధితాతా! – మిగుల
కష్టించుమందువయ్య గాంధితాత!
కార్మికులు నినుగొల్వ గాంధితాతా! – మంచిగ
నిర్మించుమందువయ్య గాంధితాత!
పండితులు నినుగొల్వ గాంధితాతా! – నడ్చి
బాట జూపుమందువయ్య గాంధితాత!
కోమట్లు నినుగొల్వ గాంధితాతా! – లాభం
కొద్దిగ గొనుమందువయ్య గాంధితాత!
ఉద్యోగులు నినుగొల్వ గాంధితాతా! – లంచం
విద్య మానుమందువయ్య గాంధితాత!
నాయకులు నినుగొల్వ గాంధితాతా! – సేవా
నైజమెరుగుమందువయ్య గాంధితాత!
వకీళ్ళు నినుగొల్వ గాంధితాతా! – న్యాయం
వాదించు మందువయ్య గాంధితాత!
వైద్యులు నినుగొల్వ గాంధితాతా! – ధర్మ
వై[illegible]ం చేయుమందువయ్య గాంధితాత!

శాంతగుణ మూర్తివయ్య గాంధితాతా! — మాకు
స్వరాజ్య మిస్తివయ్య గాంధితాత!
గాంధితాతా! గాంధితాతా! గాంధితాతా!

(పాడుచు నిష్క్రమిస్తారు)

(మరొకవైపునుండి స్త్రీ పురుషులు డప్పు నాట్యంతో ప్రవేశిస్తారు)

అందరు: 1. కాలం మార్పును గాననివాడా!
దేశ పురోగతి తెల్వియనివాడా!
పంచవర్ష ప్రణాళికలో రన్నో చిన్నన్నా! — యిది
రామరాజ్య ప్రవేశములో రన్నో చిన్నన్నా!

2. వ్యవసాయము విరివిగ కొనసాగా,
యంత్రాగారము లధికము కాగా,
ప్రాజెక్టులు పూర్తియై, బాగా
ఉత్పత్తులు పెరుగుచుండే పోగా,
పంచవర్ష ప్రణాళికలో రన్నో చిన్నన్నా! — యిది
రామరాజ్య ప్రవేశములో రన్నో చిన్నన్నా!

3. పంచాయతి సరి చూచి యెన్నుకో,
వృత్తిపనులు అభివృద్ధిపరచుకో,
వెనుకబడిన తమ్ములను ఆదుకో,
ఢంకగొట్టి నీ హక్కు చాటుకో,

పంచవర్ష ప్రణాళికరో రన్నో చిన్నన్నా! – యిది
రామరాజ్యప్రవేశమురో రన్నో చిన్నన్నా!

4. నిన్ను హీనుడని నిల్గిరిగదవోయ్,
నీపై పెత్తనం నెరపిఱిగదవోయ్,
నీవే గొప్పని వత్తురు పదవోయ్,
నీ గౌరవమును నిల్పుకొనగదోయ్,
పంచవర్ష ప్రణాళికరో రన్నో చిన్నన్నా! – యిది
రామరాజ్యప్రవేశమురో రన్నో చిన్నన్నా!

(పాడుచు నిష్క్రమిస్తారు – తెరపడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: చావడి
ప్రవేశం: రాజారావు

రాజా: (స్వగతం) నా బాధ్యత కొంతవరకైనా నేను నెరవేర్చగలిగానని ఇప్పటికి సంతోషం కల్గుతున్నది. ఐదేండ్ల క్రిందటి గ్రామానికి, ఇప్పటి గ్రామానికి పోలికేలేదు. క్రొత్త వూరన్నట్లుగా వుంది, ఈ వూరు. మానవుడు తల్చుకొన్న ఈ లోకంలోనే స్వర్గం నిర్మించుకోగల్గుతాడు. ప్రతి గృహంలో స్వర్గజీవనం ఏర్పడితేనేకాని, మనదేశం స్వర్గసీమకాదు. జాతిపిత ఆశించినట్లు మన రాజ్యం ఎప్పుడు రామరాజ్యం ఔతుందోమరి? గహస్థుడు కానిదే గృహం స్వర్గం కాదు. ఏవో నాకు గోచరంకాని

శక్తులు నన్ను గృహస్థుని కమ్మని ప్రేరేపిస్తున్నాయి. గృహిణి లేనిది గృహస్థుడు కాజాలడుగదా! ఆ రోజు శారదను రక్షించింది మొదలు ఆమెయందేలకో ఒక బద్ధానురాగం ఏర్పడ్డది. ప్రతిరోజూ ఏదో మిషతో ఆమెను చూడాలనిపిస్తుంది. చూడలేకపోతే ఏమీ తోచదు. ఆమె కూడా ఏదో పని కల్పించుకొని నాతో ఏదో మాట్లాడుటకు ప్రయత్నిస్తూనే వుంటుంది. ఆమెది మూగప్రేమ, నా వ్రతాంతం కోసం నిరీక్షిస్తూ ఉన్నట్లనిపిస్తుంది. అనుకూలదాంపత్యం వున్న గృహస్థే బ్రహ్మచారికన్నా మిన్నగా దేశసేవ చేయగలడని నా కిప్పుడు దృఢంగా తోస్తున్నది. శారదా నేనూ కలిసిన, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక యిమ్మడి విజయం సాధించగలదని నాయంతరాత్మ ఘోషిస్తుంది. అంతా భగవంతుని దయ. శర్మ ఇంకనూ రాలేదేమిటి? పాపం వానికి ఇంట్లో చేతినిండా పని. శారద వాండ్ల ఇంట్లో ప్రవేశించింది లగాయతు గుడ్డిలో మెల్లలా ఆ సంసారం మెరుగనిపిస్తూ వుంది.

(పేరిశర్మ ప్రవేశిస్తాడు)

పేరి: థ్యాంక్యూ! రాజా!

రాజా: ఇది నీ కొక పల్లవైంది.

పేరి: కాదు, నిజంగా థ్యాంక్స్ టు యూ రాజా! ఎందుకంటావా? నా కావడిమోత తప్పించినందుల కంటాను; థ్యాంక్యూ!

రాజా: సరే! కాని, మన పంచవర్ష ప్రణాళికోత్సవాల చివరి రోజుకదూ! నేడు. నేటి ప్రోగ్రాంలో బి. డి. ఓ. గారు కూడా పాల్గొంటున్నారు. అన్ని ఏర్పాట్లు పూర్తి ఐన ట్లేనా? శర్మా!

పేరి: థ్యాంక్యూ! అన్నీ పూర్తిచేసే వస్తున్నాను.

(ప్రతాపరెడ్డి ప్రవేశిస్తాడు)

రాజా: ఇదిగో! నీకోరకే ఎదిరిచూస్తున్నాం- రెడ్డీ!

ప్రతా: సరే! బి. డి. ఓ. గారిని తోడ్కొని సభకు పోదాం పద.

రాజా: పద.

(అందరు నిష్క్రమిస్తారు - తెరపడుతుంది)

## చతుర్థ రంగం

ప్రదేశం: మర్రిచెట్టు క్రింద మైదానం

ప్రవేశం: బి. డి. ఓ., రాజారావు, ప్రతాపరెడ్డి, పేరిశర్మ, భూషణరావు, సుందర్ రావు, శారద, మీనాక్షి మరియు ఇతరులు చాపలపై ఆసీనులై -

ప్రతా: (లేచి) ఇప్పుడు సభాధ్యక్షులు మన బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసర్ గారు తమ సందేశాన్ని అందజేస్తారు. (కూర్చుంటాడు)

బి. డి. ఓ: (నిలబడి) సోదరీ సోదరులారా! మనం మొదటి పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా ముగించుకొని, రెండవ ప్రణాళికలో అడుగుపెట్టుచున్నాం. ప్రథమ

పంచవర్ష ప్రణాళిక మీకు తెచ్చిపెట్టిన ఫలితాలగూర్చి ఏకరువుపెట్టడం అంటే, ముంజేతి కంకణానికి అద్దంచూపి నట్లు అవుతుంది. ఐదేండ్ల వెనుకకు తిరిగిచూస్తే ఇది ఆనాటి గ్రామమే కాదని తోస్తుంది. మీకు ఈ ఉన్నతి కల్పించింది కేవలం ఈ ప్రణాళికే కాదు— ఈ మహా పురుషుని సేవాదీక్ష దానికి తోడైంది. (రాజారావు వైపు చూపిస్తాడు— సభలో చప్పట్లు) మీ గ్రామం మా బ్లాక్లో మణిపూసలాంటిది. ప్రభుత్వం తన ఆశయం ప్రజా సహకారంతోనే సాధించగలదనుటకు ఇదొక నిదర్శనం. రెండవ ప్రణాళికనుగూర్చి రాజారావుగారి నోట విందురుగాక. (కూర్చుంటాడు— చప్పట్లు)

రాజా: (లేస్తాడు) (హర్షధ్వానాలు) అమ్మలారా! అయ్యలారా! ఇప్పటి మన స్థితికి కారణం మీ అందరి సహాయ సహకారాలు. ముఖ్యంగా నాకు అండగా వుండి నన్ను నడిపించింది మన ప్రతాపరెడ్డి త్యాగం. (ప్రతాపరెడ్డి వైపు చూస్తాడు— చప్పట్లు) ఇంతటితో మన ధ్యేయం— అనగా రామరాజ్య సాధన— పూర్తికాలేదు. ఈలాంటి మరికొన్ని ప్రణాళికలను విజయవంతంగా సాగించాల్సి వుంది. మొదటి ప్రణాళిక వ్యవసాయ ప్రధానంగా వుండె. ఇప్పుడు అంటే, రెండవ ప్రణాళికలో పరిశ్రమలు మన కేంద్రములు. దేశం స్వయం సమృద్ధి సాధించాలంటే

పారిశ్రామిక రంగంలో అధికోత్పత్తులద్వారా జీవిత ప్రమాణాలు పెంచాల్సి వుంది. "నా" అన్న భావం వెళ్ళి "మా" అన్న భావం అందరిలో కల్గాలి. (చప్పట్లు) ఇట్లు మన ప్రణాళిక లన్నింటిని విజయవంతంగా పూర్తి చేసుకొంటేనే రామరాజ్యం సాధించ కలుగుతాం, మహాత్ముని కలలు నిజం చేసి చూపుతాం, భారతసీమను స్వర్గ సీమగా తీరుస్తాం. (చప్పట్లు) జైహింద్! (కూర్చుంటాడు)

అధ్య: ఇప్పుడు ప్రతాపరెడ్డిగారు ప్రసంగిస్తారు.

ప్రతా: (లేచి) మన రాజు నిజానికి మన గ్రామానికి కిరీటం లేని రాజు. అతడు మనందరికీ, ముఖ్యంగా నాకు, ఆదర్శమూర్తి, అనుసరణీయుడు. నా భూములన్ని ఇప్పుడు మన భూములని చెప్పటానికి హర్షిస్తున్నాను. (హర్ష ధ్వానాల మధ్య ఆసీనుడౌతాడుది)

అధ్య: భూషణరావుగారిని నాలుగు సందేశ వాక్యాలు విని పించవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

భూష: (సంతోషంతో లేచి) అధ్యక్షులకు కృతజ్ఞతలు. సభికులకు అభినందనాలు. ఇప్పుడు నా కొడుకునుగూర్చి నేను గర్విస్తున్నాను. అదిలో చాలా పొరపడ్డాను. వాడు నా కండ్లు తెరిపించాడు. ఈనాడు నా సొత్తు యావత్తు వాని హస్తగతం చేసి, నేను మీలో ఒకణ్ణిగా చేరిపోతు

న్నాను. నా కొడుకు నన్ను ఇప్పుడైనా కాదనడని భావి స్తున్నాను. (చప్పట్ల మధ్య కూర్చుంటాడు)

రాజా: (లేచి) అధ్యక్షుల ఆజ్ఞతో— నేను నా తల్లిదండ్రులను ఎదిరించుటకు సాహసించినందులకు విచారిస్తున్నాను, కాని వారి ప్రేమ నన్ను ఎన్నడో మన్నించిందని నాకు గట్టి నమ్మకం. ఎందుకంటే, ప్రపంచంలో కుపుత్రుడుంటాడు కాని కుమాత వుండదు. (చప్పట్లు) ఇప్పుడు వారి యాజ్ఞ ఆశీర్వచనపూర్వకంగా గ్రహిస్తూ— నే నిదివరకు మీలో ఒకణ్ణి గావున, నాకు చెందిన సొమ్ము మన సొమ్మని చాటిచెప్పుటకు గర్విస్తున్నాను. (హర్ష ధ్వానాల మధ్య ఆసీనుడౌతాడు)

అధ్య: ఇంకా ఎవరైనా మాట్లాడవచ్చును.

సుంద: (గంభీరంగా లేచి) అధ్యక్షులు! మావయ్య! ఇతర మిత్రులు! ఆదిలో రాజునుగూర్చి— కాదు, మా బావను గూర్చి— నేను పొరపడుటే కాదు— అతనికి ఎదురు తిరిగాను; కాని, నా యెడ బావ ప్రవర్తనలో ఏమీ మార్పు కనిపించలేదు. పశ్చాత్తాపంవల్ల నా పాపాలన్నీ పటాపంచలైనాయి. ఇంత ఘనకార్యం సాధించిన మా బావకు ఒక అమూల్య వస్తువును— అతనికి మిక్కిలి ప్రియమైనదానిని— బహూకరించదలచాను. అతడు ఊఁ అంటే చాలు, ఆ వస్తువును మీ అందరి యెదుట సమర్పించు

కోవాలని కుతూహలపడుతున్నాను. (రాజారావువైపు చూస్తాడు. అందరు సుందర్‌రావువైపే చూస్తుంటారు- రాజారావు అధ్యక్షులవైపు చూస్తాడు- అధ్యక్షులు చూపులతోనే ఆజ్ఞ ఇస్తాడు)

రాజా: (లేచి, అందరివైపు చూస్తూ) సరే! మీ అందరి ఇష్టమే నా ఇష్టం- కానిండు.

సుంద: (అధ్యక్షుల ఆజ్ఞతో శారదను రాపించి, మామయ్య అనుమతితో. ఆమె హస్తం రాజారావు హస్తంలో ఉంచుతాడు: అందరూ చప్పట్లు- హర్షధ్వానాలు చేస్తారు- మీనాక్షి చెరియొక పూలమాల అందిస్తుంది)

రాజా: (తండ్రివైపు చూస్తాడు- అనుమతి వేడుతున్నట్లుగా)

భూష: (సంతోషంతో) ఊం "శుభస్య శీఘ్రం" అంతకన్నా ఎక్కుడు సంతసం నాకేముంది నాయనా! ఆదర్శ దంపతులై భావిభారత భాగ్యోదయానికి మార్గదర్శకులగుదురుగాక!

(రాజారావు శారదలు ముసిముసి నవ్వులతో, క్రీగంటి చూపులతో ఒకరి మెడలో ఒకరు పూలమాలలు వేసుకొంటారు- అందరూ కరతాళధ్వనులు చేస్తారు.)

పేరి: థ్యాంక్యూ! నేనూ ఇప్పుడో ఇంటివాణ్ణయ్యాను. అంటే, నేను భర్తను, నా భార్య అక్షరాలా భార్య. రా! మై డియర్ మీనా! (ఆహ్వానిస్తాడు- మీనాక్షి వచ్చి

వామభాగాన నిలుస్తుంది. పేరిశర్మ సగర్వంగా చూస్తాడు. మీనాక్షి సిగ్గున తలవాల్చి చిరునవ్వుతో చూస్తుంది. చప్పట్లు మారుమ్రోగుతాయి)

శారదా రాజారావులు: సాధిస్తాం! సాధిస్తాం! రామరాజ్యమును సాధిస్తాం!

మీనాక్షీ పేరిశర్మలు: స్థాపిస్తాం! స్థాపిస్తాం! గ్రామరాజ్యమును స్థాపిస్తాం!

ప్రతా: మన సభాధ్యక్షులు బి. డి. ఓ. గారికి, ముఖ్య అతిథి భూషణరావుగారికి మరియు ఇతర సభాసదులందరికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు!

అధ్య: జాతీయగీతంతో కార్యక్రమం సమాప్తం.

అందరు: (నిలబడి పాడుతారు)

జనగణమన అధినాయక జయహే! భారత భాగ్య విధాతా!
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా, ద్రావిడ, ఉత్కళ, వంగ,
వింధ్య, హిమాచల, యమునా, గంగ, ఉచ్ఛల జలధి తరంగ!
తవశుభనామే జాగే! తవశుభఆశిషమాగే! గాహే తవజయగాథా
జనగణ మంగళదాయక జయహే! భారత భాగ్య విధాతా!
జయహే! జయహే! జయహే! జయ జయ జయ జయహే!

(తెర పడుతుంది)

ఇతి శమ్.

ఓం

శ్రీ సాయినాథాయ నమః

# ఎన్నికలొస్తున్నాయి - జాగ్రత్త!

(నాటిక)

## ప్రథమాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: సర్పంచ్ పాపారావు ఇంట్లో లోపలి గది

ప్రవేశం: పాపారావు కుర్చీలో కూర్చొని— అతని పాదా లొత్తుతూ వజ్రాలు

పా: (హుంకరించి) ఎన్నికలొస్తున్నాయి—

వ: (మధ్యలో) జాగెర్త

పా: జాగ్రత్త! (గట్టిగా ఒత్తి పలుకుతు) ఎవరికిరా జాగ్రత్త? దొంగనాకొడుకా! మతిమాలోైడా! నాకా? నీకా? గ్రామస్థులకా? లేక గ్రామంలోని గుండాల ముఠాకా? ఆ ముఠాకు నాయకమ్మన్యుణ్ణి అని కులుకుతున్న ఆ ముతనష్టపు అమృ- (నాలుక కరచుకొని) కాదు కాదు, మృతరాయుడికా? ఎవరికిరా? చెప్పు- (పండ్లు పటపట కొరుకుతాడు)

వ: కాదు దొరా! కాదు. (వణుకుతుంటాడు)

పా: ఏం కాదురా? దొంగ నా కొడుకా!

వ: మన్నించండి దొరా! ఆ_ ఆ_ ఆ_ (ఆగుతాడు)

పో: ఆ ఆ ఏంటిరా? నీ తలకాయ (కొట్టబోతాడు)

వ: కాదు, కాదు; అవును, అవును. ఇది నా తలకాయె. (తల పుణకొ్కంటూ) కొట్టకు దొరా! కొట్టకు. (వెనక్కి వెనక్కి జరుగుతాడు)

పో: మరి చెప్పు (గర్జిస్తాడు)

వ: (అదరిపడి వెక్కిలుచూస్తూ) ఏం సెప్పాలి! దొరా!

పో: (కోపముతో) అదేరా, జాగ్రత్త అంటివి_ ఎవరికి?

వ: చెప్తా దొరా చెప్తా. ఏం చెప్పాలి? (తల గోకొ్కంటాడు) అయ్యో! నా మతి మండా, అదే నా ముత్యాలు (సిగ్గుపడుచు) నా అందాల రాణి, నా మోరీల బరణి, నా రతనాల మూట, నా ముత్యాల పేటు, వజ్రాల బాటు నా మనస్సులో దొర్లేసరికి ఈ లోకమే అవుపడదు దొరా!

పో: జాగ్రత్త ఎవరికో చెప్పమంటే ఈ వెధవ వాగుడు ఏమిట్రా? దొంగ నా కొడుకా!

వ: జాగెర్త అన్నానా దొరా! అయ్యో! నా మతి మండా. మీకోసం జాగర్తేంటి? దొరా! అందర్నీ జాగెర్తపడ్చే వాండ్లైతిరి తవరు. సూరీడు మీరు సెప్పినట్లే వెండగాస్తాడు. సెందురుడు మీరు సెప్పినట్లే సల్లని ఎన్నెల గురిపిస్తాడు. గాలిదేముడు ఇసనకర్రపట్టి ఈస్తాడు_ చీపురుపట్టి వూడుస్తాడు. అనదేముడు కల్లాపి సల్లేస్తాడు_

నీళ్ళు నింపేస్తాడు. అగ్గిదేముడు నీళ్ళు కాసేస్తాడు- అంటు అందేస్తాడు. యముడు కఱ్ఱపట్టుక మీ ఇంటి ముంగిట కాపలా కాస్తాడు. కుభేరుడు మీ ఖజానా లెక్కలు రాస్తాడు దొరా! ఇలా దేముళ్ళంతా తవరి ఇంటికాడ సాకిరిచేస్తూనే వుంటారాయె. నాటి రావణా సూరుడుకూడా మీ బలంముందు బలాదూర్ అంటే నమ్మండి దొరా!

పా: భేష్! భేష్! బాగా చెప్పావురా. సరేకాని జాగ్రత్త ఎవరికో చెప్పావుకావు. జాగ్రత్త ఎవరికి? నీకా?

వ: అయ్యో! నా మతి మండా- జాగెర్త నాకు అయితే అసలే అక్కర్లా. నేను రేతిరీ పగలూ మీ శేవలో జాగెర్తగానే వున్నానాయె. ఇంగ పోతే గ్రామస్తులకంటే- ఆళ్ళెప్పుడూ జాగెర్తగానే మీ హుకుంకు లోబడి, మీ అడ్డులకు మడ్డులువొత్తుతూ వున్నవారాయె.

పా: అయితే, జాగ్రత్త ఆ గుండాలముఠాకంటావా? వారి నాయకమ్మున్యుడికంటావా?

వ: ఆళ్ళకీ అక్కర్లేదు దొరా! ఆళ్లు మీ ఉమిటీ ముందరి దీపాలు- మీ కోపపు అగ్గికి మిడుతలు- మీ ఉంకారాన్కి పూచిక పుల్లలు.

పా: మరి, జాగ్రత్త అన్నావుకదరా! దొంగనా కొడుకా! ఎవరికిరా?

వ: నేను అన్లేదు దొరా! నాతోడు_ నీతోడు_ నా ముత్యా
ల్తోడు - దొరా!

పో: అఁ! అబద్ధాలుకూడా మొదలెట్టావురా! దొంగనాకొ
డుకా! నాదగ్గరేనట్రా! (గుడ్లురిమిచేస్తాడు)

వ: (గజగజలాడుతూ) లేదు దొరా! లేదు. నేనన్లేదు దొరా!
అన్నారనీ అన్నాను_ విన్నాను కన్క.

పో: ఎవరన్నారురా?

వ: ఎవరేంటి దొరా! చిన్నా పెద్దా, అందరినోటా అదే పాట.

పో: ఓహో! అదా! ఎన్నికల పల్లవి. అయితే సర్లే.

వ: చిత్తం చిత్తం. (మరల పాదాలొత్తుట మొదలెడుతాడు)

పో: వజ్రాలూ! నీపేరు వజ్రమైనా నీ చేతులు పూలవలె ఎంత
మెత్తగా వున్నాయిరా! నువ్వు పాదాలొత్తుతుంటే
హాయిగా నిద్రొస్తుందిరా.

వ: అవును దొరా! ఇదే మాట మా ముత్యాలు ఎప్పుడూ
సెపుతా వుంటాది దొరా! అంటే నేనంటాను_ 'ఒసే నా
బంగారుసిలుకా! రతనాలమొలకా! ముత్యాలగొలకా!
ఇదంతా నీ కాళ్ళసలువేనే మాలచ్చిమీ! నువ్వూ, ఆ
లచ్చిందేవి మీరిద్దరూ ఆ పాల సముద్దురంనుండే పుట్టిం
డ్రుగదే! ఆ సొంపు, ఆ వంపు, ఆజిగి, ఆబిగి, ఆ ఒయులు_
ఆ వగలు, ఇద్దరూ సమంగా పంచుకొని పుట్టిండ్రుగదే!
నీ కాళ్లు వుత్తగా వొత్తగా నా శేతులు అంత మెత్తగా

అయినాయె' అంటే, మాఁవా! 'ఊరకే పోగొట్టావులే' అని సంతోసం పట్టలాక నన్ను ఇలా బిగ్గ కావిలించుకోం టుంది దొరా! (దొరను కావిలించుకోపోతాడు)

పో: (చేతులు ముందుకుపెడుతూ) ఆగరా దొంగనాకొ డుకా! కళ్ళు కనపట్టంలేదట్రా? వళ్ళు తెలీటంలేదట్రా? ఎవర్ననుకొంటున్నావ్? (నెట్టబోతాడు)

వ: (భయపడుతూ వెనుకకు జరుగుతాడు) అయ్యో! నా మతి మండా! తప్పు దొరా! (చెంపలేసికొంటాడు) నా ముత్యాలనుకొన్నాను. రచ్చించాలి, రచ్చించాలి- నీ కాల్మొక్తా దొరా! (కాళ్ళమీద పడతాడు)

(పంచాంగం చేతపట్టుకొని శేషాచార్లు ప్రవేశిస్తాడు)

శే: విజయీభవ! దిగ్విజయీభవ! రాజద్వారే రాజముఖే సర్వత్ర విజయీభవ! (ఆశీర్వదిస్తూ చేతులు కట్టుకొని నిలబడి వుంటాడు)

పో: (చాప చూపిస్తూ) కూచోవయ్యా శేషాచార్లు! ఏంటి విశేషాలు ?

శే: తమరి దయవల్ల అంతా క్షేమం. పిలిచారట- సెలవి స్తారా దొరా !

పో: కాస్త నాకు గ్రహచారం చూడవోయ్!

వ: కాస్త నాగ్గూడా గాచారం అయ్యోర్లంగారూ!

పో: నోరుముయ్యి. నీవేంటిరా మధ్యలో?

వ: శిక్షం శిక్షం_ (నోరు గట్టిగా మూసుకొంటాడు)

శే: మీకు గ్రహచారం ఏంటి దొరా! అందరి గ్రహచారాలు తీర్చేవారైతిరి. మీరు మిక్కిలి మార్చేవారుకూడా నైతిరి.

పా: అవునోయి. అదలావుంచి, ఇప్పుడు నా గ్రహచారం ఎలా వుందో సరిగా చెప్పు, తగిన సంభావన దొరుకుతుంది. తగిలినా తప్పినా సంభావనమాత్రం ముడుతుందిలే_ (నవ్వుతాడు)

వ: అవును అవును_ అయ్యో! నా మతిమండా! మన దొరవారుమాత్రం మాట తప్పనోరే.

శే: మీ పాదాలదగ్గర పడి బ్రతికేవాండ్లం. మాకింతకంటే వేరే సంభావనేం కావాలి దొరా!

పా: ముడుతుంది- ముడుతుంది తగిన సంభావన. ఊఁ తొందరగా ఎన్నికలగూర్చి చెప్పు. (త్వరపెడుతాడు)

శే: ఎన్నికలగూర్చి యడుగనేల దొరా! రెండెన్నికల్లోనూ పోటీలేకుండా నెగ్గారు కదా! మూడో ఎన్నికలోగూడా మీరే గెల్చితీరుతారని వేరే చెప్పాలా? దొరా!

పా: చాల్చాలు. ఇవన్నీ వెనుకటి మాటలు. జరుగబోయేదేదో సరిగా లెక్కకట్టి చెప్పు. అయ్యవార్లుగదా! ఎట్లైనా గోదానమే.

వ: ఆఁ! (నోరుతెరచి) గోధానమే! ఈ సిన్నపనికే! నేనెప్పుడూ శేవసేస్తూనే వుండాను. నాకు ఏధానం లేదు.

పో: ఇస్తానురా ఇస్తాను; నీకూ దానమిస్తాను నిదానంగా. (ఆచార్లవైపు చూస్తూ) చెప్పు చెప్పు. (త్వరపెడ్తాడు)

శే: (వేళ్లు లెక్కిస్తూ పైకిచూచి) గురువు అష్టమాన వున్నాడు. ఏల్నాటి శని పాదాలకు వచ్చాడు. రాహువు పదకొండింట శుభుడు. ఓటమీ లేదు– గెలుపూ లేదు.

పో: (ఆశ్చర్యంతో) ఇవేం మాటలోయ్? ఓటమీ లేదు– గెలుపూ లేదు. మరేముంటుంది? ఈ గోడమీది పిల్లి వ్యవహారం కట్టిపెట్టు. ఏదో వొక్కటి నిక్కచ్చిగా చెప్పు.

వ: దొరవారి జాథకంలో ఎప్పుడూ గెలుపే అని సెప్పుకోండి అయ్యోర్లుంగారూ!

పో: నువ్వు నోరుముయ్యరా వజ్రాలూ! ఎన్నిసార్లుచెప్పాలి?

వ: ఔను! అయ్యో! నా మతిమండా! (నోరు మూసుకొంటాడు)

శే: ఇది సత్యం దొరా! ఎన్నటికీ తప్పదు. గ్రహచారం అలా వుందంటే నమ్మండి దొరా! వస్తాను.

పో: సరే! రావోయ్ ఆచార్లు.

(శేషాచార్లు నిష్క్రమిస్తాడు)

(తెరలో)

ఎన్నికలొస్తున్నాయి – జాగ్రత్త, రామరాజ్యం రావాలి– రాక్షసరాజ్యం పోవాలి, ధర్మానికే జయం– అధర్మానికి లయం, న్యాయం వర్ధిల్లాలి– అన్యాయం అణగారాలి,

అసత్యం_ అణచివేస్తాం, లంచగొండితనం తుడిచివేస్తాం, స్వార్థపరత్వాన్ని_ రూపుమాపుతాం, చీకటి బజార్ను_ నిర్మూలిస్తాం.

పా: ఏమిట్రా ఆ కాకిగోల?

వ: ఎన్నికలొస్తున్నాయి_ జాగ్రత్త అని దొరా!

పా: అదా! ఎన్నికల రొద. ఓహో! (బొమలు ముడివెట్టి) ఈనాటికి పాపారాయ సింహాన్ని ఎదిరించటానికి ఓ గ్రామసింహం పుట్టుకొచ్చిందన్నమాట! సరే, నేనూ చూస్తాను. (మీసాలమీద చేయివేస్తాడు)

వ: పాపారావు దొరను ఎదిరించడాన్కి ఎన్ని గుండెలు కావాలి? దొర అంటే, నీకు తెలీదురా! ఈయన పేరు ఇంటే పాపాలే పదామడ పారిపోతాయి. ఈయనతో ఐరం పెట్టుకొని ఎవడూ బతికి బట్టకట్టలా. మరిచాను_ మరిచాను. అయ్యో! నా మతిమండా! మొన్ననేకదా మా దొర కోపాన్కి ఈరారెడ్డి నిండు పేనం బత్తైపాయె. (ఆవేశంతో) నీవా పాపారావు దొర నెదిరించడం. ఎదిరించడాన్కి నీకు దొరే కావాల్సివచ్చాడ్రా! దొర కాళ్ళొత్తేటోణ్ణి నేను చాలన్రటా. నా పేరు అబ్రాలు. (ఛాతి చరుచుకొంటాడు) నా దెబ్బ అబ్రజంకంటె గట్టిదిరా. (పిడికిలి బిగించి పండ్లు కొరుకుతూ) నీ పేనం అంటే ఎంత? 'పిచ్చుకమీదికి బెమ్మ అస్త్రరం కావాలిట్రా? ఇదో

కాసుకో (కర్ర తీసుకుని పాపారావుమీదికి పోతాడు)

పా: ఆఁ_ ఆఁ_ ఆగరా ఆగరా_ దొంగనా కొడుకా! నీకేమైన మతి పోయిందాయేంటి? ఈ పిచ్చి వేషాలు చాలించు. (ఆపి కర్ర లాక్కుంటాడు)

వ: అయ్యో! నా మతిమండా! అయితే ఆడు పారిపోయిండా దొరా! ఎర్రి ఎదవ- పారిపోయి బెతికిపోయిండు.

పా: ఎవర్రా వాడు?

వ: ఆడే దొరా! తవర్ని ఎదిరించినోడు. నేనుండగా మీ మీద ఈగ ఆలనిస్తానా? దొరా!

పా: (తనలో) ఓరీ! అ_ మృతరాయుడా! నీళ్ళల్లో వుండి మొసలితోనా నీ వైరం? నీ పాపం పండింది; ఆయువు నిండింది. పోనీలే. ఏనుగను చూచి కుక్కలు మొరుగు తున్నవని వుపేక్షించినాకొద్దీ, వ్యవహారము శ్రుతిమించి రాగానబడుతున్నది. నిదురపోయే పులిపై రాళ్ళు విసిరి నిలువగలవా? నువ్వు భూమ్మీద. నీ పేరునుండి 'అ' ఎప్పుడో ఎగురకొట్టాను. ఇప్పుడు నువ్వు కేవలం మృతు డవు. నిన్నే ముందుగా ఎన్నికల దేవతకు బలిచ్చి, ఆయమ చేతిలోని జయమాలికను నా కంఠసీమ నలంక రించుకొంటాను.

వ: అయ్యో! నా మతిమండా! నేను మర్చేపోయాను. భోజ నానికి రమ్మని ఎప్పుడో కబురొచ్చింది దొరా!

పా: మాటల సందడిలోబడి అమాటే మరిచాను. పద పద.

(ప్రజాలు దారితీయగా పాపారావు లోనికేగుతాడు)

(తెర పడుతుంది)

## ద్వితీయ రంగం

ప్రదేశం: అమృతరావు ఇంటివెనుక మామిడితోట

ప్రవేశం: యువజన సంఘ నాయకుడు_ అమృతరావు, యువజనసంఘ సభ్యులు_ రాజగౌడు, ఆనంద రెడ్డి, గణపతిశాస్త్రి, దానయ్య, అంజలి చాపలపై కూర్చుండి

అమృ: ఎన్నికలొస్తున్నాయి_

రాజ: జాగ్రత్త!

ఆనం: ఎవరికి?

అమృ: ఇది అందరికీ వర్తిస్తుంది.

గణ: ముఖ్యంగా మన సంఘానికి.

దాన: ఊరివారినికూడా జాగర్తపర్చాలి.

అమృ: మన సంఘ సభ్యులందరూ_ ముఖ్యంగా కార్యవర్గ సభ్యులు అతి జాగ్రత్తగా నడుచుకోవాలి. మీరుమి క్కిలి గ్రామస్థుల నందర్ని జాగ్రత్తపరచాలి.

గణ: నిద్రనుండా జాగ్రత్తపరచేది?

అమృ: అవును; తెలియని విషయమంతా నిద్రావస్థయేకదా! మన వూరి ప్రజలు ఎన్నికలగురించి నిద్రావస్థలోనే వున్నారు.

రాజ: కాదా మరి. రెండెన్నికలు జరిగిపాయె. ఇంకా ఎన్ని కలంటే ఏంటో తెలీదాయె.

అంజ: ఎన్నికలు ఎన్నికలు అన్నారుగాని, ఎన్నికలు జరుగు తేకదా! మనకు తెలిసేది.

ఆనం: ఆ పరమ దుర్మార్గుడికి పోటీగా ఎవడన్నా నిలబడితే కదా! ధైర్యంచేసి.

గణ: నాకు ధైర్యం లేదనుకున్నారా- నేను నిలబడిఉండే దును కాని_

దాన: ఏం కాని? కచ్చులపు కానా?

అంజ: కాదు, కాని అంటే కల్దారు పైస- అణాలో నాలు గోవంతు.

(అందరు నవ్వుతారు. గణపతిశాస్త్రి చిన్నబుచ్చుకుం టాడు. సంభాళించుకొని)

గణ: కానీ, నా మెడకాయమీద తలకాయ వుంటుందో- వూడుతుందో అన్న అనుమానం రాగానే విరమించుకు న్నాను- అంతే. (తల పుడికి చూసుకుంటాడు)

రాజ: ప్రాణాలపై తీపున్నవాడెవడైనా ఆ హంతకునితో పోటీ చేయగలడా?

ఆనం: ఓరీ! నరరూప రాక్షసుడా! పాపాల భైరవుడా! పాపా రాయుడా! ధర్మంకోసం నిన్నెదిరించిన నా తండ్రిని పొట్టపెట్టుకుంటివిగదరా. నిన్ను పొడిచి, ఎగజిమ్మిన

యూ వేడిరక్తంతో మా నాన్నకు తర్పణమిస్తానురా- జాగ్రత్త! (భయంతో ఇటూ అటూ చూస్తాడు- స్థిమితుడై) అయ్యో! నా చెల్లి మంజుల లేదు- సరిపోయింది. వింటే ఎంత బాధపడేదో కదా! ఏదో ఆవేశంపట్టలేక అన్నాను. పాపం పరిహరించుగాక!

అమృ: నీవు ఆనందుడవు కనుక ఇంతవరకు వోపికతో వున్నావు. ఇంకోడైతే ఈపాటి కావని చేసియేవుండేవాడు.

అంజ: ఇప్పుడేమైంది? వాణ్ణి నిలువున చీరి చింతపండు చేయాల్సిందే. మా అమ్మ ఆత్మహత్యకు ఆ స్త్రీలోలుడే కారకుడు కదా!

దాన: కాదు కాదు, వాణ్ణి తిత్తితీసి, వ్రేలాడవేసి, నిలువునా కాట్లుగీసి ఉప్పూకారం చల్లాలి. అప్పుడుకాని నా కోపం చల్లారదు. ఉన్న ఒక్క ఎకరం పొలం దొంగ పత్రం వ్రాయించుకుని కాజేసాడుగదరా! మా తండ్రినుండి.

రాజ: వీరారెడ్డి హత్యాకేసులో సత్యంగా సాక్ష్యం ఇచ్చినందుకేకదా నన్ను మా సంఘంనుండి వేరుచేసుటేకాక, పాలివారితో కలహం కల్పించి, చివర్కి నా వృత్తికూడా లేకుండా చేసాడు. వాణ్ణి ఉప్పుపాతరలో గుడ్లు తేలవచ్చేట్లుగా పాతిపెట్టినా పాపం లేదు.

గుణ: వాడు కషాయివానికన్నా కడు హీనుడు. వాణ్ణి కట్టి

నా ముందు నిలబెట్టండి- ఓ కత్తి నా చేతికందివ్వండి- చూపిస్తాను నా తడాఖా. ఒకే దెబ్బతో చెండువలె వాని తల ఎగరగొట్టేస్తాను. వాని మాంసం ముక్కలు ముక్కలు కోసి కాకులకు గద్దలకు సంతర్పణం చేస్తాను.

అంజ: ఇప్పుడతడు అంగబలం, అర్థబలం, అధికారబలం గలాడు. మనం దేంట్లో అతనికి సరిరాం. వ్యక్తిగతంగా అతణ్ణి ఎదిరించలేం. కావున చట్టసమ్మతంగా అతణ్ణి ఎదిరించి, ఓడించి, గద్దెదించి జీవచ్ఛవంగా చేయడమే ప్రస్తుత కర్తవ్యం. అందుకే ఎన్నికలలో పోటీచేసి, గెలుచుట- అధికారం హస్తగతం చేసుకొని, గ్రామానికి సేవచేయుట- ప్రజల బాధలు దీర్చి, వారి అవసరాలు పూర్తిచేయుట- రామరాజ్యం స్థాపించి, మహాత్ముని కలలు సత్యం చేయుట- మన లక్ష్యం కావాలి.

రాజ: అదేకదా! మన ధ్యేయం, కర్తవ్యంకూడాను.

అమ్మ: కనుకనే మనం ఈ యెన్నికల విషయంలో అతి జాగ్రత్తతో మెలగాలి. ఎదుటివాని యెత్తులకు ప్రశాంతంగా ప్రతి యెత్తులు వేయాలి- చిత్తు చేయాలి.

దాన: అతడు పైసాతో ఓట్లు కొంటాడు గదా!

ఆనం: పైసలు తీసికోవాలి- పంగనామాలు పెట్టాలి.

గణ: పంగనామాలా వాని మొగానికి? తిరుమణి కావాలి, శ్రీచూర్ణం కావాలి, అద్దం కావాలి, బొట్టుపుల్ల కావాలి- ఇంత బూడిదపూస్తే చాలదూ!

మంజు: (నవ్వుచు ప్రవేశించి) అయ్యో! శాస్త్రిగారికి పంగ నామాలు పెట్టడం అంటే తెలీదా? ఎగనామం పెట్టడం.

అంజ: ఓట్లు వేస్తాం అని నమ్మించి ఎగబెట్టడం.

గణ: ఓహో! ఈమాత్రం తెలీదనుకుంటున్నారా? సోమయాజుల మనుమణ్ణి, సిద్ధాంతుల కొమరుణ్ణి, శాస్త్రుర్లు 'అను పేరుగలవాణ్ణి- (బొజ్జ పుణుక్కొనుచు) బూడిదే వానికి మిగులునని చెప్పటుకే అట్లంటిని.

రాజ: మంజులాదేవికి ఈ వేళ ఇంత ఆలస్యం ఐనదెందుకో?

మంజు: మీటింగ్‌కు వెళ్ళవద్దంటే వద్దని నాన్న ఒకటే శరం. ఆయన కన్నుగప్పి మెల్లగా జారి వచ్చేసరికీ ప్రొద్దైంది.

ఆనం: మంజులక్క మనకు అండదండగా వుండటంవల్ల మనకు సగం విజయం యిదివరకే లభించింది.

మంజు: సత్యం నిలపడం, ధర్మం నడపడం, మానవునికి ప్రథమ కర్తవ్యం.

అంజ: మంజులక్కయ్య పుమ్మెంత వనంలో తులసిమొక్క లాగు పుట్టింది. శ్రీగంధం తరువు సువాసన వనమంతా ప్రాకినట్లు— ఈమె మంచితనం ఎన్నటికైనా తండ్రిని మంచివానిగా మార్చగలదనే నా నమ్మకం.

ఆనం: సరే! మనం ప్రస్తుతానికి వత్తాము.

గణ: భయపెట్టి వోట్లు సంపాదించగలడుగదా! ఆ శూరాగ్రేసర చక్రవర్తి.

మంజు: ఆ యవసరమే రానీయకూడదు. ముసుపటివలెనే ప్రజలందరు భయపడుతున్నట్లు నటించాలి. లోపల ధైర్యం గలిగి నచ్చినవానికే వోటు వేయాలి.

దాన: ప్రచారానికి ధనం కావాలికదా!

అమ్మ: నిజాయితీ గలవారికి ఎన్నికల విషయంలో ఏమీ ఖర్చుపెట్టనవసరం లేదు. ప్రచార సందర్భములోనే ప్రయాణ ప్రచారాలకుగాను ఖర్చులు ప్రజలనుండియే విరాళపూర్వకంగా గ్రహించవచ్చును. భోజనములా? వారే అతిథులకువలె ప్రేమతో పెడతారు. ఇంకా కావలసిందేముంది?

రాజ: ప్రచారం చేయడం ఎట్లా?

అమ్మ: పూరేగింపులు తీయాలి; నినాదాలు చేయాలి; సమావేశాలు ఏర్పాటు చేయాలి; సభలు నిర్వహించాలి; బుఱ్ఱ కథలు చెప్పించాలి; కడప కడపకు వెళ్ళి వోటు విలువను, దాని పద్ధతిని వారికి గుర్తుచేయాలి; అర్హుడనిపించినవానికే వోటు వేయండని అర్థించాలి.

ఆనం: ఏమేం ప్రచారం చేయాలి?

మంజు: ఎన్నికలంటే ఏమిటి? వోటు అనగా నేమి? వోటు ఎవనికి అనగా, ఎటువంటివానికి వేయాలి? వోటు ఎలా వేయాలి? మరియు నిర్భయంగా వోటు వేయడం ఎలా? వీటి వివరాలు కరపత్రాలు, నినాదాలు, ఉపన్యాసాలు,

బుఱ్ఱకథలు మొదలైనవాటిద్వారా వివరించబడుతాయి.

అమృ: ఇంతటితో ఈ సమావేశం చాలింతాం.

(అందరు నిష్క్రమిస్తారు — తెర పడుతుంది)

తృతీయ రంగం

ప్రదేశం: ఉద్యానవనం— పాపారావు ఇంటినానుకొని

ప్రవేశం: మంజులాంజలులు— పూలు కోస్తూ—

మంజు: వచ్చెను వచ్చెను ఎన్నికలు— కొని
తెచ్చెను మనకామోదం

అంజ: విచ్చెను విచ్చెను పుష్పములు— అహ
ఇచ్చెను మనకామోదం

(పాడుచు, ఒకరిపై నొకరు పూలెగజల్లుకుంటారు)

మంజు: ఎన్నికలొస్తున్నాయి—

అంజ: జాగ్రత్త!

మంజు: ఎన్నికల విషయంలో జాగ్రత్తేమిటో తెలుసా?

అంజ: ఆ దేవిష్టే— అలామాట్లాడతావు? ఈవాళ ఉదయమే కదా! మన కార్యవర్గ సమావేశంలో వచ్చే సర్‌పంచ్ ఎన్నికల్లో మన మెలా జాగ్రత్తగా మెదలాలో, ప్రజల నెలా జాగ్రత్తపరచి, వోటు విలువ తెలిపి, దాన్ని సద్వినియోగపర్చుకొని, రామరాజ్య స్థాపన కెట్లా తోడుపడేట్లు చేయ్యాలో చర్చించుకున్నాం కదా! అప్పుడే మరచావా?

మంజు: ఆ యెన్నికలగూర్చికాదే యిప్పుడు నే నసేది.

అంజ: మరి ఏ ఎన్నికలగూర్చి? ఆఁ! తెలిసింది_ వరుడు వధువును ఎన్నుకోవడం_ అంతేనా? (చిరునవ్వుతో)

మంజు: (సిగ్గుపడుతు) కాదు, వధువు వరుని ఎన్నుకోవడం_ తెలిసిందా? (తర్జన చేస్తుంది)

అంజ: ఏ వధువు ఏ వరుని ఎన్నుకోవడం?

మంజు: అంజలి_ శాస్త్రిని ఎన్నుకోవడం.

అంజ: రావు_ మంజుల నెన్నుకోవడం. (ఇద్దరూ కిలకిల నవ్వుతారు)

(అమృతరావు, గణపతిశాస్త్రి చాటుగా ప్రవేశిస్తారు)

అమృ: వీరేదో మనలగురించే మాట్లాడుతున్నారు.

గణ: ఇక్కడే వుండి విందాంగాక!

(వినుటకుపక్రమిస్తారు)

మంజు: సరిపోవున? దా వధువు వరించిన,

వరియింపగ వలదే? వరుడూ_ వరియింపగ వలదే?

అంజ: సరిపోవున? దా వరుడు వరించిన,

వరియింపగ వలదే? వధువూ_ వరియింపగ వలదే?

(పాడుతారు)

మంజు: అయితే, నీ కిష్టం లేదన్నమాట_ అవునా?

అంజ: (సిగ్గుపడుతూ) నా యిష్టం వుంటే చాల్తుందా? అదృష్టం లేనప్పుడు. ఈ విషయంలో మా నాన్నకు అసలే ఇష్టంలేదు. మేనబావను చేసుకోమని ఒకటేపోరు.

నా కది యిష్టంలేక చదువని, తరువాత ఎన్నికలని దాటు వేస్తూవచ్చాను. ఇప్పుడు మాత్రం ఏ దారిలేదు, ఒక్క గోదారి తప్ప. (నిట్టూర్పు విడుస్తూ) ఎన్నికలు కాగానే అదే శరణ్యం.

మంజు: అయ్యో! అయ్యో! నే నుండగా నీ కంత నిరాశెందుకే? నువ్వు ఊఁ అను— ఆ తిరుపతి వెంకన్న ఎదుట మీ పెండ్లి అయిందే అనుకో; భయపడవాకు. (వీపు తట్టుతుంది) అది ఎన్నికల తరువాతనే సుమా! (హెచ్చరిస్తుంది)

అంజ: ఆహా! నెచ్చెలివంటే నీవేనే. (అమాంతం కౌగిలించుకొంటుంది— కనులనిండా అరుసపు నీరు నిండుతుంది)

అమృ: వింటివికదా! అంజలి వాక్కులు. ఇంకేం? నీ రొట్టె నేతిలో పడిందోయీ శాస్త్రీ!

గణ: కంటివి కదా! మంజుల మాటలు. మరేం! నువ్వు నక్కను తొక్కావోయీ రావూ!

అమృ: ఈ సంబంధం పాపారావు ససేమిరా వప్పుకోడు.

గణ: వాని ముండా! వప్పుకోక ఏం చేస్తాడు? ఈ దెబ్బతో వాని కుర్చీ విరుగుతుంది, అహంకారం కరుగుతుంది, కోరలు పీకిన పాము అవుతాడు— వప్పుకొని తీరుతాడు.

అమృ: మంజుల అతనికి ఆరో ప్రాణం. ఆమె యిష్టం కాదనకపోవచ్చు. వేచి చూతాం.

గణ: మా తండ్రికి నేను గారాల బిడ్డణ్ణి. నా యిష్టాన్ని ఎప్పుడూ కాదనడు. మా అమ్మ మాత్రం గొడవ చేయక మానదు. అయితేనేం? మా నాన్న ఒక్కసారి ఉరిమా డంటే చాలు_ కిక్కిన పేనైపోతుంది; గుర్రో నిక్కు కుక్కుకుంటుంది.

అమ్మ: మరింకేం?

గణ: ఆ జానయ్య మాష్టారున్నాడే మహా మొండికేడు. వర్గాంతర వివాహం అసలుకే పనికిరాదంటాడు. తన మేనల్లు డికిస్తానని ఒకటే మొండి పట్టుదల.

అమ్మ: గణపతీ! నువ్వేం బెంబేలుపడవాకు. మీ పెద్దలు ప్రొస్తులు కనుక రిజిస్ట్రీ మారేజి చేయిస్తాలే!

గణ: (నోరు తెరచుకొని, భుజాలెగరవేస్తూ) ఆ శుభ ముహూర్తం ఎప్పుడోకదా!

అమ్మ: ఎన్నికలు కానీనే. ఇప్పుడు మన ఏకైక లక్ష్యం ఎన్నికల్లో విజయం.

గణ: అదిగో, వారికే వస్తూవున్నారు. కలుద్దాం పద.

అమ్మ: సరే! పద. (ముందుకు నడుస్తారు)

(మంజులాంజలులు ఎదురౌతారు)

గణ: మంజులాంజలులకు స్వాగతం.

అంజ: అమృత గణపతులకు సుస్వాగతం.

మంజు: విశేషాలేమైనా వున్నాయా?

అమృ: అంతా మామూళ్ళే.

(ఉభయులు సూటిగా ఒండొరుల కండ్లలోకి చూసుకుంటారు)

అంజ: ఇక పోయివస్తాం.

గణ: క్షేమాన పోయి లాభాన రండి. (ప్రేమతో చూస్తాడు. అంజలి చిరునవ్వుతో కన్నులు వాలుస్తుంది)

(మంజులాంజలు లొప్రక్కనుండి, అమృత గణపతులు రెండోప్రక్కనుండి వెనుతిరిగి- ఒండొరులను చూస్తూ నిష్క్రమిస్తారు)

(తెర పడుతుంది)

## ద్వి తీ యాం క ం

## ప్రథమ రంగం

ప్రదేశం: పాపారావు రహస్యాలోచనా మందిరం

ప్రవేశం: భుజంగరావు- సాలోచనుడై

భు: (స్వగతము) నేను సార్థకనామధేయుణ్ణి అని నన్నెరిగినవాళ్ళంతా శ్లాఘిస్తారు. అవును; అది అక్షరాలా సత్యం. నా గుణాలన్ని ముందే యెరిగి యుండియే కాబోలు- నాకీ నామకరణం చేయబడింది. నా నడకంతా భుజంగం నడకలాగే కుటిలం. నన్ను చుట్టుకొని సేవించే బలగాన్ని చూస్తే అచ్చం సర్పం చుట్టచుట్టుకొని, పడగ విప్పుకొని ఆడినట్లే వుంటుంది. నా నోట ధ్వని వచ్చీరాకముందే ఉరగం బుసకొడుతున్నదని ప్రజలు భయపడి పారిపో

తుంటారు. భుజంగరావుతో పగ అంటే, పాముతో పగే అని వణికిపోతుంటారు. నా తలలో ఫణికివలెనే విషం నిండి ఉంటుంది. కాటు తిన్నవాడు పడిపోవలసిందే! కాని, పాపారావు ప్రతాపపు మంచు ముందు ఈ భుజంగం చేష్టలుడిగిపోతుంది. అయినా నా కుటిల నీతిని ప్రయోగిస్తూనే వున్నాను. వల వన్నాను గాని, పాపారాయ సింహం పడటం లేదు- గాలం వేశాను గాని, మంజుల చేవపిల్ల చిక్కడంలేదు- బాణం సంధించాను కాని అమృతరావు జింక అందడం లేదు.

(ప్రవేశము- లోపలినుండి పాపారావు)

పా: (వెనుకనుండి జబ్బపై చరిచి) ఏరా భుజంగరాయా! ఏమిత్రూ ఆ దీర్ఘాలోచన?

భు: (తత్తరపాటుతో వెనుకకుచూచి) లేదు ప్రభూ! లేదు. (అదరిపడతాడు)

పా: ఏం లేదు? నీ మొగం- నీ ఏమరుపాటే చెప్తుంటే! ఎవరిని కాటేయాలని చూస్తున్నావు? ఎవరి ఇల్లు గుల్ల చేయాలని యోచిస్తున్నావు? ఎవరి సొత్తు కొల్లగొట్టాలని ప్లాను వేస్తున్నావు? ఏం? అంతేనా? హిహిహిహి (నవ్వును)

భు: నాకెవరున్నారు దొరా! మీరు తప్ప. మీ-

పా: (మధ్యలో అందుకొని) ఓరీ! విశ్వాసఘాతుకుడా! నన్నాశ్రయించి, నా దయవల్ల బ్రతుకుతూ, తిన్న

యింటి వాసాలు లెక్కబెట్టినట్లు— నన్నే కాటేస్తావా? నా యిల్లే గుల్ల చేస్తావా? నా సొత్తే కొల్లగొడ్తావా? ఎంత సాహసం! ఇన్నాళ్లు నిన్ను మేపడం పాముకు పాలుపోయడమే అయిందిరా కృతఘ్నా! నిన్నేంచేసినా పాపంలేదు. ఛీ! (అసహ్యించుకొంటాడు)

భు: సత్యం ప్రభూ! ముమ్మాటికీ సత్యం.

పా: సత్యమని నీ ద్రోహం నీవే ఒప్పుకుంటున్నావు. పాపా రాత్రికి తలపెట్టిన ద్రోహానికి శిక్ష యేమో తెలుసా? పాపాత్ముడా! ఇదుగో! (పిస్తోలు తీసి గురిపెడతాడు)

భు: (గడగడ వణుకుతూ— రెండు పాదాలు పట్టుకొని) పూర్తిగా విని, ద్రోహిననిపిస్తే కాల్చి చంపండి దొరా! స్వామి సేవలోనే ఆత్మార్పణం చేశానన్న తృప్తియైన దక్కుతుంది.

పా: (సంభాళించుకొని) ఏది సత్యం?

భు: నే ననే మాట దొరా!

పా: అదెలా?

భు: పూర్తిగా విను దొరా!

పా: అయితే తొందరగా చెప్పు.

భు: ఈభుజంగం మీకొరకు ఎవరినైనా కాటువేస్తాడు, ఎవరియింటైనా గుల్ల చేస్తాడు, ఎవరిసొత్తైనా కొల్ల గొడతాడు, చివరికి తన ప్రాణాలుసైతం సమర్పించుకోటానికి సిద్ధపడతాడు.

పా: ఓహో! అదా? ఆ మాట స్పష్టంగా ఏడవకూడదూ?

భు: ప్రభువులు అర్జంటుగా పిలిపించారటగా!

పా: ఏదీ మొన్న చెప్పిన పని ఎంతవరకు వచ్చింది?

భు: మీరు కోరడం, నేను ప్రయత్నించడం, ఇంక ఆ పని నెరవేరకుండా ఉండడం అలాగూ ఉంటుందా దొరా?

పా: ఆనందమానందం. ఈ ఆనంద సమయంలో నీకేం బహుమానం ఇయ్యాలో తోచకుండా ఉంది.

భు: ప్రభువులకు ఆగ్రహం వస్తే ప్రాణాలు తీస్తారు; అనుగ్రహం వస్తే బహుమానాలిస్తారు.

పా: సరె కాని, ఆ శుభవార్తేదో సవిస్తరంగా చెప్పు. (ఉబ్బి తబ్బిబౌతాడు)

భు: రెండే రెండు షరతులో పెట్టింది ప్రభూ!

పా: షరతులా? (దిగజారిపోతాడు) ఏమిటో అవి?

భు: ఒకటి, వివాహమాడడం—

పా: ఇది అసంభవం— అసంభవం— (ఎగిరిపడతాడు).

భు: తొందరపడకండి దొరా! పూర్తిగా వినండి. అన్నిటికి విరుగుడు మందు ఆలోచించే పెట్టాను.

పా: (చికాకుగా) రెండవది?

భు: ఎన్నికలయ్యేవరకు తాళాలి.

పా: (అసహనంతో) అబ్బా! తాళలేను— తాళలేను. "ఆలస్యాదమృతం విషం"

భు: ధాంట్లోనూ ఆనందానికి తావుంది దొరా!

పా: భుజంగం! నీ పేరు పొట్టి దండగ- నువ్వు అసమర్థుడివి- కేవలం దద్దమ్మవి- ఎందుకూ పనికిరానివాడివి.

భు: కాదు దొరా! కాదు. పూర్తిగా వినండి.

పా: ఇంకేముంది వినటానికి? నీ తద్దినం- నా పిండాకూడు. (నిరుత్సాహపడతాడు)

భు: నిరుత్సాహపడొద్దు దొరా! నా మాట పూర్తిగా వినండి; ఈ ఆరుమాసాలు కోర్టింగు కాలం.

పా: అంటే?

భు: అంటే! ఇద్దరూ ఒకచోట ఉంటారు, ఒకచోట తింటారు కూడా.

పా: భేష్! భేష్! చాలా బాగుంది.

భు: ఇట్లు సరససల్లాపాలతో కాలం గడుపుతూ, ఒకరినొకరు ప్రేమించుకొంటూ, ప్రేమయొక్క యథార్థ స్వరూపం తెలిసికొంటారు; కాని రెండు మేను లొకటిగామాత్రం కావు- పెండ్లి అయ్యేవరకు.

పా: చంపావురా భుజంగం! (హతాశుడౌతాడు)

భు: మీరు సరే, అంటే సరే. అంతా రెడీ.

పా: సరే! అదలా వుంచు. అసలు రంగంలోకి రా. ప్రతిపక్షుల కార్యకలాపాలెట్లున్నాయి?

భు: ప్రతిపక్షులలోనుండి ప్రతి తీసివేశానంటే నమ్మండి.

ఇక రెండు పక్షాలూ నరికివేశానంటే సరి- ఆ పక్షి తటాలున నేలకూలవలసిందే! ఒక పక్షం దానికి- రాజ గౌడూ ఆనందరెడ్డి- రెండవ పక్షం- మన- (ఆగుతాడు)

పా: ఆగుతావేమిట్రా! కానీ.

భు: మన చిన దొరసాని మంజులారాణి (దొర మొగము చూస్తాడు)

పా: నా మొగం చూస్తావేమిరా! వెర్రి మొగమా! చెప్పరా?

భు: ఆమె ప్రియ సఖి అంజలీ భామగారు. ఈ రెండవ పక్షం లో రెండవ భాగాన్ని నేనే త్రెంచగలను. తొంభై పాళ్లు ఇదివరకే త్రెంచాను; తొమ్మిది పాళ్ళు త్రెంపుతూవు న్నాను; ఇగ మిగిలింది ఒకే ఒక పాలు. అది అనతి కాలంలోనే తెగిత్రీరుతుంది. మిగిలిన సగం నా ప్రయ త్నానికి అందుబాటులో లేదనిపిస్తోంది. మీకే శ్రమ కల్పించవలసి వస్తుందేమో అని భయం కల్గుతూ వుంది. ఇక తమరి సెలవు-

పా: నాకుగూడా రెండే రెండు కొరకరాని కొయ్యలు దాప రించాయి. బయటిది ఆగబట్టరానిది, ఇంట్లోది అరికట్ట రానిది.

భు: మీరు ఊఁ అంటే దొరా! రెంటిని హతమార్చుటకు ఒకే శస్త్రం ఉంది. ఒక దెబ్బతో రెండు పిట్టలు రపేలు మనాల్సిందే. (రహస్యంగా) దొరా! మీరు విన్నారో లేదో-

పో: ఏంటిరా అది?

భు: ఊరంతా కోడై కూస్తున్నది- (ఆగును)

పో: సంశయమేలరా? చెప్పెయ్.

భు :మన చిన్న దొరసాన్ని ఆ సన్యాసి రాయడు ఎప్పుడో ఉడాయించుకోపోనున్నాడట. ఊళ్ళోవాండ్లే- ఊరిబయటవాండ్లే- ఎక్కడ చూచినా వాండ్లే జంటగా తిరుగుతున్నారట.

పో: అవును, అవును. అది ఇల్లు పట్టడమే లేదు. సభలకని, సమావేశాలకని, సాంఘిక సేవలకని, సమాజ వికాస కార్యకలాపాలకని- నాకు చెప్పి, చెప్పక- ఒకటే తిరుగుడు. ఏమే అంటే, చదువుకున్న వాళ్ళు ఈగలుజోపుతూ ఊరకే కూచుంటారా ఇంట్లో? అని దీర్ఘాలు తీస్తుంది. గట్టిగా మందలిస్తామంటే దాని తల్లి చిరునవ్వుమోము కనబడుతుంది ఆ చిన్నారి మొగంలో. అన్ని విషయాల్లో నేను పులినే కాని, ఈ ఒక్క సందర్భంలో పిల్లినై యుండవలసి వస్తూవున్నది. ఈ దౌర్బల్యం ఎక్కడినుంచి వచ్చిందో నా కర్థమవడం లేదు. మీదు మిక్కిలి ఆశ్చర్యంగా వుంది. ఉండుగాక! నీవేదో వుపాయమంటివి- అదేదో? చెప్పు చూతాము.

భు: నా తలిదండ్రులను నే నెరుగను; నాకు బుద్ధి వచ్చినప్పటినుండీ మిమ్ములనే తలిదండ్రులని భావిస్తూవున్నాను.

మీరే నా గురువులు, మీరే నా యజమానులు, ఏలాటి ప్రతిఫలమాశించకుండా మిమ్ము సేవించుటకే దేవుడు నాకు జన్మమిచ్చాడనుకుంటూ వున్నాను. ఏనాటికైనా మీరే నన్నో ఇంటివాణ్ణి చేస్తారని గట్టిగా నమ్ముకొన్నాను.

పా: నేనూ అదే అనుకొంటున్నానోయి. ఈ పనుల హడావిడిలో తీరికే ఉండటం లేదాయె. మరచిపోతుంటాను. నీవైనా జ్ఞాపకం చెయ్యగూడదూ— సరే! పిల్లను ఎన్నుకో, ఈ ఎన్నికలు కాగానే ఆ మూడుముళ్ళూ వేయిస్తాను.

భు: మహాభాగ్యం! మహాభాగ్యం! ఆ శుభకార్యం కాస్త మీ చేతులమీదనే జరగాలని నా కోరిక.

పా: ఔను; నేనే నడిపిస్తానన్నానుగా. ముందు ఐతే పిల్ల నేరుకో.

భు: కన్యాదానం మీరే చేయాల్సివుంటుంది.

పా: పిల్లకు తండ్రి లేడా ఏం? పాపం!

భు: మీరే ఆ పిల్లకు తండ్రి, మామగారూ!

పా: ఆఁ! నా బిడ్డ నిమ్మంటావా? ఎంత సాహసం! ఎంత ధైర్యం! బంతిని తిని బందిపోటుతనమా? చన్నె కుడిచి రొమ్మే గుద్దుతావా? నీ అంతస్థు ఎంత? నా అంతస్థు ఎంత? తారతమ్యం లేకుండా మాట్లాడుతావా? నక్క

యెక్కడ? నాకలోకమెక్కడ? ఇన్నాళ్ళు నీవు చేసిన సేవ చూస్తూ క్షమిస్తున్నాను. లేకపోతే నీ తల్లిదండ్రుల జాడ వెతుకుతూ ఈపాటికి దక్షిణమార్గం పట్టిపోయే వాడివి_ జాగ్రత్త!

భు: (భయంతో వడుకుతూ వుంటాడు)

పా: (తనలో) ఈ నీచునితో మనకు చాలా పని వుంది. వైరం పెట్టుకుంటే కార్యహాని ఔతుంది. వీనిని నమ్మించి కార్యం సాధించవలసి వుంది. (వీపుతట్టి ప్రకాశంగా) ఆరీ పిరికి సన్నాసీ! నిన్ను పరీక్షించాలని ఊరకే అట్లా అన్నాను గాని, నీలాంటి అల్లుడు దొరుకుతాడట్రా! నేను చూస్తున్నా నీ గుణగణాలను. నేనే అందామనుకు న్నాను; తీరా ఆ మాట నీ నోటే వచ్చింది. నీవు నాకు కాబోయే అల్లుడివి. అయితే ఒక మాట_ కయ్యానికి, నెయ్యానికి, వియ్యానికి సమత కావాలంటారు పెద్దలు. నీవేలాగు మాకు సమానమౌతావో చెప్పు చూతాము.

భు: (సిగ్గుతో) అందమున నేను మీ కూతురికి సరీగా మ్యాచౌతాను. కులానికా, మీరు నాకు వేలు విడిచిన మేనమామగారేకదా! విద్యకంటారా, నేనుకూడా గ్రాడ్యు వేషన్ పూర్తిచేశాను. ఇక గుణగణాలా_ మీ రెరుగనివి కావు. శ్రీమంతమా_ మీ ఏకైక కుమార్తెను చేట్టు పట్టాక నేనుకూడా ధనవంతుణ్ణే.

పా: ఒప్పుకున్నాను; ఒప్పుకున్నాను. దీనితో నీ తెలివికూడా అఖండమైనదని తేలిపోయింది. నేటినుండి నీవు మా యింట్లో వుండొచ్చు; మా అంతఃపురములోనూ తిరగొచ్చు. పెండ్లిమాత్రం ఎన్నికల తరువాయి జరుగుతుంది. నీవన్నట్లు, ఈలోగా కోర్టింగు— అదే ప్రేమించుట నేర్చుకోవాలి- ప్రేమించుట నేర్పాలి అమ్మాయికి. నేను భుజంగరాయుణ్ణే పెండ్లాడ్తా డాడీ! అని అనాలి అమ్మాయి. సరేనా!

భు: మహాప్రసాదం. మీ దయకు అన్నివిధాలా పాత్రుడననిపించుకుంటాను.

పా: మరోమాట, నీ కాబోయే మామను ఎలా గెలిపిస్తావో? నీ కుటిల నీతిని, వక్ర పరాక్రమాన్ని పరీక్షించాలి.

భు: ధన్యోస్మి! ధన్యోస్మి! నేను సర్పంచ్‌గారి అల్లుణ్ణి అయినాననుకోండి. ఈ భుజంగరావు చెప్పడు, చేసి చూపుతాడు. మీ కటాక్షవీక్షణాలే నాకు బలం. (కాళ్ళు అంటబోతాడు)

పా: తప్పు తప్పు. కాళ్లు కడుగబోయే మామగారి కాళ్ళు కాబోయే అల్లుడుగారు అంటవచ్చునా?

భు: చిత్తం మామగారూ!

పా: అదీ తప్పే. కాబోయే మామగారూ! అనూ.

భు: చిత్తం చిత్తం మామ_ కాబోయే మామగారూ!

పా: నాకు బడలిగ్గా ఉంది; ఇక వెడతాను.

(నిష్క్రమిస్తారు)

భు: (స్వగతము) అక్కడ అమృతరాయుణ్ణి పడగొట్టటానికి వాని రెండు భుజాలైన రాజగౌడును, ఆనందరెడ్డిని లంచాలిచ్చి వేరుచేశాను. ఇక్కడ గ్రామసేవిక రంజని ద్వారా పాపారావును తప్పతాగించి, నమ్మించి, దద్దమ్మను, బొమ్మనుచేసి ఇంట్లోనే పడియుండే ఏర్పాట్లు గావిస్తాను. సర్వ సమర్థుడైన వజ్రాలుద్వారా ఓటర్లకు డబ్బులు పంచి, సారా త్రాగించి మనవైపు త్రిప్పుకుంటాను. నామినేషన్ పత్రాలను నా పేరనే దాఖలు చేయించాను. పాపారావు చెట్టు దులిపితే ఇప్పుడు పైసలు కురిసినట్లే, రేపు డబ్బా వంచుతే నా పేరనే ఓట్లు వర్షించాలి. ఎన్నికల ప్రచారం ఇరువైపులా మనదే. రేపు గెలుపుకూడా మనదే. సర్‌పంచ్‌గిరిని, మంజుల సిరిని చేపట్టడమూ మనమే. పురుష ప్రయత్నమంటే ఇది. రూపాయి, అమ్మాయి, సారాయివల్ల కాని పన్లు ఏమున్నాయి? జగాన. సేబాస్ భుజంగరాయా! సార్థక నామధేయా! సేబాస్! (వీపు చరుచుకుంటాడు)

(తెరపడుతుంది)

## ద్వితీయ రంగం

ప్రదేశం: ఊరిబయట మఱ్ఱిచెట్టుక్రింద రచ్చబండ-

ప్రవేశం: ధర్మయ్య జానయ్యలు రచ్చబండమీద కూర్చొని

ధర్మ: ఎన్నికలొస్తున్నాయి జానయ్య బావా!

జాన: జాగ్రత్త! ధర్మయ్య బావా!

ధర్మ: నిజంగానే మనం జాగ్రత్తగా వుండాలి బావా!

జాన: అవును; ఆ అమృతరావు పుణ్యాన మనకు ఎన్నిక అంటే ఏంటో అర్థమవుతూ వుంది.

ధర్మ: అంతేనా మరి. లోగా రెండుసార్లు ఎన్నికలొస్తున్నాయి అన్నారు. పాపారావు సర్పంచ్ అయిపోయాడు అన్నారు. ఎన్నికలు జరిగిందిలేదూ- మనం ఓట్లు వేసింది లేదు.

జాన: అది అంతే. పోటీ ఉంటేనే ఎన్నికలు, డబ్బాలు, ఓట్లు, గెలుపు ఇత్యాదులు. ఒక్కడే నిలబడితే ఇగ పోటీ ఎక్కడ? వాడే గెలిసినట్టు లెక్క.

ధర్మ: మనం ఓట్లువేసి గెలిపించకుండానే!

జాన: మన అందరి వోట్లు ఆ ఒక్కనిదిక్కే పడ్డట్టు లెక్క.

ధర్మ: అయితే ఈనాటికి పాపారావ్ దొరకి ఓ పోటీ నిలిసిందన్నమాట.

(ప్రవేశం శేషాచార్యులు పొడుం పీలుస్తూ)

శేషా: నిల్చిందన్నమాటే కాదు, ధర్మయ్య పటేలా! గెల్చిం

దన్న మాట- (మెల్లిగా అంటూ, భయంతో అటూ ఇటూ చూస్తాడు)

ధర్మయ్య జానయ్యలు: (లేచి నిలబడి) దండాలు అచార్ల వార్లకు దండాలు! (వంగి మొక్కుతారు)

శేషా: దీర్ఘాయురస్తు! అష్టపుత్ర బహుధనమస్తు! మనోవాంఛాఫలసిద్ధిరస్తు! (దీవిస్తాడు)

ధర్మ: ఆ సంతానం మాత్రం వద్దు బాబూ! వద్దు. ఈవరకే ఏడుగురు పిల్లలతో చస్తూ వున్నాను; ఇక చాలు.

జాన: దాంతో నాకూ పని లేదు సామీ! ఒక పాపనిచ్చే, మా ఆవిడ స్వర్గం చేరుకుంది. (కంట తడిబెడ్తాడు)

శేషా: మీరు భయపడవాకండి. ఇది ఆశీర్వచన పద్ధతి మాత్రమే. చివరిది చూశారూ- "మనోవాంఛాఫలసిద్ధిరస్తు" అన్నది- అది మీకు శ్రీరామ రక్ష. కోరితేనే కల్గుతుంది.

ధర్మ: మరి అయ్యవార్లూ! (ఇటు అటు చూచి మెల్లిగా) మన అమృతరావు గెలుస్తాడంటూరా?

జాన: ఆ పాపుడు పాపారావు గెలువనిస్తాడా?

శేషా: వాడెవడయ్యా గెలువనిచ్చేది పంతులూ! గెలుపూ, ఓటమీ యిచ్చేది మన గ్రహచారమయ్యా గ్రహచారం తెలిసిందా? నే నిదివరకే చూచిపెట్టాను.

ధర్మ: అంతా ఆ దేవుడి దయ అయ్యవార్లూ!

జాన: సత్యం- సత్యం. ఆచార్ల వార్లూ! వాని ఇష్టంలేంది గడ్డిపోచకూడా కదలడానికి వీల్లేదు.

శేషా: అమృతరావు మన ఊరికి దేవుడిచ్చిన వరం సుమా!

ధర్మ: కాకుంటే మరి, ఆయనొచ్చిన ఏడాదిలోనే మన గ్రామం ఎక్కడినుంచి ఎక్కడికి పెరిగింది మాశారా?

శేషా: ఇంతేకాదు, మన వూరికి గొప్ప అదృష్టం పట్టను న్నది ముందు. గ్రామం అలా పట్టణంగా మారే యోగం కనబడుతూ వుంది- అంటే నమ్మండి.

జాన: ఔనా? ఆచార్ల వార్లూ! అందుకే అన్నారు 'బ్రాహ్మణ వాక్యం బ్రహ్మవాక్యం' అని.

ధర్మ: అందుకోసమే మా దానాయి ఫస్టు కిలాసులో ప్యాసు అవుతాడంటే- అది అచ్చరాలా నిజం ఐంది.

జాన: మా అమ్మాయి ఈ యేడు కోరిన వరుని రెట్టు పడు తుందన్నారుగా- చూడాలి మరి.

శేషా: అదేకాదోయ్ పంతులూ! ఇప్పటి మన సర్‌పంచ్ కూతురుకూడా వలచిన వరుని పెండ్లాటం ఖాయం అనుకో.

ధర్మ: అయితే ఎవరోకదా! ఆ నోచుకున్నాడు.

శేషా: వేచి చూడాలి పటేలా!

ధర్మ: పసులు వచ్చే వేళైంది- పోయివస్తా జానయ్య బావా! — అయ్యవార్లా!

జాన: మంచిది రా బావా!

శేషా: క్షేమానపోయి లాభాన రావోయి పకేలా!

(ధర్మయ్య నిష్క్రమిస్తాడు)

జాన: అయ్యా! ఆచార్ల వార్లూ! మా పిల్ల కీయేడు పెండ్లి తప్పదని చెబితిరి. అది బాగానే ఉంది. నేనూ అనుకుంటూనే వున్నాను, సంబంధంకూడా ఇంట్లోనే వుంది; కాని, అదిమాత్రం ససేమిరా అంటూవుంది. ఇన్నాళ్లూ చదువూ చదువు అని అడ్డంకి చెప్పింది. ఇప్పుడో ఎన్ని కలు కాంది ఆ మాట ఎత్తవద్దు అంటూంది. అక్క కొడుక్కే ముడివేతామనుకుంటున్నాను. చొప్పను చొప్పతో కట్టినట్లుంటుంది. ఈ సంబంధం కుదిరీనా? తవరే చెప్పాలి. (చేతులు జోడిస్తాడు)

శేషా: నువ్వనుకున్న సంబంధం కుదురదు. దానికి వర్ణాంతర వివాహ యోగం ఉంది; అంటే_ అగ్రజాతివాని కేలు గ్రహిస్తుందన్నమాట.

జాన: బాబూ! ఇదేంమాట? ఎట్లా పొసగుతుంది ఈ పెండ్లి? నమ్మలేకుండా వున్నాను.

శేషా: జరిగితీరుతుంది. ఇది మన చేతుల్లో పని కాదుగదా! పంతులూ! గ్రహచారం అట్లా సూచిస్తూ వుంది.

జాన: అంతా అయోమయంగా ఉంది ఆచార్ల వార్లూ! దేముడేం శేయనున్నాడో కదా!

శేషా: దేవుడు చేసేదంతా మన మంచికోసమే జానయ్య పంతులూ! అది ఇప్పుడు తెలీదు కనుకనే దాన్ని అదృష్టం అంటారు, అంటే దృష్టం కానిది అనగా, కనబడందన్నమాట.

జాన: ఐతే, ఆచార్య వార్లూ! ఆ అదృష్టజాతకు డెవడో కాస్త చెప్పుదురూ దయచేసి.

శేషా: అది ఇప్పుడు వీలుకాదు; వేచి చూడాలి అంతే!

(ఇద్దరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: పాపారావు ఇంట్లో అలంకరణ గది–

ప్రవేశం: మంజుల– అద్దంలో తన ప్రతిబింబం చూస్తూ, తనలో తానే మురుస్తూ–

మంజు: (ప్రతిబింబంతో) ఔరా! ఏమి నీ సౌందర్యం– సౌకుమార్యం, సింగారం– వయ్యారం, తళుకు– బెళుకు, నీ తనువును మనువున గొని, నిన్ను గ్రుచ్చి కౌగిట నిమిడ్చుకొని– ముద్దులవర్షం కురిపిస్తూ, నీ యధరామృత తృష్టిని చాతకంలా పానంజేస్తూ, నీ ప్రేమవాహినిలో రాజహంసలా కొట్టుకపోతూ, నీ నవయౌవన సామ్రాజ్యాన్ని ఏలుకొనుటకు నోచిన మన్మథచక్రవర్తి యెవడో? చెప్పగలవా? ఆఁ! వద్దు వద్దు. అప్పుడే మోమున సిగ్గు మొలకెత్తుతున్నది. చెక్కిళ్లు కెంపులైనవి.

నన్నే చెప్పమంటావా? సరే, ఇదిగో చెప్పుతున్నాను విను_ ఆ నవమన్మథ మన్మథుడు_ వినూత్న యౌవనుడు, అర్జున విక్రముడు_ భీమపరాక్రముడు, నగధీరుడు_ సముద్రగంభీరుడు, విద్యాప్రవీణుడు_ పరోపకార పారీణుడు, వారిజాలనేత్రుడు_ సజ్జన సంస్తుతిపాత్రుడు, కరుణాధాముడు_ సర్వత్ర విజయుడు, దుర్జన గర్వాపహారి_ అన్నదే కాదు కాదు; యుష్మన్మనోవిహారి, గురుజన విధేయుడు_ సార్థక నామధేయుడు, వాగమృతుడు_ నీ యమృతుడు, నీ నోములపంట_ నీకు దగిన జంట, తెలిసిందా? (తన్మయతలో) నీకు దక్కునా? నీ సొత్తు_ యేమగునో నీ భవిష్యత్తు? (నిట్టూర్పు విగిడిస్తూ. సంబాళించుకొని) ప్రస్తుత కర్తవ్యం మరవకూడదు. ఎన్నికలొస్తున్నాయి.

భు: జాగ్రత్త! (అంటూ ప్రవేశిస్తాడు)

మంజు: (అదరిపడి, వెనుతిరిగి చూచి) ఆ! నీవా! కాంతల యేకాంతమునకా_ జొరబడుటయా, అనుమతి లేక_ మతి అంతకన్నను లేక! (కోపముతో, ఏవగింపుగా) ముందు వెళ్ళు ఇక్కణ్ణుంచి. (గద్దిస్తుంది)

భు: (చిరునవ్వు లొలికిస్తూ, లీలాకమలాన్ని అలా అలా కదిలిస్తూ, మంజుల ముఖకమలాన్ని అదో అలవోకగా తిలకిస్తూ) మతి వున్నది, అనుమతికూడా వున్నది. ఇక

కాంతల ఏకాంతవాసానికా_ నీ కాంతునిగ, తప్పు తప్పు, నీ కాబోయే కాంతునిగ వచ్చా నో కాంతా! శశివదన కాంతా!

మంజు: (తోకత్రొక్కిన భుజంగివలె బుస్సుమని భుజంగుని కాల్చి వేస్తానన్నట్టు చురచుర చూస్తూ) ఉన్నావా! ఏం ప్రేల్తున్నావ్? ఎంత దుస్సాహసం! ఎవరిచ్చారు నీ కీ యధికారం? నీ పాడు మొగాన్ని నేను చూడలేను. (కొంగుతో ముఖం దాచుకుంటుంది)

భు: (గర్వముతో ఈల వేస్తూ) సాధికారంగానే నీ మందిరం పొందితినే యిందువదనా ! కుందరదనా ! నా హృదయారవిందసదనా! (పైకి చూస్తూ) తొందరపడకురా మదనా! నీ కిదే యదనా?

మంజు: (సాధికారంగా- ఒత్తి పలుకుతూ) ఎవరిచ్చిందీ యధికారం? కుటిలుడా!

భు: (పరిహాసంగా) ఎవరిచ్చిందా ? ఇంకెవరిదీ కాదు; నీకూ, నాకూ, ఈ భవనంకూ, ఈ ఆస్తికే కాదు, ఈ గ్రామానికే యెవరు అధికారులో వారి అధికారంతోనే వచ్చానే బాలా! అర్ధేందునిభఫాలా! నిష్కారణకుపిత వ్యాళా! భుజంగకర గళమాలా!

మంజు: ఆఁ! నా తండ్రియాజ్ఞా! అంతా అబద్ధం, కుతంత్రం, పచ్చి మోసం; నమ్మను- ఎన్నటికి నమ్మను.

భు: నీ విప్పుడు నమ్మకుంటే రేపైనా నమ్మగలవే కొమ్మా! ముద్దులగుమ్మా! అపరంజిబొమ్మా! నా మంజులమ్మా!

మంజు: (పెడ మొగము పెట్టి జుగుప్సతో) ఈ కల్లబొల్లి మాటలు కట్టిపెట్టి తత్‌క్షణమే ఇక్కణ్ణుంచి వెళ్ళు. నీ కేమీ పనిలేదా? నీ పని పెట్టిస్తా వుండు.

భు: పని పెట్టుకునే వచ్చానే బంగరుచిలకా! ఎందుకే యింత యలుక? పలుకవే తేనియలొలుక, నా ముత్యాల గొలక!

మంజు: ఆ పనేమిటో తొందరగా చెప్పేయ్, నాకు పనుంది.

భు: చెప్పనా? చెప్పనా? (సిగ్గుపడుతూ) ఇదిగో_ ఇదిగో_ మన_ మన_ పెండ్లట.

మంజు: (అత్యాగ్రహావేశాన ఎగిరిపడి) పెండ్లా? నీకా? నాతోనా? నీముడా! నీ నాలుక వేయి చీలికలుగానూ!

భు: (స్థిమితంగా) ఔను, మంజులా! మంజులా భుజంగ రావులకు పెండ్లి. భయపడవాకు_ ఇప్పుడు కాదు, ఆరు మాసాల అనంతరం_ అనగా ఎన్నికల తరువాత; అంటే పాపారావుగారు మూడవ తడవ సర్‌పంచ్ గద్దె ఎక్కిన శుభ సందర్భాన. అర్థమైందా? మందయానా! నెరజాణా! (ఆమెవైపు అలవోకగా చూస్తాడు)

మంజు: (కొంచం విచారించి_ తనలో) బతికించితివిరా దేముడా! (ప్రకాశంగా) మంచిది_ ఇక వెళ్ళొచ్చు.

భు: పని కాందే!

మంజు: ఇంకేం పని? నీ కాదు, నా కాష్టం.

భు: కాడూ కాష్టం అంటావేం అవలక్షణంగా— కల్యాణం అనూ లక్షణంగా.

మంజు: అదేదో? తొందరగా ఏడ్చి చావు.

భు: శివశివ! (చెవులు మూసుకొని) అమంగళం ప్రతిహత మగుగాక! (మంజులతో) నీ కిదేం వెర్రో కాని, 'శుభం కోర్రా పెండ్లి కొడుకా!' అంటే— 'ఈ పెండ్లి కి వచ్చిన వాళ్ళంతా నా తద్దినం పెట్టండి పోర' న్నట్టుంది నీ ధోరణి. నాకో పని వప్పజెప్పారు మీ నాన్నగారు. అదేమంటే— నేను నిన్ను ప్రేమించడం నేర్చుకోవాలిట— నన్ను ప్రేమించడం నీకు నేర్పాలిట. మొదటిది ఐంది; చూశావుగా ఇందాక జరిపిన ప్రదర్శనం? ఇగ రెండవది మిగిలింది. అలినీలవేణీ! కిసలయపాణీ! మంజువాణీ! మంజులరాణీ!

మంజు: (అసహ్యంతో) నీ ప్రేమ మండా! నీకు నూరేండ్లు నిండా! ఇక నా ముందుండవాకురా వోరి గుండా!

పా: (నవ్వుతూ ప్రవేశించి— తనలో) సరసాలు విరసాలు కాకుండానే సర్దివేయాలి. (ప్రకాశంగా) తొందరపడ కోయీ భుజంగరాయా! వినయ విధేయా! (మంజుల నుద్దేశించి) తాళ్మి వహింపవే బంగారుతల్లి! మెరపులవల్లి!

భు: నేనేమి తొందరపట్టంలేదు దొరా! మీ యాజ్ఞకు బద్ధుడను- మీ పాదమాన, అక్షరాల పాలిస్తూ వున్నాను మీ యాన.

మంజు: నాన్నా! (తండ్రిని చుట్టుకొని యేడుస్తుంది)

పా: (బిడ్డను దగ్గరకు తీసుకొని, కన్నీరు తుడుస్తూ) అయ్యో పిచ్చితల్లీ! ఎందుకే నీకింత దుఃఖం? పాపారావు తన చిన్నారి చిట్టి కంటనీరు చూచి సహించగలడా!

మంజు: అమ్మా! అమ్మా! నన్నుగూడా నీ వెంట గొనిపోవే. నే నీ పాడులోకాన మనజాల! (ఏడుస్తూ తల్లి ఫోటోకు దండం పెడుతుంది)

పా: (దీనవదనుడై) అయ్యో! అయ్యో! ఇవేటి మాటలే! నా కండ్ల వెలుగా! అమ్మను చూచియే యెరుగవు. అమ్మ లేని లోటు రానీకుండా అమ్మను అయ్యను నేనేఐనా అరో[ప్రాణంవలె పెంచుకొంటికదే నిన్ను. నీకు అరికాలికి ముల్లు[గుచ్చితే నాలుకతో తీసివేస్తిగదే! ఇప్పుడు నీకు వచ్చిన కష్టం ఏంటే? అమ్మ యాదికొచ్చింది. (భుజంగరావువైపు చూస్తూ) నిన్ని దుర్మార్గు డేమన్నా అనరాని మాటలన్నాడా? అవమానించటాని కేమన్నా పూనుకున్నాడా? నీ ముందే వీణ్ణి పిట్టను కాల్చినట్టు కాల్చివేస్తాను చూడు. (పిస్తోలు తీస్తాడు)

భు: (దిక్కుతోచక బిక్కమొగంతో గడగడలాడుతూ, మంజు

లవైపు ప్రాధేయపూర్వకంగా దండాలిడుతూ, చూపుల ద్వారా క్షమాభిక్షను వేడుతున్నట్లు దీనంగా చూస్తూ) క్రీదాసుడు ఏ పాపం ఎ—

పా: నోరుమూయ్. ఎవరు నిన్ను మాట్లాడమన్నది? మధ్యన. (గర్జిస్తాడు)

మంజు: కాల్చి చంపేసేంతటి నేరం ఏమీ చెయ్యలేదు డాడీ! మొదట యీ నీచుణ్ణి యిక్కణ్ణుంచి తరిమెయ్యండి.

భు: (వణుకుతు, తనలో) అమ్మయ్య బ్రతికాను. (ప్రకాశంగా) ఎందుకు? నేనే పోతాను. (పోబోవును)

పా: ఆగు. (పిస్తోలు గురిపెట్టి) కదలడానికి వీల్లేదు. (బిడ్డ వైపు మొగమై) చెప్పు చిట్టీ! ఏమన్నాడు ఈ ఉన్మాదుడు?

భు: (భయపడుతూ తనలో) ఈ ముప్పు తప్పించరా దేముడా! (మంజులను కన్నులతోనే వేడుకుంటాడు)

మంజు: ఈ తుచ్ఛుడు నన్ను పెండ్లాడుతాడట. ముందు వీనికి పెళ్ళిచేయాలి డాడీ!

భు: గడ్డితిని అన్నా, ఇంక ఆ విషయంలో ఎన్నడూ నోరెత్త, క్షమించు తల్లీ! (చెంపలేసుకుంటాడు, ముక్కు నేలకు రాస్తాడు)

పా: (కోపం నటిస్తూ) మధ్యలో నిన్నెవరు పెదవి విప్పమన్నారు? (ఉరుముతాడు)

భు: (చప్పున నోరు మూసుకొని) చిత్తం చిత్తం.

మంజు: సరసాలు కులుకుతున్నాడు సరసాలు_ వీని ప్రేత మొగం మాడ్లేను; రెంకెయ్య నాన్నా! ఈ పిశాచిని_ (పాపారావు కనుసన్నపై బ్రతుకు జీవుడా అని నిష్క్రమిస్తాడు భుజంగరావు) మీాదు మిక్కిలి మీా యాజ్ఞమేరకే వచ్చానంటాడు. నన్ను పెండ్లాడుతాడట.

పా: అవును; తప్పేమి?

మంజు: ఆఁ నాన్నా! నీవేనా ఈ మాట అంటున్నది? తడిబట్టతో గొంతు కోయకు నాన్నా! ఆ పిస్తోలుతో కాల్చి చంపు, లేదా అది నా కిటివ్వు కాల్చుకుని చస్తాను. అమ్మా! (తండ్రి యొడిలో వాలిపోతుంది)

పా: (తల నిమురుతూ, బుగ్గలు పుణుకుతూ) ఓసే! వెఱ్ఱి నా తల్లీ! నీ నాన్న నీకు ద్రోహం తలపెడతాడంటే నమ్ముతావుటే? నీ మనసు బాధపడితే నీ డాడ్డీ ఓర్వ గలుగుతాడటే?

మంజు: నాన్నా! నా కంతా అయోమయంగా వుంది. ఈ నాటకమేమిటో డాడీ!

పా: అవును; జగమే వొక నాటకం, మనమంతా పాత్రలం, మన జీవితమే వొక అంకం, అందులో ఇది ఒక రంగం.

మంజు: సూటిగా చెప్పు నాన్నా! నాకు అర్థమయ్యేలా. ఈ డొంకతిరుగుళ్ళ మాటలు నాకు సైపవు.

పా: (రహస్యంగా చెవిలో) ఎన్నికలు గెల్చుటకు నిన్నొక పావికగా వుపయోగిస్తున్నాను. నిన్నెత్తానని వొక బూటకపు నాటకమాడుతున్నాను సరేనా?

మంజు: మానాన్నే- మా బంగారు నాన్నే- మా పైడీల అమ్మే- (తండ్రి మెడకు చుట్టుకొంటుంది)

పా: అం! అట్లా నీ తండ్రిని గ్రహించు చిన్నారీ! నీ యిష్టానికి ఏనాడైనా అడ్డువచ్చానా? నీ కోరిక ఏదైనా కాదన్నానా? చెప్పు. (గడువపట్టి కదుపుతూ, ప్రేమవీక్షణములతో ముంచెత్తుతాడు)

మంజు: మా నాన్న మంచివాడు- చాలా మంచివాడు. (ఆప్యాయంగా వక్షం రుద్దుతూ) నా కోరికి ఎప్పుడూ కాదనలేదు- ఇప్పుడూ కాదనడు. ఔనా నాన్నా!

పా: చెప్పవే, నా బుజ్జితల్లీ! ఆ కోరికేదో చప్పున తీర్చేస్తాను.

మంజు: చిన్నదే నాన్నా! చాల చిన్నది.

పా: ఎంత పెద్దదైనా సరే! తీరుస్తాను. నీ తండ్రి చాలా చాలా పెద్దవాడన్న సంగతి మరువవాకు. (మీసాల మీద చేయివేసి బింకంగా చూస్తాడు)

మంజు: మా నాన్నే- మా ముద్దుల నాన్నే (నొసలు ముద్దుపెట్టుకొని, వేళ్ళు రెండు చెంపల కద్ది, మడ్చి కణతల కొత్తుకుంటూ చిటచిటలాడించి, ప్రేమలు కురిపిస్తుంది)

పా: (మురిసిపోతూ) ఊఁ! కోరు ఏం కావాలో.

మంజు: అయితే, కోరనా నాన్నా?

పా: అనుమానమెందుకే నా ప్రాణానికి ప్రాణమా!

మంజు: ఏమీలేదు, నిజంగా అమృతరావు అమృతుడు నాన్నా! అందరి నోటా అదే పాట.

పా: అయితే ఆ మృతునికొరకు_

మంజు: శివశివా! (తన చెవులు మూసుకొని తండ్రి నోరు మూస్తూ) ఆ మాట నువ్వనగూడదు_ నునే వినగూడదు. డాడీ!

పా: (అసహనంగా) ఆ ఆగంతకునికొరకు నన్ను పోటీ మానుకొమ్మంటావు. అదేకదా నీ చిన్ని కోరిక. (చూపుల్లో ద్వేషం ప్రకటిస్తాడు)

మంజు: కాదు నాన్నా! అదికాదు_ ఆ అమృతరావు_ చూచావు_ విద్యావంతుడు, గుణవంతుడు, రసికుడు, సంస్కారి.

పా: (విసుగుతో) ఐతే నన్నేం చెయ్యమంటావు? వాణ్ణి అందలంలో కూచోబెట్టి ఊరేగించుమంటావా? నా నెత్తిన బెట్టుకొని ఊరేగుమంటావా?

మంజు: అంతమాట నే నంటానని నీ కెలా తోచింది నాన్నా? (బుగ్గలు నిమురుతూ) మొన్న కలరా వచ్చినప్పుడు, చూచావూ_ మందులు తెప్పించి, డాక్టర్‌ను పిలిపించి,

టీకాలు వేయించి, రాత్రింబగళ్ళనక రోగులకు సేవచేసి ఎందరి ప్రాణాలో కాపాడాడు.

పా: నువ్వుకూడా ఎంత వద్దన్నా వినక, వాని వెనుకే తిరిగావు గదా!

మంజు: నాదేంలెక్క నాన్నా! మనం వూరినుంచి రెండు మైళ్ళు నడిచి బస్సుకు పోవాలంటే ఎంత తిప్పలయ్యేదో! అతను శ్రమించి, శ్రమదానపూర్వకంగా ఒక కచ్చా నడకైనా వేయించి పుణ్యం గట్టుకున్నాడు. అతణ్ణి తలవనివారే పాపం చేశారు నాన్నా! (నాలిక కరుచుకొంటుంది)

పా: వాణ్ణి నే నొకణ్ణే తల్చుకోవడంలేదనిగదా నీ యభిప్రాయం? (నొసలు చిట్లిస్తాడు) మా అమ్మ అల్లారుముద్దుగా పెట్టుకొన్న పేరులో పాపా - రావులకు మధ్య 'ల' చేర్చు నీ అభిమతం సిద్ధిస్తుంది. (మంజుల బేలుపడి చూస్తుంది) దానికేంగాని, తొందరగా ఆ చిన్న కోరికేదో వెళ్ళగక్కు- తీర్చిపారేస్తాను గబుక్కున, నాకు టిఫినుకు వేళౌతుంది; పోవాలి.

మంజు: (చిరుకోపంతో) నాకు కోరికాలేదు- మీరు తీర్చేదిలేదు. హాయిగా టిఫినుకు వెళ్ళండి.

పా: అదేంటే? ఇంతలో నే ఏమైందని ఇంత కోపం? (లాలనగా చూస్తాడు)

మంజు: (వ్యగ్రతతో) నన్ను విడిచి మీ రొక్కరే టిఫిన్ చేస్తారా? నాన్నా! (దీనంగా చూస్తుంది)

పా: అదెన్నడన్నా జరిగిందా? అదేకాదు, నిన్ను విడిచి నేను బ్రతకగలనా? నీళ్ళు విడిచి చేప జీవిస్తుందా? ఇవ్వాళేదో వింతగా మాట్లాడుతున్నావే!

మంజు: ఇప్పుడే మీరన్నారుకదా! 'నాకు టిఫిన్ వేళైంది' అని. (బుంగమూతి పెడుతుంది)

పా: ఓహో! ఇందుకేనా? యీ అలుక. మనకు టిఫిన్ వేళైంది- సరేనా? ఇగ జెప్పు- (ఇద్దరూ నవ్వుతారు)

మంజు: ఇదిగో నాన్నా! వారం రోజుల క్రితం అవతలి వీధిలో చిచ్చు పుట్టింది. వెంకాయమ్మగారింటి కోడలు సీతాలు గాబరాతో తటాలున బయట దూకి- 'అయ్యో! అయ్యో! నా బిడ్డ లోపలే చిక్కిపోయింది- ఎవరన్నా పుణ్యాత్ములు నా పాపను రక్షించండి! రక్షించండి!' అని ఒకటే ఏడుపు. ఒక్క గంతున మంటల్లో దూకి, బిడ్డను దెచ్చి తల్లికిచ్చాడు నాన్నా!

పా: ఎవడు ఆ సాహసి? నేనక్కడుంటే వెంటనే బహుమానించేవాణ్ణి వాణ్ణి.

మంజు: ఎవడో కాదు ఆ ధైర్యశాలి; మన- (నాలుక కర్చుకొని) ఆ అమృతరావే నాన్నా!

పా: (అసహనంగా) ఇందాక? వో చిన్న కోరిక అని వో చాటుభారతం విప్పిపెట్టావు ఉపోద్ఘాతంగా.

మంజు: నిజంగా నేటి అమృతరావు చర్యలు నాటి భారత వీరుల చేతల కేం తీసిపోవు నాన్నా!

పా: (తనలో) అంతు తెలియడంలేదు. ఈ చిన్ని కోర్కె చివరి కెలా తేలుతుందో! (ప్రకాశంగా) ఇంతకు నీ చిన్ని కోరికేమో చెప్పావే కాదు.

మంజు: చెబుతాను నాన్నా! అది ఏలాగూ మీరు తీరుస్తారని నమ్మకమే కదా! విన్నారా నాన్నా! ఒకరోజు మేము ఆ చెరువు గట్టున అలా గాలికి విహరిస్తున్నాం.

పా: (మధ్యలో అందుకొని ఆశ్చర్యంతో) ఆఁ! వాణితోనేనా?

మంజు: (సవరించుకొని) కాదు, మా నెచ్చెలి అంజలితో.

పా: సరే!

మంజు: గభాలున నీళ్ళలో దూకాడు. అటు చూస్తుముగదా! ఒక అమ్మాయిని ఒక చేత్తో దూరం నెట్టి, ఇంకో చేత్తో జుట్టు పట్టుకొని గట్టుకు చేర్చాడు. ఫస్టుఏడు అందించి, ఆయమకు ప్రాణభిక్ష పెట్టాడు.

పా: చాలా మంచి పని చేసాడు.

మంజు: ఎవడనుకుంటున్నారు? అతడు అమృతరావే నాన్నా!

పా: ఇక నీ ఉపోద్ఘాతం వింటానికి నాకు వోపిక లేదు. చెప్పు— ఆ చిన్ని కోరిక? చప్పున తీర్చేస్తాను.

మంజు: అక్కడికే వస్తున్నాను. నాన్నా! అట్టి దేవతాస్వరూ

పుడు, పరోపకారపరాయణుడైన పురుషశ్రేష్ఠుని రెట్టవట్టు టకు ఏ ఇంతి తపస్సు ఫలింపనున్నదోకదా నాన్నా!

పా: (తనలో) ఓహో! ఇదా చిన్న కోరిక. నా ఆసనానికే వెసరు పెడ్తున్నది; సరే చూతాం. (ప్రకాశంగా) అయితే ఏమంటావ్?

మంజు: ఏమీలేదు. నాన్నా! ఆ వరుడు కట్టే మంగళసూత్రం మీ అమ్మాయి మెళ్ళో పడితే దానిఅంత అదృష్ట వంతురాలు ఉండదని అనుకుంటున్నాను. నాన్నా! మరి మీరేమనుకుంటున్నారు. నాన్నా?

పా: (తనలో) ఓహో! పాపారావు బిడ్డ అని అనిపించుకుంది. భేష్, ఇప్పుడు నాకు కుటిలనీతియే శరణ్యం) (ప్రకాశంగా) అయ్యో! గింతదానికి గింత ఉపోద్ఘాతమా! దానికేం_ సరే, అలాగేకాని.

మంజు: (సంబరంతో గంతువేసి) మా నాన్నే_ మా బంగారు నాన్నే! (కాళ్ళమీద పడి మొగం పైకెత్తి) దీవించు నాన్నా! దీవించు.

పా: (తనలో) మాంచి ఇరుకులో పడ్డావు. పాపారాయుడా! పర్వాలేదు; మోసాన్ని మోసంతోనే జయించాలి; ముల్లును ముల్లుతోనే తీయాలి.

మంజు: అనుమానిస్తున్నారా? నాన్నా!

పా: (ధీమాగా) అదేమీ లేదమ్మా; ఏమని దీవించనా అని యోచిస్తున్నాను.

మంజు: దీనికేం యోచన నాన్నా! 'శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు! కోరిన వరుని రెట్టి పట్టెదవుగాక!' అంటే సరిపోతుంది.

పా: (సంబాళించుకొని) శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు! (మనసులో-నే) కోరిన వరుని రెట్టి పట్టెదవుగాక! ఇక పోదామా? టిఫిన్‌కు.

మంజు: ధన్యాస్మి! ధన్యాస్మి! నాన్నా!

పా: ధన్యోస్మి! ధన్యోస్మి బిడ్డా!

మంజు: మీరేకాదు, మన పితరులంతా తరిస్తారు. నాన్నా! అదిగో! అమ్మ ఎంత మురుస్తూ వున్నదో చూడు (పటము చూపిస్తుంది)

పా: ఈ పాపి తన పాప మొగంలో ఆ రూపు చూస్తాడు పాపా! (కంట నీరొల్కించుతాడు)

మంజు: (కన్నీరు కారుస్తూ) మీ కన్నీరు చూడలేను. నాన్నా! (కండ్లనీళ్ళు తుడుస్తూ) అయ్యో! అమ్మకూడా యేడుస్తుందే. ఊరడిల్లు నాన్నా! ఊరడిల్లు.

పా: (స్థిమితపడి తనలో) ఇక్కడ పాచిక మార్చాలి. (ప్రకాశంగా) ఎన్నికలు కాగానే నీ కోరిక తీరుస్తానని మాట యిస్తున్నాను. ఇప్పుడో సందేహం_

మంజు: ఏంటి? నాన్నా!

పా: వర్ణాంతర వివాహమని.

మంజు: నాన్నా! మీరే వేదికలపై అనేకసార్లు వర్ణాంతర, మతాంతర వివాహాలను ప్రశంసిస్తిరి. ఇప్పుడు మీరే మార్గదర్శకులు. మీ కీర్తి దిగంతరాళాల్లో ప్రకాశిస్తుంది. మీదు మిక్కిలి వాండ్లది అగ్రివర్ణం. నాన్నా!

పా: మరి అంతస్థు గురించి ఏం సమాధానం?

మంజు: నాన్నా! మీ కూతురు అంతస్థు మీరు ఒప్పుకుంటారు కదా! మీ సొత్తంతా మీ బిడ్డదే కదా! మీ బిడ్డే అల్లుని సొత్తైనప్పుడు మీ బిడ్డ సొత్తంతా అల్లుని సొత్తు కాదా? అప్పుడు ఇద్దరిది ఒకటే అంతస్థు ఐనప్పుడు ఇక భేదమెక్కడుంది నాన్నా!

పా: సెబాస్! పాపారావు బిడ్డవనిపించుకున్నావు. ఇదంతా నా ఆక్షేపణ కాదు సుమా! రేపు ఎవడన్నా వెర్రివెంగళప్ప ప్రశ్నవేస్తే ఎలా సమర్థించుకుంటావో? అని మాత్రమే.

మంజు: మా నాన్నకు నామీద సంపూర్ణ ప్రేమ, నిండు విశ్వాసం. (మురుస్తుంది)

పా: చిన్నారీ! నీ చిన్ని కోరికి తీర్చానుకదా! ఇప్పుడు నాదో చిన్న కోర్కి- కాదనవని నాకూ తెలుసులే_ కోరనా మరి?

మంజు: అదేంమాట నాన్నా! నా చేతిలో వుంటే తప్పక తీర్చేస్తాను ఇప్పుడే.

పా: (ఉదాసీనత నటిస్తూ) నా కెందుకో పదవీవ్యామోహం ఇంకా పీడిస్తూనే వుంది. పోటీ యేర్పట్టంతో సగం చచ్చాననుకో. ఓడితే నీ నాన్న నీకు కనపడడు. ఇచ్చిన మాట నిలబెట్టుకోలేని దుర్గతిపాలౌతాడు.

మంజు: ఇంతకూ ఏం కావాలి? నాన్నా!

పా: ఈ ఒక్క ఛాన్సు నాకు వదలమని చెప్పు. ఏమంటావు?

మంజు: (కొంచెం ఆలోచించి) చూస్తాను నాన్నా! తప్పకుండా చూస్తాను.

పా: చూస్తాను కాదు, ఆ పని చేస్తాను అను. నా కన్నతల్లివి కదూ! (గడ్డం పట్టుకుంటాడు) వూరు మీది—పేరుమాత్రం నాది. ప్రపంచం చేస్తాడు అమృతరాయుడు— సర్‌పంచ్ కుర్చీలో కూర్చుంటాడు పాపారాయుడు.

మంజు: తీరుస్తాను నాన్నా! నీ చిన్ని కోరిక.

పా: (సంతోషంతో) నా గారాల బిడ్డే! నా మోతీచూర్ లడ్డే! (ముద్దులవర్షం కురిపిస్తాడు)

(తెరపడుతుంది)

## తృతీయాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: పాపారావు శయనమందిరం—

ప్రవేశం: పాపారావు ఇటు అటు పచార్లుచేస్తూ—

పా: (స్వగతం) కాలం మారింది— మారుతున్నది— ఇంకను మారబోతున్నది; కాని, పాపారావు బుద్ధిమాత్రం మారలేదు— మారబోదు. నా కుడిభుజం, భుజంగరావు ఎన్నికల నియమావళిని అతిక్రమించినందులకు పోలీస్ కస్టడీ అనే బుట్టలో పెట్టబడ్డాడు. నా ఎడం భుజం, వజ్రాలు ఒళ్ళు సున్నమై ఆసుపత్రి యను నరకకూపంలో మూల్గుతున్నాడు. నా ఎన్నికల ప్రచార సన్నాహాలు చల్లబడ్డాయి. కిరాయి మనుషుల ప్రచారం నామమాత్రం సాగుతున్నది. పైసా కాల్వలై పారుతున్నది. ఫలితం ఎండమావుల్లా కనబడుతోంది. ప్రజలా నన్ను మోసగించుటకు సిద్ధంగా వున్నారు. ఇది బయటి సంగతి. ఇక ఇంటికి చేరుకుందాం— ఇటు గ్రామస్థులను గడగడలాడిస్తూ, పోలీసులగూడా భయపెడుతూ స్వైరవిహారం చేసిన పాపారావు పులి నేడు వొక గ్రామ సేవిక అనే రింగ్‌మాస్టర్ ఆడించినట్లు ఆడాల్సి వస్తోంది. అది పెండ్లి కాకముందే పెండ్లామై కూర్చుంది. పెండ్లాం హక్కులు పొందుతుంది. కాని, పెళ్లాం ఇచ్చే సుఖం మాత్రం వాయిదా వేస్తూవుంది. వలపిస్తుంది— అలరిస్తుంది, తప్పతాగిస్తుంది, మైమరపిస్తుంది— జోకొడుతుంది, నిద్రపుచ్చుతుంది— ఇది వరస. ఇక కన్నకూతుర్ని చూతాం— సభలని, సమావేశాలని— వూరేగింపులని, వుపన్యాసాలని—

ఒకే తిరుగుడు, ఏమన్నా అంటే— ఇదంతా నీ కోసమే నాన్నా! నువ్వు సర్పంచ్ అవడం, నేను పెళ్ళికూతుర్నవడం ఒక్కసారే కదా! అని దీర్ఘాలు తీస్తుంది. అందర్ని మోసగించి కార్యం సాధించాలనుకుంటే— అందరూ కలసి నన్నే మోసగించేట్టున్నారు.

(తెరలో కలకలం)

అదిగో! ఏదో చప్పుడు, ఎన్నికల ప్రచారమే అయివుంటుంది. (చెవిపెట్టి వింటాడు)

కమలం గుర్తుకే— మన ఓటు
కమలం గుర్తుకే— మన ఓటు

అమృతరావును— గెలిపిస్తాం
అమృతరావును— గెలిపిస్తాం

అమృతరావు— జిందాబాద్
అమృతరావు— జిందాబాద్

పాపారావు— ముర్దాబాద్
పాపారావు— ముర్దాబాద్"

బతికుండగనే చంపుతున్నార్రా! అయినా మిమ్మల్ని అనేంలాభం, కన్నకూతురే గోతి తవ్వుతూంటే. కన్నతల్లి విషం పెడితే, సర్కారు దోచుకుంటే— ఎవరికి చెప్పుకోవాలి? నా మంచి దినాలు మాజీలో కలిశాయి,

ఏమాత్రం గౌరవం కాపాడుకోవాలన్నా రాజీకి దిగడం తప్పదు. కాలాని కెదురీత పనికిరాదు. పాపారావు కాలంతోపాటు మారాలి, మారి తీరాలి. చివరిదశలో నైనా మంచి పేరు తెచ్చుకోవాలి.

(టెలిఫోను గంట మ్రోగుతుంది)

(పాపారావు ఎత్తి) అలో! — సర్పంచ్ పాపారావు మాట్లాడుతున్నాడు— నమస్కారం నమస్కారం— ఏమీ! నా నామినేషన్ దాఖలు కాలేదా? (ఆశ్చర్యపోతాడు) భుజంగరావుద్వారా దాఖలు చేయించాను— భుజంగరావు నామినేషన్ పత్రం ఉందా?— థాంక్యూ! ఉంటాను. (రిసీవర్ స్టాండుమీద పడవేసి) ఓరీ స్వామిద్రోహి! నువ్వు నిజంగా భుజంగమవురా! పాముకు పాలుపోసి నట్లు నిన్ను ఆదరించి పెంచి పెద్దచేసినందుకు నన్నే కాటువేశావుగదరా! దీనికి ప్రతిఫలం తప్పక నీకు దొరికి తీరుతుంది. (కొంచెం ఆలోచించి) అయినను ఇదొకందు లకు మంచికే అనుకుందాం. దీనితో మన మంచితనం రుజువుచేసుకుందాం.

మంజు: పరుగెత్తుకొచ్చి, నాన్నా! గెలిచాను- మాట నిలుపుకోగలిగాను. మీ అల్లుడుగారు, నాన్నా! మంచివారు.

పా: మరి నేనో?

మంజు: చాల మంచివారు నాన్నా!

పా: (విషపు నవ్వు నవ్వుతూ) నువ్వు మా ఇద్దరికంటె మంచిదానవు అవునా?

మంజు: మీ బిడ్డనుకదా నాన్నా! (గర్వంగా చూస్తుంది) అదలా వుంచండి_ మరే! వారు మీ కోసం పోటీ విర మించుకుంటామన్నారు నాన్నా!

పా: సరే!

మంజు: ఇక్కణ్ణుంచి వారు మీకోసమే ప్రచారంకూడా చేస్తామన్నారు నాన్నా! ఓట్లన్నీ మీ డబ్బాలో పడేలా చూస్తామని మాటకూడా ఇచ్చారు నాన్నా!

పా: అవునా!

మంజు: వారు మీవలె మాట తప్పేవారు కారు నాన్నా!

పా: అయ్యో! అయ్యో! నేను మాట తప్పానా? లేదు లేదు_ కావలిస్తే ఇప్పుడే ఆ మూడుముళ్ళూ వేయిం చేస్తాను.

మంజు: రామ! రామ! నన్నపార్థం చేసుకుంటున్నారా? నాన్నా! అలా ఎన్నడూ అనలేదు, అనను. మీరూ మాట తప్పనివారు_ వారూ మీవలెనే మాట తప్పనివా రని నా భావన.

పా: ద్వంద్వార్థంగా మాట్లాడ్డం నేర్చుకున్నావన్నమాట. భేష్! భేష్! మీకోసం నేను అసలుకే పోటీపడలేదే నా చిన్నారీ! నా సుకుమారీ! (బుగ్గమీద చిటికె వేస్తాడు)

చూడు! నా నామినేషన్ ఉందా?

మంజు: (విస్తుబోతూ) అవునా? నాన్నా! అయితే నేనే మాట నిలబెట్టుకోలేనిదాన్నన్నమాట. (చిన్నబోతుంది)

పా: కాదు, ఎన్నటికీ కాదు. నేనే నా కాబోయే అల్లుడు గారికి నా సర్పంచ్‌గిరిని వరదక్షిణక్రింద అడ్వాన్సు ముట్టచెప్పుకున్నానే నా ముద్దులమూటా! పువ్వులబాటా!

మంజు: మా నాన్న! బంగారు నాన్న! ఎంత మంచివారు! ఎంతో మంచివారు. (సంబరంతో బుగ్గలు రాస్తుంది)

(ఇద్దరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

## ద్వి తీ య రం గం

స్థలం: సభావేదిక—

ప్రవేశం: పాపారావు, అమృతరావు, గణపతిశాస్త్రి, ఆనందరెడ్డి, రాజగౌడు, జానయ్య, మంజుల్లాంజల్లులు—ఇత్యాదులు ఆసీనులై—

గణ: ఇప్పుడు సభాధ్యక్షులు, సర్పంచ్ శ్రీ పాపారావు గారు మాట్లాడుతారు.

పా: యువజన సంఘాధ్యక్షులు! అత్తని అనుచరవర్గం! మరియు ఇతర సభాసదులు!— యువజన సంఘపు మెన్నికల సభలో ఆ సంఘ ప్రత్యర్థి అధ్యక్షత వహించడం మీకు ఆశ్చర్యం కల్గించొచ్చు— అట్టి సభలో ఉపన్యసించడం మరింత వింత గొల్పొచ్చు. తినబోయే

పదార్థాల రుచులడుగనేల? విన్న తర్వాత యథార్థం మీకే బోధపడుతుంది. మిత్రులారా! మీ అందరి సహకార సానుభూతులు, అభిమాన ప్రీతులే గత రెండు ఎన్నికల్లో నన్ను గద్దెకెక్కించాయి. నేనుకూడా శక్తివంచన లేకుండా సేవ చేశాను, చేస్తున్నాను, ముందు చేయనున్నాను. నాలో ముదిమి తొంగిచూస్తావుంది. అందుకు సాక్షులు- ఈ తెల్ల వెంట్రుకలు, కళ్ళద్దాలు, బొక్కినోరు, చేతికఱ్ఱ (చూపిస్తాడు.) ఉడుకు రక్తం గల యువకుడెవడన్నా ప్రజా సేవకై ముందుకు వస్తాడా? అని అన్వేషిస్తూనే వున్నాను. ఇప్పుడు అటువంటివాడు దొరకనే దొరికాడు. ఆ యువకుడెవడో నేను చెప్పకుండానే మీరు గుర్తించారనుకుంటాను. అతని నిస్వార్థత, సత్ప్రవర్తన, నిరాడంబర జీవితం, త్యాగబుద్ధి, ప్రజాసేవా ధురంధరత్వంను మీ వలె నేనుకూడా కొనియాడకుండా వుండలేనంటే నమ్మండి. అతని గుణగణాలను పొగడాలంటే అదొక చిన్న భారతం అవుతుంది. ఆ ఆదర్శప్రాయుడు, సర్వజనాదరణీయుడు, బుధజన విధేయుడు, సార్థక నామధేయుడు అమృతరాయుడే మన ఆ ఆదర్శ నాయకుడు. (అమృతరావువైపు చూపిస్తాడు- అంతట-చప్పట్లు) మీరంతా అతని సేవలకు ప్రతిఫలంగా అతన్నే మన సర్‌పంచ్‌గా ఎన్నుకుంటారని- మనకింకా

ఘనంగా సేవచేసే అవకాశం అతనికి కల్గిస్తారని_ సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను.

ఇప్పుడొక ప్రశ్న మిమ్మల బాధింపొచ్చు. ఎన్నికల్లో అతనితో పోటీపడుతూ, అతనికొరకే ప్రచారం చేయడం అనేవి రెండూ విరుద్ధ విషయాలు. తూర్పు పడమరలు కలవడంలాంటివి అవి. ఈ ఎలక్షన్ రంగం లోకే నేను దిగకపోతే ఇక పోటీ ఎక్కడ? ఇందుకు సాక్షాలు_ నేను నామినేషన్ పత్రం దాఖలు చేయకుండా వుండటం మొదటిది, నా కూతురే ప్రతిపక్షంలో ప్రధాన పాత్ర వహించడం రెండవది, వీరారెడ్డి రాజగౌడ్లు నా డబ్బుతోనే అమృతరావు కొరకు ప్రచారం చేయడం మూడవది_ ఇక సెలవు. (కూర్చుంటాడు_ సభలో చప్పట్లు)

గణ: ఇప్పుడు మన ప్రియతమ నాయకుడు అమృతరావు తన వాగమృతాన్ని అందిస్తాడు, అలరిస్తాడు.

అమృ: అధ్యక్షులు! మిత్రులు! ఇతర సోదర సోదరీమణులు! అధ్యక్షులవారు నన్నుగూర్చి చేసిన ప్రశంసలకు అర్హత గలవాణ్ణి కాదనే నా భావన. ఇది వారి పుత్రవాత్సల్యత మాత్రమే. నేను సేవ సేవాభావంతోనే చేస్తున్నాను, కాని పదవీవ్యామోహంతో కాదు; కీర్తిప్రతిష్ఠల దాహంతో అంతకంటే కాదు. నన్ని ఎన్నికల్లో నిలబెట్టిన

అభిమానులకు అభినందనలు_ గెలిపించుటకు సాయ
పడుతున్న సానుభూతిపరులకు కృతజ్ఞతాభివందనాలు,
నా విజయానికి సర్వవిధాలా సహకరిస్తూవున్న సభా
ధ్యక్షులు, పాపారావుగారికి సహస్ర వందనాలు. అధి
కారం దొరికినా దొరక్కపోయినా_ ప్రజాసేవయే నా
జీవిత లక్ష్యం, ప్రధాన కర్తవ్యం_ అని నొక్కి చెప్పేస్తు
న్నాను. ఓటు విలువను మీరు సద్వినియోగం చేసు
కొండని పదేపదే ప్రార్థిస్తూ విరమిస్తున్నాను. (కూర్చుం
టాడు)

పా: ఇదివరకు మనకు చేసిన నిస్వార్థసేవకు చంద్రునికి
నూలుపోగో అన్నట్లు_ మన కాబోయే సర్పంచ్
అమృతరావుగారికి నా తరపున ఒక చిన్న కానుక సమ
ర్పించుకోడాన్కి గర్వపడుతున్నాను. అతగాడు దానికి
వప్పుకుంటాడనియే నా పూర్ణ విశ్వాసం. (మంజులను
వేదిక మీదికి పిలుస్తాడు_ అమృతరావును ఆహ్వాని
స్తాడు. మంజులా అమృతరావులు చేరుకుంటారు) నా
కూతురు, మంజులాదేవి హస్తాన్ని అమృతరావుగారు
గ్రహిస్తారని నేను కోరుతున్నాను. (అమృతరావు
చేతికి మంజుల చేయి అందిస్తాడు; అమృతరావు గ్రహి
స్తాడు. అందరు చప్పట్లు)

జాన: (లేచి) అధ్యక్షులవారు అనుమతించాలి, నాదీ ఒక్క చిన్న కానుక.

పా: ఎవరికి ?

జాన: గణపతిశాస్త్రిగారికి.

పా: గణపతిశాస్త్రిగారు వేదికపైకి వత్తురుగాక!

(గణపతిశాస్త్రి వేదిక నెక్కుతాడు)

జాన: (అంజలిని వేదికపైకి పిలిచి) ఈ ఎన్నికల సంరంభంలో మన నాయకుడు, అమృతరావుకు అన్నివిధాలా చేదోడువాదోడుగా నిల్చి, సర్పంచ్‌గిరిని అందించడంలో కృతకృత్యుడైన మన ఉప నాయకుడు, గణపతిశాస్త్రి గార్కి, నా కూతురు అంజలీదేవిని సహధర్మచారిణిగా కొనసాగుటకు సమర్పించుకొంటున్నాను. (అంజలి పాణిని అందిస్తాడు. శాస్త్రి చిరునవ్వుతో గ్రహిస్తాడు బింకరంగా అంజలిని చూస్తూ—అంజలి సిగ్గునో తల వంచుకొని శాస్త్రిని వాలగా చూస్తుంది. సభలో కరతాళ ధ్వనులతో హర్షధ్వానాలు)

(అందరూ నిష్క్రమిస్తారు—తెరపడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: అమృతరావు ఇంట్లో లోపలి హాలు—

ప్రవేశం: సోఫాలో మంజులా అమృతరావు—

మంజు: నా అంత అదృష్టవంతురాలుందా? లోకంలో.

(గర్వంగా అమృతరావు మొగంలోకి సూటిగా చూస్తుంది, విడెం అందిస్తూ)

అమృ: ఎందులకో? (కొంటెగా చూస్తాడు)

మంజు: (చిరునవ్వొలుకుతూ) అమృతమును నా సొత్తుగా చేసుకున్నందులకు.

అమృ: మరి నేనో? అంతకన్నా అదృష్టవంతుణ్ణి.

మంజు: ఎందులకో? (ప్రశ్నార్థకంగా చూస్తుంది)

అమృ: (ప్రేమ విహ్వలుడై) మంజుల అధరామృతాన్ని తనివిదీరా ఆస్వాదిస్తూ ఉన్నందులకు. (సూటిగా కళ్ళ లోకి చూస్తాడు)

మంజు: (చూపులు వాలుస్తూ) అబ్బా! భరించలేను. ఇవి చూపులా?

అమృ: పూవిల్తుని తూపులు. (అలాగే చూస్తూవుంటాడు రెప్ప వాల్పక)

మంజు: (తలెత్తి క్రీగంటి చూపులతో) ఆఁ! అమాంతం తాగే సేట్టే వున్నారే!

అమృ: ఊఁహూ! (తల అడ్డంగా దిప్పుతూ) మెల్లి మెల్లిగా నములుతూ, చప్పరిస్తూ, తృప్తిగా పానం చేస్తాను.

మంజు: అయ్యో! అయ్యో! నన్నేనా? (భయం నటిస్తుంది)

అమృ: (అలవోకగా నవ్వుతూ) కాదు.

మంజు: మరి దేన్ని? (ప్రశ్నార్థకంగా చూస్తుంది)

అమృ: నీ అందాన్ని మాత్రమే.

మంజు: హమ్మయ్య! బతికించారు. (నిండుగా శ్వాసపీ లుస్తుంది)

అమృ: అందుకు నాకు బహుమానం? (ఆతురతతో చూస్తాడు)

మంజు: ఏముంది నా దగ్గిర? అంతా తమరికే అర్పితం గదా! (చేతులు వెలకలవేస్తూ పరిహాసంగా చూస్తుంది)

అమృ: ఉంది. ఏదో ప్రత్యేకంగా నా కోసం ఇంకా దాచి ఉంచావు.

మంజు: మనకింకా దాపరికాలు కూడానా?

అమృ: అయితే నేనే వెతుక్కుంటాను. (లేస్తాడు)

మంజు: మీకు కావల్సింది ఏదో మీ కివ్వకుండా దాచుకు న్నానా? పచ్చి అబద్ధం. (ఆశ్చర్యంగా చూస్తూ) ఏదీ? ఎక్కడ? చూచుకోవచ్చు- (లేస్తుంది)

అమృ: ఇంద- (అధరాన్ని స్పృశిస్తూ) ఈ అధరంలో నిహి తం చేసావు చూడు— ఆ అమృతం తాగితే కాని అమృ తుడు అమృతత్వం పొందడు. (పెదవు లందుకోబోతాడు)

మంజు: అగో! మా నాన్నగారు. (అమృతరావు వెనక్కి చూచునంతలో తప్పించుకొని కిలకిల నవ్వుతుంది.)

అమృ: (ముందుకు దూసుకొని వెళ్ళి పట్టుకొని) ముద్ద రాలా! తప్పించుకోగలవా? ముద్దబంతివంటి నీ ముద్దుల మోము ఎంత ముద్దొస్తుందో! (పరవశుడై ముద్దులవర్షం

గురిపిస్తూ తన బాహుబంధాల్లో గట్టిగా బంధిస్తాడు. ఇద్దరూ తన్మయులై లోకమే మరుస్తారు)

పా: (ప్రవేశించి చకితుడై, క్షణం నిల్చిపోతాడు— సన్నగా దగ్గి) పానకంలో పుడక్కలా వచ్చిపడినందులకు చింతిస్తున్నాను. నూతన దంపతులకు నా అభినందనాలు. (మంజులా అమృతులు అదరిపడి— ఈ లోకంలోకి దిగి— సిగ్గున చూడలేక చూస్తారు తొట్రుపాటుతో.)

మంజు: మీ రాక చూడనందులకు మన్నించండి నాన్న గారూ!

అమృ: మీ యాగమనం గమనించనందులకు క్షమించండి మామగారూ!

పా: ఇందు మన్నించడానికి, క్షమించడానికి ఏమీలేదు. ఇది సహజం— మాకూ అనుభవమేలే! (తృప్తిగా నవ్వుతాడు)

(ఉభయులూ పాదాభివందనం చేస్తారు)

(చేతులెత్తి, ఆనందంతో) చిలుకా గోరింకల్లా— రతీమన్మథుల్లా, ప్రేమగగనాన, ఆనందం వెలిమబ్బుల్లో విహరిస్తూ నా కంటిపాపలై— నా యింటి దీపాలై వెలగండి (దీవిస్తాడు)

(అంజలీ గణపతులు ఉత్సాహంతో ప్రవేశిస్తారు)

అంజ: మంజులా అమృతులకో శుభవార్త.

మంజు: అది డైరెక్టుగా చెప్పవచ్చుగా.
గణ: మొదట బహుమానం? (చేయిచాస్తాడు)
అమృ: అడిగిందిస్తాంలే.
అంజ: సత్యపురం సర్‌పంచ్‌గా అమృతరావుగారు ఎన్నికయ్యారు.
పా: అది మనకు ఇదివరకే తెలుసుగదా!
గణ: అయితే మన బహుమానం, సున్నకు సున్న- పుత్రం పూజి- అక్షింతలు! (నిరాశగా చూస్తాడు)
అంజ: ఆ బహుమానం నేనిస్తానులే! (నవ్వుతుంది)
గణ: అది పాతదేగదా! (కొంటెగా చూస్తాడు)
(ప్రవేశం: ఆనందరెడ్డి, రాజగౌడు, శేషాచార్లు)
అందరు: సర్‌పంచ్- పాపారావుకీ జై! సర్‌పంచ్ అల్లుడు అమృతరావు క్రొత్త సర్‌పంచ్ జిందాబాద్! సత్యపురం ప్రజలు వర్ధిల్లాలి!
పా: సత్యపురం సర్‌పంచ్ అమృతరావుకు నా ప్రత్యేక అభినందనాలు.
అమృ: ఇదంతా మీ చలువ; మీ మంచితనమే ఇంతకు కారణం మామగారూ!
పా: నన్ను మంచిగా మార్చింది నీ మంచితనమేనోయి అల్లుడుగారూ!
అమృ: మనిషి సహజంగా మంచివాడే. వాణ్ణి దుష్ట వాస

నలు, పాపిష్టి సహవాసాలే చెడుగా మలుస్తాయి. అప్పుడు పేరాస అనే భూతం ఆవహిస్తుంది అతగాణ్ణి; చెయ్యరాని పనులు చేయిస్తుంది. సజ్జన సాంగత్యం అనే మాంత్రికుడు కాస్త ఆ దయ్యాన్ని దించేశాడంటే చాలు- మనిషి తన సహజత్వంలో నిలుస్తాడు- పరిశుద్ధ ప్రక్రియద్వారా జలం జలమైనట్లు.

పా: భేష్! భేష్! మంచిగా చెప్పావోయ్ అల్లుడుగారూ! శేషాచార్ల జోష్యం నా యెడ అక్షరాలా నిజం ఐంది- 'ఓటమిలేదూ గెలుపూలేదు' అన్నది. ఆయనగారికి సంభావన ముట్టజెప్పాలి పాపం. (నవ్వుతూ శేషాచార్ల మొగం చూస్తాడు)

శేషా: (సంతోషంతో) మీ దయవుంటే చాలు; అదే పదివేలు.

ఆనం: మన సర్పంచ్‌గారి సన్మానసభ ఎన్నడు నిశ్చయిస్తారో! (మంజులవైపు చూస్తాడు- మంజుల తండ్రిని చూస్తుంది- పాపారావు శేషాచార్యులను చూస్తాడు)

శేషా: (కొంచెం పైకి వీక్షించి, వేళ్ళు లెక్కించి) వచ్చే లక్ష్మివారం వైశాఖ శుద్ధ దశమి, శ్రవణా నక్షత్రం, కర్కాటక లగ్నం, నాల్గుగంటల నాల్గు నిమిషాలకు సుముహూర్తం.

రాజ: తథాస్తు:

(తెరపడుతుంది)

—: ఇతిశమ్ :—

# ఝాన్సీ రాణి (నాటకం)

ఇందలి పాత్రలు :

| | | | |
|---|---|---|---|
| 1. | లక్ష్మీబాయి | — | ఝాన్సీ మహారాణి |
| 2. | రాంచందర్‌రావు | — | ఝాన్సీ మహామంత్రి |
| 3. | గురుబక్ష్‌సింగ్ | — | ఝాన్సీ సైన్యాధిపతి |
| 4. | ధోండోపంథ్ | — | ఝాన్సీ ఆస్థాన జోషి |
| 5. | ఖాసింఖాన్ | — | ఝాన్సీ తోపుఖాన అధికారి |
| 6. | తులసీరాం | — | ఝాన్సీ రైతు ప్రతినిధి |
| 7. | కాశీబాయి | — | ఝాన్సీరాణి చెలికత్తియ |
| 8. | బహదూర్‌షా | — | మొగల్ చక్రవర్తి |
| 9. | ముల్లాసాహెబ్ | — | మొగల్ వజీరు |
| 10. | అమీర్‌ఖాన్ | — | మొగల్ సైన్యాధిపతి |
| 11. | చమన్‌లాల్ | — | హవాల్‌దార్ |
| 12. | మాధురి | — | చమన్‌లాల్ భార్య |
| 13. | మియా అజీజ్ | — | కవ్వాలి సర్దార్ |
| 14. | నానాసాహెబ్ | — | పీష్వా |
| 15. | రావు సాహెబ్ | — | పీష్వా ప్రధాని |
| 16. | తాంత్యాతోపే | — | పీష్వా సైన్యాధిపతి |
| 17. | విదూషకుడు | — | పీష్వా చెలికాడు |
| 18. | హ్యూరోజ్ | — | కంపనీ సైన్యాధిపతి |
| 19. | జాన్సన్ | — | కంపనీ ఉపసైన్యాధిపతి |
| 20. | జియాజీరావు | — | సింధియా రాజు |
| 21. | దినకర్‌రావు | — | సింధియా దివాన్ |

22. రాయబారి, ద్వార్‌పాల్, దర్బాన్, షమ్షీర్‌ఖాన్— మొ॥

ఓం

శ్రీ సాయినాథాయనమః

# ఝాన్సీరాణి

(నాటికం)

---

## ప్రథమాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: ఝాన్సీరాణి అభ్యంతర మందిరం

ప్రవేశం: లక్ష్మీబాయి పచార్లుచేస్తూ

లక్ష్మీ: (స్వగతం) ఆహా! ఏమి కాలవైపరీత్యం!

(పాడుతుంది)

కాలం మహిమల గనుగొన దరమా?
కాల మొకరీతి గడువవలె సుమా!
భిక్షపతిని లక్షపతిగ జేయును
లక్షాధిపతిని భిక్షుని జేయును
కాల మహిమల గనుగొన దరమా?

(నిట్టూర్చి) ఔరా! పరమ దరిద్రు నింట బుట్టిన ఒక బ్రాహ్మణ బాలికను అష్టైశ్వర్యములతో దులదూగు మహారాణిగా వొనర్చినది- కాలమేగదా! అట్టి సుఖజీవి కడుపు కాల్చి, పసుపుకుంకుమ రాల్చి, రాజ్యంకూల్చి, శాంతి

సౌఖ్యాలకు దూరంచేర్చి, నీచాతినీచమైన కంపనీ ప్రభుత్వమిచ్చు చాలీచాలని భరణంపై బ్రతుకు దుర్దశకూర్చి బుజ్జగించుచున్నది_ కాలమేగదా! కానిమ్ము, కాలమహిమలను ఇంకను గాంతునుగాక! ఈ తుచ్ఛ కంపనీ చేసిన పని పచ్చి మోసం, విశ్వాసఘాతుకం, పరమ నికృష్టం, ఈ జన్మలో మరచేదికాదు. తత్ప్రతీకారంకోసం మనసు తహతహలాడుతున్నది. అట్టితరి దైవానుగ్రహమున రాకపోతుందా? ఆ హూణ ప్రభుత్వాన్ని కూకటివేళ్ళతో పెల్లగించి, ఆ శ్వేతమర్కటాలను సముద్రంలో ముంచి, పవిత్ర భారతమాత దాస్యశృంఖలాలను త్రెంచివేయడానికి నా ప్రాణాతైనను అర్పించి అమరజీవిని అవుదునుగాక! అంతా ఈశ్వరాజ్ఞ. (ఇటు అటు చూచి) ఎవరే అడ్కడ? (కేకవేస్తుంది)

కాశి: (తత్తరపాటుతో ప్రవేశించి, బిత్తరచూపులతో) చిత్తం! చిత్తం! మహారాణి!

లక్ష్మి: స్నానానికి అంతా సిద్ధమేనా ? పూజాద్రవ్యాలు తాయారేనా?

కాశి: (పరధ్యానంగా) చిత్తం! చిత్తం!

లక్ష్మి: (నవ్వు ఆపుకొనుచు) ఏమిటే? ఆ నీ చిత్తం_ నీచిత్తం నేడేదో పరాయత్తమైనట్లు తోస్తున్నది. నీ ఆ వట్టిబుట్టయే యింకా పూలు తేలేదని చెబుతున్నది. ఆఁ! తెలిసింది.

నీ చిత్తం బావకు దత్తం ఐంది. అది ఇక్కడెందుకుంటుంది? బాగానే వుంది, కాని కర్తవ్యము విస్మరించకూడదు సుమా! వెళ్ళు; వెంటనే పూలుకోసుకొనిరా— ఏమంటావ్?

కాశి: (చిన్నవోయి) చిత్తం! చిత్తం! (సిగ్గుతో చూస్తూ పరుగుతీస్తుంది)

లక్ష్మి: (అటే చూస్తూ) పాపం పిచ్చిపిల్ల. బావంటే పడిచస్తుంది. మా ఆస్థాన జోషి, ధోండోపంథ్‌కు గతించిన భార్య వారణాశి అంటే ప్రాణం. ఆమె వియోగం అతణ్ణి కొంత మట్టుకు పిచ్చివాణ్ణి చేసింది. కాని, తన ప్రాణసఖి అంతిమ కోర్కెను గుర్తించుకొని, ఇప్పుడు ఆమె చెల్లి కాశియందు, వారణాశిని చూసుకొని తృప్తిపడుతున్నాడు. ఒక్కొక్కప్పుడు మాకును కాశినిచూస్తే వారణాశియా యని భ్రమ కలుగకపోదు. కాశీపంథులను జతపరుస్తామని మాతో చేతిలో చేయి వేయించుకొని హాయిగా కన్నుమూసింది వారణాశి. వీరిద్దరిని ముడివేయడం మా కర్తవ్యం. అయినను అది ఝాన్సీ స్వాతంత్ర్యానంతరమే కార్యరూపం ధరించడం. అస్తు! స్నానానికి వేళౌతున్నది. (నిష్క్రమిస్తుంది)

(తెరపడుతుంది)

———

## ద్వితీయ రంగం

ప్రదేశం: అంతఃపుర ఉద్యానవనం

ప్రవేశం: ధోండోపంత్– విరహవేదనతో

దో: ఇప్పుడు కాశిని చూస్తుంటే వారణాశియే నా కోసం తిరిగి వచ్చిందా అనిపిస్తుంది. కాశి, వారణాశి వెలితిని అన్నివిధాలా పూరింపగలదని నా పూర్ణ విశ్వాసం. ఇక మా వివాహం మహారాణి ఆజ్ఞకై ఎదిరిచూస్తున్నది– మహారాణి ఆజ్ఞ రూపిస్వాతంత్ర్యంను నిరీక్షిస్తున్నది. మరి మన్మథుడేమో నిర్వ్యవధానంగా వ్యథపెడుతు న్నాడు. అబ్బ! (అసహనంగా) అశరీరుడే ఇంతగా బాధిస్తున్నాడైతే ఇక శరీరమే ఉంటె వాణ్ణి పట్టపగ్గాలే లేకబోయెడివిగదా! త్రిలోచనుడు తన తృతీయ లోచ నాగ్నిచే వాణ్ణి కాల్చి అనంగుణ్ణి చేయడం లోకాని కెంతో మేలైంది. (మదను నుద్దేశించి చేతులెత్తి పైకి చూస్తూ పాడుతాడు)

ప్రేమరాజ్యమును ఏలేవాడా!
ప్రియులకు ప్రేమలు నేర్పేవాడా!
కామదేవ! పోపోరా– నా
కాశిని కౌగిట దేరా– నా
కాశిని కౌగిట దేరా– నా
కాశిని కౌగిట దేరా!

పదునుగలవి నీ యమ్ములురా
పాషాణము నా హృదయమురా
ముదిత మృదుల నెద నాటుమురా- నా
ముద్దులగుమ్మను గూర్చుమురా- నా
ముద్దులగుమ్మను గూర్చుమురా.
(కండ్లు మూసుకొని పరవశుడౌతాడు)

కాశి: (పూలబుట్టతో ప్రవేశించి, తనలో) ఓహో! విన్నాను విన్నాను. బావ మనసును సంపూర్ణంగా ఆక్రమించు కున్నాను. అప్పుడు బావ మాటలు కేవలం ఓదార్పులను కున్నాను. ఇప్పుడవి యథార్థములని తెలుసుకున్నాను. ఆహా! ధన్యాస్మి! ధన్యాస్మి! ఇప్పుడు బావ నొకింత భరతం పట్టిస్తాను. (వెనుకనుండి మెల్లిగా రెండు కండ్లు మూసి పట్టుకుంటుంది)

ధోం: (తృళ్ళిపడి, ఒళ్ళు తెలిసికొని, కళ్ళను గప్పిన వ్రే ళ్ళను స్పృశిస్తూ) ఓ నా ప్రత్యక్ష దేవతా! వచ్చితివా? నా ప్రార్థన మెచ్చితివా? నే కోరిన వర మిచ్చితివా? చేతులు విడు- కన్నుల బడు. (విడిపించుకొన ప్రయ త్నిస్తూ వుంటాడు- కాశి మరింత గట్టిగా పట్టుకుంటుంది) ఔరా! పూవిల్తుడు తన ప్రసన్నతను నా కాశీకరపల్లవాల్లో దాచాడు. కొంచెం చూడనిస్తాడుగాక! (చేతులు విడి పించుకుంటాడు)

కాశి: (ఎదుట నిల్చి) బావా! (గాజుల గలగలతో కలిపి
కిలకిల నవ్వుతూ కొంటెగా చూస్తుంది)

ధోం: (సంబరంతో చేతులు చాచి పాడుతాడు)
రాణీ! రావే పూవులతో_ నీ
వేణిని కైసే నీవే_ రతి
రాణిని మించితి వీవే.

కాశి: రాజా! రారా! దండలలో_ నీ
రాజసమును కననీరా!_ వల
రాజును గేరితి వౌరా!

ధోం: మల్లెలు, మొల్లలు, విరజాజులు, చే

కాశి: మంతులు, సంపెంగలు, రోజాలు_

ధోం: కొల్లలు కొల్లలు గా బూచెను_ క్రొం

కాశి: గ్రొత్త సోయగపు దీప్తులు కాసెను.

ధోం: రాణీ! రావే!

కాశి: రాజా! రారా!

ధోం: చిలుకలు కిలకిల పలుకును చూడు_ కో

కాశి: కిలల్కు కుహూయని కూయు చూడు మా.

ధోం: నే ఘన ఘనమును.

కాశి: నే మయూరమును.

ధోం: నేను వర్షమును.

కాశి: నే చాతకమును.

ధోం: రెట్టావట్టాల్ పట్టుకొని— యీ

కాశి: రేడు లోకాలు తిరిగొత్తాము.

ధోం: తిరిగొత్తాము. (కేలందుకోపోతాడు)

కాశి: (నేర్పుతో తప్పించుకొని) బావగారేదో పగటి కలలు కంటున్నారు?

ధోం: మరదలిని గూర్చియే.

కాశి: అదేమిటో? (చేతులు, కండ్లు త్రిప్పుతుంది)

ధోం: నా ముద్దుల మరదలు నా మనసును ఎన్నడో ఆక్రమించుకుంది. శరీరమును ఎప్పుడాక్రమించుకుంటుందా? అని. (నోరు తెరచుకొని చూస్తాడు)

కాశి: పెండ్లి కాగానే.

ధోం: పెండ్లెప్పుడో?

కాశి: మహారాణి యాజ్ఞ కాగానే.

ధోం: మహారాణి ఆజ్ఞ ఎన్నడో?

కాశి: ఝూన్సీ స్వాతంత్ర్యం సిద్ధించిననాడే.

ధోం: అయితే ఇప్పుడో ముద్దు! (ఆశతో చూస్తాడు).

కాశి: అదైతే వద్దు. (తల అడ్డం తిప్పుతుంది— ఊరించే చూపులతో)

ధోం: (పెదవులు చప్పరిస్తూ తమితో చూస్తూ పట్టుకోపోతాడు)

కాశి: రా. (పరుగుతీసి, చెట్టుచాటున నిలుస్తుంది)

ధోం: ఆగు. (అటు పరుగెత్తి కండ్లు మూసికొని కౌగిలించు కుంటాడు చెట్టును మాత్రం)
కాశి: (ఎదుట నిల్చి) బావా! (పకపక నవ్వుతుంది)
ధోం: అబ్బా! కాశీ! (అటువైపు ఉరికి కౌగిలించుకుంటాడు గాలినిమాత్రం– చిన్నబోతాడు)
కాశి: అమ్మో! మహారాణికి పూజా సమయం దగ్గరవుతున్నది. (కొంటెగా నవ్వుతూ పరుగు తీస్తుంది)
ధోం: (నిరాశతో అటే చూస్తూ నిల్చిపోతాడు– నిట్టూర్పు విడుస్తాడు– కొంతవడికి సంభాళించుకొని) ఝాన్సీ స్వాతంత్ర్యం– కాశీ వివాహం– ఇప్పుడే రెండూ సాధిస్తాను. ఏదీ నా కత్తి? (ఇటు అటు చూస్తాడు) కుక్కను కొట్టుటకు దుడ్డే కావాలా? హఁడీ! అంతేనే చాలదూ? ఈ ధోండోపంథ్ దగ్గర "ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర" మని రెండు శస్త్రాలున్నవి. అందు శీఘ్రఫలదమగు మొదటిదాన్నే ఉపయోగిస్తాను. (ఉగ్రుడై) కంపనీ రాజ్యం కూలుగాక! తెల్ల పిశాచాలు కాలుగాక! (వీరావేశంతో) తెల్లవారి పాలనా రాత్రి అంతరించాలి! ఝాన్సీ స్వాతంత్ర్యభానుడు వెలుగాలి! (ఎలుగెత్తి) కంపనీ సర్కార్ ముర్దాబాద్! అనరేమి? (ఇటు అటు చూస్తాడు) ఎవరన్నా ఉంటేగా అనడానికి– (తనవైపే వస్తున్న సిపాయిని చూచి ఉలిక్కిపడి గజగజ వణుకుతూ)

అమ్మో! కొంప మునిగింది. వాడు వననే విన్నాడు. మెడకాయమీది తలకాయ తాటికాయవలె ఎగిరిపడిందే. (తలపుణుక్కొంటు కాలుకాలిన పిల్లిలా ఎగురుతుంటాడు)

(సిపాయి దుస్తుల్లో ఖాసింఖాన్ ప్రవేశిస్తాడు)

ఖాసిం: (నవ్వు ఆపుకొంటూ, కోపం నటిస్తూ) ఏమన్నావ్?

ధోం: (చేతులు జోడించి- భయంతో) అపరాధం ఐంది; మహాపరాధం ఐంది. అలా అనను, ఇంకెన్నడూ అనను, క్షమించాలి సర్కార్. తప్పైంది- చెంపలేసుకుంటాను. కావలిస్తే ముక్కు నేలకు రాస్తాను (అలా చేస్తాడు) మీ కంపనీ సర్కార్ వేయేండ్లుండుగాక! కాదు కాదు, పది వేలేండ్లు మనుగాక! తప్పు తప్పు, ఆచంద్రార్కం వర్ధిల్లు గాక! (వంగి కాళ్ళంటబోతాడు)

ఖాసిం: (మధ్యలోనే అందుకొని నిలబెట్టి మొగంచూచి నవ్వుతూ) పండత్ జీ! ఈ కంగార్ కి ఏంటి? నీకి శైతాన్ కి గీతాన్ కి పట్టాలేద్దదా భాయ్! (వీపున చరుస్తాడు)

ధోం: (పరికించి చూచి, చకితుడై) నువ్వా! ఖాసింసాబ్! మొదటనే చెప్పావుకాదు. దొంగ!

ఖాసిం: నాకి చెప్టకి మోకా ఇస్తేగా నువ్వు!

ధోం: దోస్త్! ఎక్కణ్ణుంచి రావడం? విశేషాలేంటి?

ఖాసిం: (కోపంతో) ఆ కంపనీ సర్కార్ కాలీ కూలీపోనూ- నా కడ్పుకితరీఖా దాని కడ్పుకి మండీపోను- ఎంతో

మందికి సిపాయీలు బర్తరఫ్ అయి ఘర్ తరఫ్‌కి పో యింౘ్రు. వాండ్ల అందర్కి బద్దావాకి దాన్కి తగుల్తంది. చూడు నా మాటకి సత్యంకి అయి తీర్తది.

ధోం: తథాస్తు!

ఖాసిం: అయితే మనకి ఇప్డు నారాల్‌కి వేస్తాం. నాక్ 'కంపనీ సర్కార్' అంటా– నీకి 'ముర్దాబాద్' అనాలి. (అటు ఇటు చూచి మెల్లిగా) కంపనీ సర్కార్–

ధోం: (భయంతో) ముర్దాబాద్! (మూడుసార్లంటారు)

ఖాసిం: మొగలాయి సర్కార్– అంటే– జిందాబాద్ అనాలి. మొగలాయి సర్కార్–

ధోం: ఊఁహూ! పీష్వా సర్కార్–

ఖాసిం: కాదు– మొగలాయి సర్కార్–

ధోం: కాదు– పీష్వా సర్కార్–

(ఇలా మొగలాయి సర్కార్– పీష్వా సర్కార్ అంటూ ఒకరిమీదికి ఒకరు పోతుంటారు)

(కఱ్ఱ చేతపట్టుకొని తులసీరాం ప్రవేశిస్తాడు)

తుల: (ఇద్దరిమధ్య నిలబడి నవ్వుతూ) మన దేశంలో పరాయి సర్కారు భూతం రాజ్యం చేస్తున్నది. మనం నేనంటే నేనని మతావేశంతో పోట్లాడుకుంటున్నాం. ఆ కంపనీ రాక్షసులు ఇంకా బలం పుంజుకుంటున్నారు. మనం ఉభయులం చేతులు కలుపుకుంటేనే కాని మన

దేశాన్ని పట్టి పీడిస్తున్న తెల్లదయ్యాన్ని విడిపించుకో టాన్కి సాధ్యం కాదు. 'ఇంట గెల్చి రచ్చ గెలవ' మన్నారు పెద్దలు. మన ఝాన్సీరాజ్యం మొదట సాధించడం ప్రస్తుత కర్తవ్యం. తరువాత భారత స్వాతంత్ర్యం గూర్చి పూనుకుందాం. నేను ఝాన్సీరాజ్యం– అంటే, సాధిస్తాం– అనాలి, ఝాన్సీ లక్ష్మీబాయీ– అంటే, జిందాబాద్– అనాలి.

తుల: ఝాన్సీరాజ్యం– (ధైర్యంతో బిగ్గరగా అంటాడు)

ధోం, ఖాసిం: సాధిస్తాం!

తుల: ఝాన్సీ లక్ష్మీబాయీ–

ధోం, ఖాసిం: జిందాబాద్!

అందరు: భారత స్వాతంత్ర్యం– జిందాబాద్!

కంపనీ సర్కార్– ముర్దాబాద్!

(తెరపడుతుంది)

---

## తృతీయ రంగం

ప్రదేశం: రహస్య సమాలోచన మందిరం

ప్రవేశం: లక్ష్మీబాయి, గురుబక్ష్ సింగులు ఆసీనులై

లక్ష్మి: కాశీ! (పిలుస్తుంది)

కాశి: (ప్రవేశించి) చిత్తం!

లక్ష్మి: మందిర ద్వారముననే కాచియుండుము. నా అను మతిలేనిదే యెవ్వరినీ లోనికి రానియ్యవాకు.

కాశి: చిత్తం! (బయటికి పోవును)

గురు: మహారాణీ!

లక్ష్మి: (మాట త్రెంచి) ఆ మహారాణి పదవి నన్ను వీడి యెన్నడో వెళ్ళింది. ఆ సంబోధన నా చెవులకు ములుకులు, హృదయమునకు శల్యములు.

గురు: లేదు, మహారాణీ! మాకు మీరు సర్వదా మహారాణులే. ఆ పదవి మరల మీ పాదపద్మములను ముద్దిడుకొనుటకు తహతహలాడుతున్నది.

లక్ష్మి: అంతా ఈశ్వరాజ్ఞ. కాని- సింగు, మానవ ప్రయత్న మెంతవరకు వచ్చింది?

గురు: ఇంట బయట, అంటే- (మెల్లిగా) భర్తరఫ్ ఐన మన సంస్థాన సిపాయిలకు, ఆ కంపనీ దేశీ సిపాయిలకు ఏకాభిప్రాయం కుదిరింది. ఇక అనువగు సమయం మరియు మీ యాజ్ఞల కొరకు వేచియున్నాము.

లక్ష్మి: సర్దార్‌జీ! ఉత్తర హిందూస్థాన స్వాతంత్ర్య సమర వార్త లేమైన చేరాయా?

గురు: మహారాణీ! మన గూఢచారులవలన ఇప్పుడే వార్త లందాయి. తెల్లవారిని పారదోలి బహాదుర్‌షాను ఢిల్లి సింహాసనంమీద మరియు నానాసాహెబును పీష్వా

గద్దెమీద పునః ప్రతిష్ఠించుటకు సర్వసన్నాహాలు ఏర్ప డ్డాయి. మేమును ఏలినవారిని ఝాన్సీ మహారాణులుగా చేయటానికి నమకట్టుకుని వున్నాం. ఇక ముహూర్త మునకే వేచివున్నాం.

లక్ష్మి: ఈలోగా బహాదుర్ షా యొద్దకు, నానాసాహెబ్ వద్దకు వార్తాహరుల్లను బంపి, మన స్వాతంత్ర్య సమరం నడుపుటకు వారి సహాయంకూడా అర్థిస్తే ఎట్లావుం టుందో? (ప్రశ్నార్థకంగా చూస్తుంది)

గురు: (ఉద్వేగంతో కత్తినెత్తి) మహారాణులు క్షమింతురు గాక! ఈ గురుబక్షసింగము తెల్లకుంజరాల మస్తకాలు చీల్చి చెండాడి, మిమ్ము ఝాన్సీ మహారాణిగా అభిషే కించటానికి కంకణం ధరించి యుండగా— ఇతరుల నర్థిం చటం సిగ్గుచేటు కాదా? అవి నా మనవి. పైన తమరి ఆజ్ఞ.

లక్ష్మి: (చిరునవ్వుతో సామరస్యంగా) అవునూ. సింహం పరాక్రమం మేము ఎరుగనిది కాదు. నీవు అన్నట్టు చేసి తీర్చగలవని మా విశ్వాసం. కేవలం ఝాన్సీ స్వాతంత్ర్యం భారత స్వాతంత్ర్యం కాదన్న సత్యం నీవూ కాదనవని నాకు తెలుసు. ప్రస్తుతం ఉత్తరహిందూస్థాన స్వాతంత్ర్య సమరాన్ని నడుపుతున్న బహాదూర్ షాతోనూ, మధ్య హిందూస్థాన స్వాతంత్ర్యపు పోరాటాన్ని సాగిస్తున్న

నానాసాహెబ్‌తోనూ మనం చేతులు కల్పితే, త్రిమూర్తులు కలిసి సాధింపలేని పనినికూడా మనం సాధించగలమని నాకు తోస్తున్నది. అంతిమ నిర్ణయం నీదే సుమా! ఆలోచించు. అంతా ఈశ్వరాజ్ఞ.

గురు: (కొంచెం ఆలోచించి) ఈ సలహా నాకూ సమ్మతంగానే వుంది; మహారాణీ! కాని, ఝాన్సీ స్వాతంత్ర్య స్థాపన ఈ గురుబక్ష్‌సింగు చేతులమీదనే జరగాలని ఈ భృత్యుని చిన్న కోరిక. పైన మీ అనుగ్రహం. (తల వంచి కత్తి దించుతాడు)

లక్ష్మి: అట్లేయగుగాక! అంతా ఈశ్వరాజ్ఞ.

గురు: మహాప్రసాదము. పెరేడు వేళ అవుతున్నది. ఇంక నాకు సెలవు. (తలవంచి నిష్క్రమిస్తాడు)

(కాశి ప్రవేశిస్తుంది)

కాశి: అమ్మా! మీ దర్శనార్థియై మన ఆస్థాన పౌరోహితుల వారు ద్వారాన వేచియున్నారు.

లక్ష్మి: అయ్యో! వెంటకొని రాకపోయావేం?

కాశి: తమరి ఆజ్ఞ కాందే! (మొగం చూస్తుంది)

లక్ష్మి: పిచ్చిపిల్లా! నిత్యం వచ్చేవారికీ ఆజ్ఞ కావాలా?

కాశి: ఇది ప్రత్యేక పరిస్థితి.

లక్ష్మి: (చిరునవ్వుతో) సరే! ప్రవేశపెట్టు.

(కాశి బయటకు వెళ్లుతుంది. ధోండోపంత్ ప్రవేశిస్తాడు)

ధోం: జయము! జయము! మహారాణులకు.

లక్ష్మి: (నవ్వుచూ) ఏ మహారాణులకు?

ధోం: ఝాన్సీ మహారాణులకు— నాయెదుట సింహాసనాసీనులై యున్న, లక్ష్మీబాయి మహారాణులకు. (ముసి ముసి నవ్వులు ఒలికిస్తాడు)

లక్ష్మి: పండిత్ జీ! మీరేమైనా కలగంటున్నారా?

ధోం: కాదు, భవిష్యత్తు గాంచుచున్నాను. త్రికాలజ్ఞుడగు ఈ ధోండోపంథ్ కలగాంచుటయా! (గర్వంతో చూస్తాడు) (పైకి గాంచి, వేళ్ళు లెక్కించి, తల పంకించి) భేష్! బృహస్పతి మీకు పదకొండింట రానున్నాడు; శని ఉచ్చలో వున్నాడు; మీరు మరల మహారాణులయ్యే యోగం మిమ్ము వెతుక్కుంటూ వస్తూవున్నది. అప్పుడు నాకు బహుమానం? (కాశీవంక ఓరకంట చూస్తాడు)

లక్ష్మి: కాశీబాయిని అంటగడ్తాను. (కాశిని చూస్తుంది— ముగ్గురూ నవ్వుకుంటారు)

ధోం: అది ఈవరకే దత్తం. మరి ప్రస్తుతం— (ఆశతో చూస్తాడు)

లక్ష్మి: ప్రస్తుతం ఇది వుంచు. (ముత్యాలహారం తీసి ఇస్తుంది)

ధోం: (లేచి అందుకొని) మహాభాగ్యం! (కండ్ల కద్దుకొని, మెళ్ళో వేసికుంటాడు— మురుస్తూ ఉబ్బి తబ్బిబ్బై చూస్తాడు)

లక్ష్మి: (తనలో) మా జోషి త్రికాలజ్ఞుడగుట అక్షరాలా సత్యం. అడుగకమున్నే నా మనసులోని ప్రశ్నకు సమాధానం చెప్పాడు. ఇక ఝాన్సీ స్వాతంత్ర్యం నిక్కం. "కాలం మహిమల దెల్యం దరమా!" అంతా ఈశ్వరాజ్ఞ. (ప్రకాశంగా) పండిత్ జీ!

ధోం: (ఉలిక్కిపడి) తల్లీ!

లక్ష్మి: ఇంకా నుంచోనే వున్నావా?

ధోం: ఔను ఔను. (నీళ్ళు నములుతూ కూర్చుంటాడు)

లక్ష్మి: మన వూరి విశేషాలేమిటో?

ధోం: నేడు నేను లేచిన వేళ చాలా మంచిది. (హారమును చూచుకొని, వేళ్ళతో తడువుతూ—) నేను నా పంచాంగం సాక్షిగా, మా ఖాసిం తన కత్తి ఖసంతో, ఆ తులసీరాం తన నిలువెత్తు కర్రమీద వొట్టుపెట్టుకొని, ఝాన్సీరాజ్యం సాధిస్తామని శపథాలు చేశాం— మా మా వర్గవీరులను ఆ స్వాతంత్ర్య సమరానికి సమకూరుస్తున్నాం— వారిని సర్వవిధాలా సన్నద్ధం చేస్తున్నాం— తత్కార్య సాఫల్య మునకు ఇంకను ప్రయత్నాలు చేయనున్నాం. పోయి వస్తా— సెలవు— (పోబోతూ గిర్రున వెనుకకు తిరిగి) చెప్పనే మర్చాను. మేమందరం కల్సి నినాదాలుకూడా చేశాం— (తల గోక్కొని) మొగల్ సల్తనత్— కాదు కాదు— పీష్వా రాజ్యం— ఊఁహూ! అదీ కాదు— ఆఁ! ఆఁ! ఝాన్సీ రాజ్యం— సాధిస్తాం!

మహారాణి లక్ష్మీబాయికి— జై!
భారత స్వాతంత్ర్యం— జిందాబాద్!
కంపనీ సర్కార్— ముర్దాబాద్!'— అని

శిక్షణకు వేళైంది- (కాసె సవరించుకుంటూ పరుగు తీస్తాడు— లక్ష్మీబాయి కాశీలు నవ్వుతారు)

లక్ష్మీ: (తనలో) డెందమా! తొందరపడకు. (ప్రకాశంగా) అంతా ఈశ్వరాజ్ఞ. కాశీ! మాకును కత్తిసాముకు సమయం ఆసన్నమౌతున్నది. సర్వం సన్నాహపరుపుము.

కాశి: చిత్తం! చిత్తం!

(ఇద్దరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

## చతుర్థ రంగం

ప్రదేశం: ఊరిబయట దుర్గామందిరం

ప్రవేశం: ధోండోపంథ్ విచారంతో (స్వగతం)

ధోం: ప్రతి వ్యక్తికి దేశసేవ కర్తవ్యం ముఖ్యమూనూ, వ్యక్తులయొక్క కూడికయే సంఘం, సంఘాల చేరికయే దేశం. కనుక వ్యక్తిసేవ అతి ముఖ్యం- వ్యక్తి పొట్టనిండితేకాని వ్యక్తిత్వం నిల్పుకోలేడు- కావున, పొట్టసేవ ముఖ్యాతి ముఖ్యం. పొట్ట నిండాల్నంటే ఓ ఇల్లు కావాలి- ఆ ఇల్లును చక్కదిద్దటానికో యిల్లాలుండాలి. అందుకే,

"ఒంటరి సంసారం బిడి
కంటకతుల్యంబు మిగుల కష్టము గడపన్
జంటం గూరిచియు మరల
నింటియతని జేయరే మునీశ్వరులారా!"

అని, శివునంతటివాడు సప్తఋషులను వేడుతూ ద్వితీయ కళత్రానికై తహతహలాడాడు_ అంటే నాదో లెక్కా? 'శ్రీరామ సేనలో బోడకోతి'ని. నా ప్రథమ కళత్రం_ నా మేనమామ కూతురు_ నా వారణాసిని తలుస్తుంటే నా కడుపు తరుక్కోపోతుంది. (కంట తడిపెడతాడు) దాని వియోగ దుఃఖంలో దినాలు యుగాలుగా గడుపుతున్నాను. దాని అంతిమ సందేశం ప్రకారం దాని చెల్లె కాశిని చేపట్టుటకు నిశ్చయించుకున్నాను. కాశి తన అక్కను మరపించగలదు; కాని, కాశి మనసు తెలియకున్నది. మొన్న పూదోటలో నా భరతం పట్టించి జారుకున్నది. పాపం! పిల్లకాయి లక్షణం ఇంకా పోలేదు.

కాశి: (చాటుగా ప్రవేశించి, ముందుకు చూచి_ తనలో) ఓహో! మా బావకెప్పుడూ నా గురించే ఆలోచన. కాశియే స్నానం_ కాశియే పానం, కాశియే ధ్యానం_ కాశియే ధ్యేయం. ఇట్టి బావను నేను భర్తగా పొందటం నా అదృష్టం. దీనికి నా తలిదండ్రుల సమ్మతీ, మహారాణులవారి ఆశీర్వాదమూ లభించుట మహాభాగ్యం. కాని

మా వివాహానికి స్వాతంత్ర్య సమరం అడ్డు నిల్చింది. నా ప్రేమలో బావ దినదినం పిచ్చివాడై పోతున్నాడు. అతణ్ణి కార్యోన్ముఖుణ్ణి చేయడం నా ప్రథమ కర్తవ్యం. అదిగో, బావ నన్ను గురించే ఏదో ప్రసంగిస్తున్నాడు; విందునుగాక! (ఆలకిస్తూ వుంటుంది)

ధోం: (కాశి రాకను గమనించినవాడై— తనలో) ఓహో! నా ప్రేమదేవత స్మరించినది తడవుగా ప్రసన్నమైంది. ఆమె మనోనిశ్చయం తెల్సుకుంటానికి ఒక బూటకపు నాటకమాడెదగాక! (ప్రకాశంగా గొంతెత్తి) ఓ నా ప్రేమదేవతా! ఇంత కాలంగా నీ కొరకు నిద్రాహారాలు మాని తపించుచున్నాడను, కాని నీవు మాత్రం ఈ దీనుని మొరాలకించకున్నావు. నేటితో నా తపస్సుకు భరత వాక్యం పల్కబోతున్నాను. మూడు వెంచేవరకు నాకు ప్రసన్నం కావాలి— వరమీయాలి. (ఇటు అటు చూచి చేతిలో గుండ్రాయిని తీసుకుని) లేనిచో ఇదే గుండుతో— ఈ గుండును (తల చూపిస్తాడు) బ్రద్దలు చేసుకొని ఈ ప్రేమదేవతకు బలి అవుతాను. ఒకటి— (ఓరకంటితో మెల్లిగా కాశీవైపు చూస్తుంటాడు.) రెండు— (గుండును ఎత్తిన చేతిలో ఆడిస్తూ.) మూ— (తల బాదుకొన సిద్ధపడ్తాడు.)

కాశి: (తటాలున గుండు అందుకొని అభయ ముద్రతో)

భక్తా! నీ భక్తికి మెచ్చితిని. ఇచ్చితిని నీ ఇచ్ఛకు వచ్చిన వరము_ కోరుకొమ్ము_ ఒక్కటియే! (తర్జనితో చూపును)

ధోం: (కన్నులు తెరచి, లోన మురుస్తూ) ఆహా! దేవీ! భక్త ప్రియా! దీనవత్సలా! నీవు నా అర్ధాంగివై కరుణించు.

కాశి: తథాస్తు! అనుగ్రహించితిని పొమ్ము.

ధోం: (లేచి) దేవీ! మహాప్రసాదము! నా హృదయపీఠమును అలంకరించుము. (చేతులు చాచుకొని కౌగిలించుకోపోతాడు)

కాశి: (తప్పించుకొని_ పకపక నవ్వుతూ) భక్తా! ఇంత తొందరా! (ముక్కుమీద వేలు వేసుకొని కొంటెగా చూస్తుంది)

ధోం: దేవతలు అబద్ధమాడరు.

కాశి: ముమ్మాటికి ఆడరు.

ధోం: ప్రేమ గుడిని తెరచి పెడితివే_ దేవి! నా ప్ర,
వేశమునకు నడ్డు పడితివే_

కాశి: శపథమైతె పూర్తిచేయుమా_ బావ! అపుడు
స్వాగతంబు పల్కెద వినుమా_

లక్ష్మి: (తటాలున ప్రవేశించి) అవును_ శపథము శపథమే! మీ ప్రేమాయణానికి అంతరాయం కల్గించినందులకు చింతిస్తున్నాము. (ఆప్యాయంగా చూస్తుంది)

కాశీ ధోండోపంథ్‌లు: (సిగ్గున తలలు వాలుస్తారు) స్వాగతం! మహారాణులకు (ఆహ్వానిస్తారు)

లక్ష్మి: బావా మరదండ్ర ప్రేమ మాటలు మాకు హర్షపు మూటలు. సరే! (తన కంఠహారం కాశికి అందిస్తుంది) పంథ్! తన కంఠహారం చేత గొనుగాక! (అతడు అట్లా చేస్తాడు) ప్రేమికులు తమ చేతి హారాలచే ప్రియుల కంఠాలను అలంకరింతురుగాక! (వారు అట్లే చేస్తారు) ఇప్పుడు మీ వివాహం నిశ్చయమైంది. దీనికి శాస్త్రముద్ర పడుట స్వాతంత్ర్య సమరానంతరమే సుమా!

కాశీ పంథులు: ధన్యులం! ధన్యులం! (కృతజ్ఞతాపూర్వకంగా మహారాణికి పాదాభివందనం చేస్తారు)

లక్ష్మి: (చిరునవ్వుతో) చిలుకా గోరెంకల్లా నిండా నూరేండ్లు ఆదర్శదంపతులై వర్ధిల్లుదురుగాక! (ఆశీర్వదిస్తుంది)

కాశీ పంథులు: (ఒండొరులపై ప్రేమదృక్కులు ప్రసరించుకుంటారు.)

(అందరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

---

## ద్వితీయాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: ఢిల్లీలో బహాదుర్‌షా మహల్

ప్రవేశం: బహాదుర్‌షా, అమీర్‌ఖాన్, ముల్లాసాహెబ్‌లు ఆసీనులై —

బహా: దోస్తో! మీకు స్వాగతం! మీరు వంశపరంపరగా మా మొగలాయి చక్రవర్తులను సేవిస్తూ వస్తున్నారు. ఈ దుర్దినాలలోకూడా మమ్ములను విడువక కొలుస్తున్నారు. మీకు కృతజ్ఞతలు. హిందూస్థానమును ఏకచ్ఛత్రముగా పాలించిన మొగలాయి వంశపు రారాజు కంపనీ వాండ్లిచ్చు భరణమును గ్రహించి, ముండమోపి బతుకు బ్రతకాల్సివచ్చినందులకు తక్దీరును ఏమని దూరాలి? హాయ్! బద్బక్తీ! (నిట్టూర్పు విడుస్తాడు)

1752 ఈనవీలో ఇంగ్లిషువాళ్ళు వ్యాపారంకోసం హుకుం తీసుకోటానికి వచ్చినప్పుడు వారి దగ్గర మూడు కొట్లు, ఇరువది చదరపు మైళ్ళ భూమి మాత్రమే ఉండె. దాదాపు నూరు సంవత్సరాల పిదప నేడో 6,50,000 చ. మైళ్ళ భూమికి స్వాములైనారు. ఏ వంశపు సామ్రాట్టుల మ్రోల చేతులు మోడ్చి, జీ హుజూర్! అని నిల్చొని యుండిరో, ఆ వంశపు షాహెన్షాయే నేడు వారికి దాసోహమ్మనవలసి వస్తున్నది.

అమీ: జహాఁపనాహ్! గడచినదానికి వగచుట ధీరుల లక్షణం కాదు. కాలం మారుతున్నది, మారనున్నది. అల్లా తలచిన మరల మీ రాజ్యం మీకు వస్తుంది తప్పక.

బహా: గతం తలచుకొన్న అది ఒక స్వప్నమా అనిపిస్తున్నది.

అమీ: ఖుదావంద్! గుస్తాకీ మాఫ్! ఈ తాబేదార్ మొగలాయి సల్తనత్‌ను పునరుద్ధరించుటకు సర్వవిధ సన్నాహాలు జరుపుతున్నాడు. ఇక సర్కార్ హుకుం ఒక్కటే నట్టున్నది. ఎవరి నమక్ తిని ఈ శరీరం పెరిగిందో వారికొరకే దీనిని ధారపోయుటానికి ఈ బంద తయ్యార్ వున్నాడు. (తలవంచుతాడు)

బహా: భాయీ! నీ మాటలు మాకు అర్థమవటంలేదు. అంతా అయోమయంగా వుంది. మిగిలిన దినాలు అల్లాను యాదిచేస్తూ గడుపుదామనిపిస్తుంది.

ముల్లా: బందగాన్‌ఆలా! మీరట్లా సెలవిస్తే మేమేమనగలం? మా గతేమి? ఈ కాఫిర్ల రాజ్యంలో మేం ఒక్క క్షణం కూడా బతకలేం. ఈ పాడు హుకూమత్‌లో 'బైబులు' చదువాలిట_ తోబా! తోబా! (చెంపలు వేసుకుంటాడు) 'ఖురాన్‌పాక్' కు గౌరవం లేదాయె. మస్జిదులను చూచే రాజు లేడాయె.

అమీ: ఔను సర్కార్! ముల్లాసాహెబ్ చెప్పిన మాటలు అక్షరాల సత్యాలు. మనవారికి హవాల్దారుకంటే పెద్ద ఉద్యోగమే లేదట!

ముల్లా: సువ్వర్ చర్బీతో కూడిన తూటాలే వాడాలిట. ఈ బద్మాష్ కంపనీ సర్కారును ఎప్పుడు కఫన్ కప్పి దఫన్ చేస్తారో!

అమీ: ఈ కంపనీ సర్కారుకు తమ పొట్ట నింపుకోవడమే తెలుసు; కాని దేశం వృద్ధికాని, ప్రజల క్షేమంకాని, పట్టనే పట్టదు.

జహా: జల్సాలు, ముషాయిరాలు జంగల్ పాలయ్యాయి.

ముల్లా: ముర్షిదులను, పీర్లను పోషించే నాథుడే లేడాయె. హాయ్! ఎంత పాపం జమానా వచ్చింది.

జహా: ముతబన్నాలు నామంజూర్ చేసి, వజీఫాలు రద్దు చేసి, క్రమంగా సంస్థానాలను అక్రమంగా కంపనీలో కలుపుకోవడం— ఎంత అన్యాయం! ఎంత స్వార్థం! సంస్థానాధిపతులందరూ భయపడుతున్నారు— ఎప్పుడు ఎవరిమీద ఏం పిడుగు వచ్చి పడుతుందో— అని.

అమీ: మిగిలిన సంస్థానాధిపతులు, పెన్షను పుచ్చుకుంటున్న రాజులు, ఉద్యోగాలు కోల్పోయిన దేశీ సిపాయిలు, కంపనీ కొలువులో వున్న హిందూ ముస్లిం సిపాయిలు అందరూ తిరుగుబాటుకు తయ్యార్ వున్నారు హుజూర్!

ముల్లా: ఈ జహాదుకు, తమరు నాయకులుగా నిలువాలని మా ఇస్తెదువా. (ప్రార్థన) అల్లా హో అక్బర్! (మోకాళ్ళపై వంగి అదాబ్ చేస్తాడు)

అమీ: ఈ గులాముల కోర్కెను షాహెంషా సలామత్ కాదనరని మా విశ్వాసం. (నిల్చి కత్తి చేతనెత్తి) ఈ మొగల్

సల్తనత్ కోసం ఈ వఫాదార్ తాబేదార్, అమ్మీర్ ఖాన్ తన అనుచరులతోసహా ప్రాణాలుగూడ అర్పించటానికి వెనుకాడడు అని, ఈ కత్తిసాక్షిగా శపథం చేస్తున్నాడు.

(తలవంచి ఎత్తును)

ముల్లా: ఈ ఖురాన్‌పాక్ ఖసంగా, ఈ పవిత్ర జహాద్‌లో పాల్గొని తిరిగి మొగలాయి సల్తనత్ స్థాపిస్తామని మన ముసల్మానులందరి తరఫున నేను ప్రమాణం చేస్తున్నాను.

బహా: అల్లా మీ ప్రయత్నాలను సఫలం చేయుగాక!

ముల్లా: అమీన్. (తథాస్తు)

అమీ: షాహెన్‌షా బహాదుర్‌షా కి జై!

ముల్లా: మొగల్ సల్తనత్— జిందాబాద్!

(అందరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

---

## ద్వితీయ రంగం

ప్రదేశం: నానాసాహెబ్ భవనం

ప్రవేశం: నానాసాహెబ్

నానా: (నిట్టూర్పువిడుస్తూ— స్వగతం) అహో! పీష్వా ఛత్రపతుల ఆ మహోన్నత దశ, ఢిల్లీ చక్రవర్తులను కీలుబొమ్మలుగా ఆడించిన ఆ ఉజ్జ్వల దినాలు— స్వప్నదృశ్యాల్లా అవాస్తవములైనాయిగదా! అట్టి మహారాష్ట్రుల ఐక్య బలాన్ని ఈ ముష్టి, పూసలమ్ముకునే తెల్లబేర

గాంగ్రుడు తమ భేదోపాయంతో చీల్చి, ఒక్కరొక్కరినే దాసోహమ్మనిపించుకొంటున్నారు. మా తండ్రిని, బాజీ రావు పులినికూడా స్నేహసంధి యను వలలో పట్టివే శారు. వారి మాటలు నీళ్ళమూటలు– వారి సంధిపత్రాలు చెత్తబుట్టలోని చిత్తుకాగితాలు. ఏదో కుంటిసాకుతో పీష్వా రాజ్యంనే స్వాహాచేసి, మా తండ్రికి భరణం ఏర్పాటు చేశారు. తండ్రి అనంతరం నా దత్తత క్రమ బద్ధం కాదని ఆ ముండగ్రాసంకూడా రద్దుపరిచారు. ఎంత ద్రోహం! ఎంత మోసం! ఈ పాపిష్టి కంపనీని ఏం చేసినా కసితీరదు. ఈ పీష్వా సింహం కాలజాలమున కట్టువడి వున్నది. ప్రతీకారానికి అదనగు శుభసూచకాలే కాన వస్తున్నాయి. ఎల్లయెడల కంపని రాచరికం ఎడల అసంతృప్తియే బయలుదేరింది. రాజ్యాలు కోల్పోయిన సంస్థానాధీశుల కోపాగ్నిజ్వాలలు మిన్నుముడుతు న్నాయి. కంపనీ దేశీయ సైనికులు, సంస్థానాల మాజీ సిపాయిలు కంపని రాజ్యాన్ని అమాంతం కూకటివ్రే ళ్ళతో పెల్లగించ సిద్ధంగా వున్నారు. వారికి బలిష్ఠమైన నాయకత్వమే కావాల్సి వుంది ఇప్పుడు.

(విదూషకుడు హుటాహుటిగా ప్రవేశిస్తాడు)

విదూ: ప్రభూ! జయము! జయము! కంపనీ దేశీ సిపా యిల తిరుగుబాటు సన్నాహాలు సర్వం సిద్ధమయ్యా

యట. దానికి రహస్య చిహ్నమగు చపాతీల రవాణని కూడా పూర్తయిందట. ఇది మా మేనబావమరిది, హవాల్దార్ చమన్‌లాల్ నా చెవిలో చెప్పిన రహస్య సమాచారం. ఇది ఎవ్వరికి చెప్పవద్దని చేతిలో చేయి కూడా వేయించుకున్నాడు. (భయపడుతూ) బుద్ధి గడ్డితిన్నది. తెల్లవారికి తెలిస్తే నా తల– నా తల (తలపట్టుకొని కంగారుగా తిరుగుతాడు)

నానా: ఏమైందోయ్, నీ తలకు?

విదూ: నా తల (తల పుణుకొంటూ) లేదు; ప్రభూ! లేదు. రక్షించండి! రక్షించండి! నా భార్య పసుపుకుంకుమ నిల్పండి! నా సతీమణికి నే నేకైక భర్తను. (కాళ్లు పట్టుకొని ఏడుస్తాడు)

నానా: నీవంటి పిరికి బంట్లు మూలాన్నే స్వరాజ్యం మంట గల్సింది. (వీపు తడుతూ) జడియవాకు; తెల్లవాళ్ళు ఇప్పుడు మన వంట ఇంటి కుందేళ్ళు. వారికి ఇప్పుడు మన హిందూమహాసముద్రమే శరణ్యం. ఈ నానా సాహెబ్ పులివాత పడకుండా ఒక్క తెల్ల కుందేలు కూడా తప్పించుకోగలదా? (మీసంమీద చేయివేస్తాడు)

విదూ: నిజం, మహారాజా! నిజం. ఇప్పుడే ఆ కుందేళ్ళను పట్టి ముక్కలు ముక్కలుగా నరికి, కాకులకు గద్దలకు సంతర్పణం చేస్తాను. (బింకంతో) ఏదీ నా కత్తి? (ఇటూ అటూ ఉరుకుతాడు)

నానా: నీ ఆగడం చాలు కానీ, మన తాంత్యా వస్తానన్న వేళ మీరింది. ఏదీ కొంచెం జాడ కనుక్కో.

(దౌవారికుడు ప్రవేశిస్తాడు)

దౌవా: (తలవంచి) తాంత్యాసాహెబ్ ద్వారం దగ్గర తమరి ఆజ్ఞకై వేచివున్నారు ప్రభూ!

నానా: వెంటనే ప్రవేశపెట్టు.

(దౌవారికుడు నిష్క్రమిస్తాడు- తాంత్యా ప్రవేశిస్తాడు)

తాంత్యా: (జోహార్లర్పించి) విజయోస్తు! పీష్వా మహారాజులుంగారికి. మీ ఆజ్ఞానుసారము సర్వ సన్నాహాలు పూర్తి ఐనాయి. మీరు ఊఁ అంటే చాలు- ఈ తెల్ల పిల్లులను మంగలంలో పేలాల్లా పలపల వేయించి, మాడ్చి మసిబొగ్గు చేస్తాను. వారికి తాంత్యా అంటే సింహస్వప్నం. హుఁ!

నానా: తోపే! నీ ధైర్యసాహసాలు మేమెరుగనివి కావు. ఈ స్వాతంత్ర్య సమరానికి నిన్ను సర్వ సైన్యాధ్యక్షునిగా నియమిస్తున్నాము. నా తమ్ముడు, రావుసాహెబ్ నీకు అండగా నిలుస్తాడు. నీ పరాక్రమానికి తోడు నా సర్వ ధనం దత్తం చేస్తున్నాము. ఇదిగో, విజయసూచకంగా ఈ చంద్రహాసంను బహూకరిస్తున్నాము. (ఖడ్గం ప్రసాదిస్తాడు)

తాంత్యా: (లేచి, తలవంచి కత్తినందుకొని, కళ్ళకద్దుకొని)

మహాప్రసాదము! మహారాష్ట్ర రాజ్యాన్ని సాధించి పునః పీష్వా మహారాజును, సింహాసనాధిష్ఠుని చేయుటానికి నా ప్రాణాల నయితం అర్పిస్తానని ఈ కృపాణం సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను.

విదూ: ఈ జందెం సాక్షిగా నేనూ ప్రమాణం చేస్తున్నాను.

నానా: (లేచి, తాంత్యాను కౌగిలించుకొని) సెబాస్! దేశాభిమానమన్నా, ప్రభుభక్తియన్నా ఇట్లుండాలి. నువ్వు అట్టి సమర్థుడవే యని మా ప్రగాఢ విశ్వాసం. నిన్ను జయలక్ష్మి వరించుగాక!

విదూ: తథాస్తు! (అందరు కూర్చుంటారు)

దౌవారికుడు: (ప్రవేశించి) ఝాన్సీ నుండి వచ్చిన వార్తాహరుడు దర్బారు ప్రవేశం కోరుతున్నాడు. ప్రభూ!

నానా: తత్క్షణం ప్రవేశపెట్టు.

(దౌవారికుడు వెళ్ళిపోతాడు.)

తాంత్యా: ఆడవాండ్లుకూడా రాయబారాలే!

రాయబారి: (ప్రవేశించి- వినీతుడై) జయము! జయము! మహారాజా! ఇది మా మహారాణులవారి సందేశం. (పత్రం సమర్పిస్తాడు)

నానా: (తాంత్యాను ఉద్దేశించి) చదువు; ఆ సందేశం ఏమో? విందుముగాక!

తాంత్యా: (అందుకొని చదువుతాడు) "శ్రీ శ్రీ శ్రీ పీష్వా

సర్కారువారికి ప్రణామపూర్వకంగా వ్రాసుకొను విజ్ఞాపనం— తమరు తెల్ల పిశాచాలను పారదోలి పునః పీష్వా సామ్రాజ్యం స్థాపింప సర్వసన్నద్ధులై యున్నారని విని చాల సంతసిస్తున్నాము. మేమున్నూ, మా ప్రజలూను ఈ తరుణంలో తెల్లవారి దాస్యశృంఖలాలను తెంపివేసుకోటానికి మిక్కిలి ఉత్కంఠతతో వున్నాం. ఈ స్వాతంత్ర్య సమర యజ్ఞ నిర్వహణయందు మమ్మును మీతో కలియుటకు అనుగ్రహింతురుగాక! యని ప్రార్థిస్తున్నాం. ఇట్లు, విధేయురాలు— ఝాన్సీ లక్ష్మీబాయి."

నానా: అహా! యేమి దైవయోగం! ఈమె మనతో చేతులు కలుపుటవల్ల మన బలం ఇమ్మడైంది. ఈమె బుద్ధికుశలత, యుద్ధనైపుణ్యం పురుషులనుకూడా మించుతుందని ప్రతీతి. ఈయమ సర్వసైన్యాధిపత్యానికికూడా సమర్థురాలు—

తాంత్యా: (మధ్య అందుకొని— ముఖం చిట్లిస్తూ) మీకొక అబల బలంపై ఇంత విశ్వాసం వుంటే— క్షణంపూర్వం మీరు నాకు ప్రసాదించిన సర్వసైన్యాధ్యక్ష పదవినుండి విరమించుకొంటున్నాను. ఆ పదవి ఆమెకే అనుగ్రహింతురుగాక! నేను మాత్రం ఓ ఆడుదాని చేతిక్రింద పని చేయజాల— క్షమించండి! (కత్తి తిరిగి యివ్వబోతాడు)

నానా: (ఆపి) ఓ స్వాతంత్ర్యసమర సర్వసైన్యాధ్యక్షా!

తొందరపడెదవేల? పీష్వా మహారాజులు ఇచ్చిన దానిని తిరిగి పుచ్చుకొనుట ఎందేని గంటివా? నా మాట పూర్తిగా వినకముందే ఓ నిర్ణయానికి వచ్చుట నీ వంటి ధీశాలికి తగునా? "ఈయమ సర్వసైన్యాధిపత్యానికి కూడా సమర్థురాలు" అని కొందరి భావముండనోపునని అనుకుంటిమి. అంతే!_ (బింకంతో) ఛత్రపతి శివాజీ స్థాపించిన ఈ మహారాష్ట్ర సామ్రాజ్యం ఏకఛత్రంగా పరిపాలించిన ఈ పీష్వా మహారాజులు ఒక స్త్రీని తమ సర్వసైన్యాధిపతినిగా స్వీకరించి, తమ శాశ్వత కీర్తికి కళంకం ఆపాదించుకుంటారని ఎట్లా విశ్వసించితివి? అది కలలోకూడా అసంభవం. ఆమె మన స్వాధీనం లోనే, తోపే నేతృత్వంలోనే యుద్ధం నడుపగలందులకు ఇప్పుడే ఫరమానా జారీచేయిస్తున్నాము. మరువకుము, మన విజయయాత్ర కాన్పూరునుండి రేపే ప్రారంభం కావాలి.

తాంత్యా: మీకు ఆ చింత అనవసరం. దానికి కావలసిన సర్వ సన్నాహాలు సంసిద్ధాలు. ఆ భారమంతా నాపై వదలండి. ఇక సెలవు.

నానా: విజయీభవ!

విదూ: తథాస్తు!

(అందరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: చమన్‌లాల్ హవాల్దార్ ఇంట్లో వరాండా

ప్రవేశం: చమన్‌లాల్_ అతని భార్య మాధురి

చమన్: సఖీ! తొందరగా విడం కట్టిస్తూ! సత్వరంగా పోవాలి.

మాధు: ఏమండీ. ఎప్పుడూ తొందరే! ఒక్క గడియసేపైన మనసారా మాట్లాడుకోడానికికూడా తీరిక లేదాయె. మా పెద్దల పుణ్యాన నేడెలాగో అన్నం తినుటకుమాత్రం అవకాశం చిక్కింది మీకు.

చమన్: అవును ప్రియా! మా సిపాయీల జీవితం ఇంతే. పొట్టకోసం ప్రాణాలు అమ్ముకున్నవారికి సంసార సుఖాలెక్కడివి?_ అదీ యుద్ధ సమయాల్లో.

మాధు: అయ్యో! నా తెలివి తెల్లారా! తెల్లవారిని ఓడించి, యుద్ధంలో విజయం పొందామని_ బహద్దుర్‌షాహ్ పట్టాభిషేకోత్సవాలని చెప్పితిరికదా! ఇంకా యుద్ధాలేంటివి?

చమన్: నెచ్చెలీ! అదికాదు, మా సిపాయిలలో పెక్కురు, సర్దారులలో దాదాపు అందరూను కృతార్థులం అయితిమను గర్వంతో కర్తవ్యం మరచి వున్నారు. తెల్లవారు సామాన్యులు కారు. వారిని ఏమరి వుండరాదు. కాని మాబోటివారల మాటల వెక్కిరిస్తారు_ మమ్ము ఉత్త పిరికిపందలక్రింద లెక్కిస్తారు. ఏదీ పీడెం ? (లేచి చేయిజాపుతాడు)

మాధు: అయ్యో! నా తెలివి తెల్లారా! మాటల సందర్భంలో మరిచాను. ఇప్పుడే యిస్తాను. (పాన్‌దాన్ తెరిచి) అయ్యో! సున్నం నిండుకుంది. ఎవరే? శశీ! పొరుగింటి కెళ్ళి కాస్త సున్నం పట్రా. (వక్కలు కత్తిరిస్తూవుంటుంది)

చమన్: సరే! బజారులోనే వేసుకుంటాను. (పోబోతాడు)

మాధు: (చేయి గ్రహించి, బ్రతిమాలు చూపుతో) విడం తీసుకోకుంటే నాతోడే! అరే! శశీ! (భర్త మొగమై) అయ్యో! నా తెలివి తెల్లారా! మరిచాను_ సున్నం వచ్చేం తలో మీ విజయగాథ కాస్త వినిపింపరూ! యుద్ధరం గాలు మా కండ్లార చూచే భాగ్యమా మాకు లేదాయె. కనీసం వినుటకైనా నోచుకోకూడదా?

చమన్: మా స్వాతంత్ర్య సమర గాథ చాలా దీర్ఘమైంది. ఈ స్వల్పకాలంలో చెప్పతగింది కాదు. రాత్రి ప్రశాం తంగా వినిపిస్తాను.

మాధు: ఇప్పుడు మాత్రం క్లుప్తంగా వినచేయండి. ఇంతట్లో తాంబూలం సిద్ధం అవుతుంది. ఊఁ మొదలెట్టండి.

చమన్: ఉత్తర హిందూస్థానంలోకెల్లా పెద్ద ఛావనీయైన మీరట్‌లో ఇది_ పూర్వ నిర్ణయం ప్రకారం 10_6_1857 6 గం. ఉదయం ప్రారంభం ఐంది. పెరేడు సమయం లో సిపాయిలు ఆవు క్రొవ్వు మరియు పంది క్రొవ్వు సంపర్కంగల తూటాలను ముట్టుటకు నిరాకరించారు.

మాధు: హిందువైనవాడు ప్రాణం వదుల్తాడు కాని, ధర్మం విడువలేడు.

చమన్: (తన సంభాషణ సాగిస్తూ) వెంటనే ఆఫీసర్లను కాల్చివేశారు. మిగతా సోల్జర్లను పిట్టలవలె పటపట కూల్చివేశారు. వారి స్త్రీలను, పిల్లలనుకూడా మిగులకుండా కాల్చివేశారు—

మాధు: (మధ్యలో) శివ! శివ! ఎంత అధర్మం! ఎంత క్రౌర్యం!

చమన్: నిజమే. కాని, ఆ ఆవేశంలో పురుషుడు వివేకం కోల్పోతాడు.

మాధు! అవును, వాళ్లు మనకు చేసిన అన్యాయానికిది ప్రతీకారం కామోసు. తరువాయి— తరువాయి—

చమన్: ఏముంది? విజయశంఖాలు పూరిస్తూ అక్కడినుండి ఢిల్లీకి ప్రయాణం సాగించారు. త్రోవలో అనేకులు స్వాతంత్ర్యసమర వీరులు జయజయధ్వానాలు చేస్తూ వారితో కలుసుకొన్నారు. "మొగల్ సల్తనత్ జిందాబాద్!"— "షహెన్షా బహాదుర్షా జిందాబాద్!" అనే కేకలు మిన్నుముట్ట— ఢిల్లీలో ప్రవేశించారు. ఢిల్లీ పౌరులు వారికి ఘనస్వాగతం పలికారు. అక్కడ ఉన్న తెల్లవారు చాలావరకు హతమార్చబడ్డారు. మిగిలిన వారు ఒక్క బలం చూపారు. అంతట రాజమహల్లో

ప్రవేశించి, ఎనభై యేండ్ల ముసలిపంకగు బహాదుర్ షాను సింహాసనమున అలంకరింప చేసారు. అదే నేటి ఉత్సవం. అదిగో ఊరేగింపు ఇటు వస్తూవున్నది. మాటల సందడిలో సమయమే తెలియకపోయె. (వెళ్ళనుంకిస్తాడు)

మాధు: అయ్యో! నా తెలివి తెల్లారా! మరిచాను_ ఇదిగో విడియం (అందిస్తుంది.) చూచార్గా; సున్నం సిందిం దను నెపం మిమ్ముల ఆపుటకే సుమా! (నవ్వుతుంది)

చమన్: టూ! టూ! (చెయ్యి వూపుతూ_ విడం తీసుకొని ముందుకు పోతాడు నవ్వుతూ)

మాధు: (వెనుకనుండి ఆపి) మర్చిపోకండి. మీ కందరకు నేడు పారితోషకాలు వసగుతాదంటిరి_ ఒక్క నెల జీతం బహుమతిగా దొరుకుతుందంటిరి_ ఆ మెడగొలుసు_ అదే మీరు రాత్రి చేయిస్తావన్నది_ తప్పక తెస్తారు గదూ! మీకు మరుపు జాస్తి_ దస్తీకి ముడివేసుకోండి. మరొచ్చా రంటే నేను వప్పుకోను_ జాగ్రత్త! (వ్రేలెత్తి చూపుతుంది)

చమన్: సర్లే! మీ ఆడవారి కెప్పుడూ నగలగొడవే! (నవ్వుతూ వెడలిపోతాడు)

మాధు: (తనలో) ఈ విప్లవకారులు ఇంతటితోనే మైమరిచి తెల్లవారినుండి రాజ్యం లాక్కున్నట్టే భ్రమపడుతు న్నారు. తాత్కాలిక విజయ గర్వాంధులై వేడుకలు, ఉత్సవాల మోజులో పడి, కర్తవ్యం విస్మరిస్తున్నారు.

"ముందున్నది ముసళ్ళ పండగ"_ "తొండా! నీ పరుగు ఎంత దూరమే?" అంటే_ "వెనుగుదాక"_ అన్నట్టుంది వీరి తెరగు.

(నిష్క్రమిస్తుంది _ తెరపడుతుంది)

---

## చతుర్థ రంగం

ప్రదేశం: బహాదుర్‌షా దర్బారు
ప్రవేశం! బహాదుర్‌షా సింహాసనంమీద_ అమీర్లు సర్దార్లు పరివేష్టించి యుంటారు

బహా: ఆహా! నేడుకదా! సుదినం. అల్లాకు మనపై పరిపూర్ణంగా మెహర్బాని వచ్చింది. అల్లా, అమీర్‌ను ఫకీరు చేస్తాడు_ ఫకీర్‌ను అమీరు చేస్తాడు_ అన్నది ఎంత సత్యం!

ముల్లా: బందగానే ఆలా, మన విజయోత్సవ సప్తాహం నేటితో విజయవంతంగా ముగుస్తున్నది. మొగలాయి సాంప్రదాయానుసారం ఈ ఉత్సవం నిర్విఘ్నంగా సాగిపోతున్నది.

బహా: నిన్నటి ముషాయిరా కార్యక్రమం సభను తన్మయంలో ముంచేసింది.

అమీ: దేవరవారు కవులు_ కవి పోషకులు_ మీ కవిత్వం విన్నప్పుడు మా శరీరాలు పులకించాయి.

బహా: సరే! నేటి కవ్వాలీ కార్యక్రమం ప్రారంభం అవుగాక!
ముల్లా: జీ, హుజూర్! అది ఇప్పుడే ప్రారంభం కాగలదు.
ఎవరురా అక్కడ?
దర్బాను: (ప్రవేశించి) జీ! హుకుం. (తలవంచుతాడు)
ముల్లా: కవ్వాలీలను ప్రవేశపెట్టుము.
దర్బాను: (తలవంచి నిష్క్రమిస్తాడు).
అమీ: దర్బారులో కవ్వాలీ వినే భాగ్యం ఎన్నటికెన్నటికి!
(మియాఅజీజ్ బృందం ప్రవేశించి, తలవంచి నిలుస్తుంది— రాజానుమతితో తమ స్థానంలో కూర్చుంటుంది— బాదుషా అమీరుఖానువైపు చూస్తాడు— అమీరుఖాన్ ప్రారంభానికి అజ్ఞ ఇస్తాడు)
మియాఅజీజ్ బృందం: (పాడుతారు చప్పట్లు చరుస్తూ)
అజీ: ఫలక్‌కే మెహర్బాని ఫరిష్తే— జమీన్‌పర్ బిర్సాతే హైఁ
అందరు: ఇన్సాన్ హైవాన్ కిడేముకోడే— సభీ యహాఁ ఖుష్ హోతే హైఁ
అజీ: బహార్ ఆయా గుల్షన్‌మేఁ నబీ— పౌదే లహ్‌లహాతే హైఁ
అం: డాల్‌డాల్ పర్ బైఠ్ పరిందే— జోష్‌మేఁ చహ్చహాతే హైఁ
అజీ: బుల్‌బుల్ బోలే మైనా బోలే— తోతే టిమ్‌టిమ్ బోలే హైఁ
అంద: కోయల్ కా మీఠా గానా హామ్— సునేకరో ఖుద్‌కో భూలే హైఁ
అజీ: ఫూల్ చమన్ మేఁ బాంకే రంగీలే— ఖిల్‌ఖిలాహట్ సే హఁస్తే హైఁ

అంద: బాద్ లూట్ కర్ ఖుష్బూ లాతీ_ సూంఘ్ కర్ హమ్
ఝూమ్తేహైఁ

అజీ: వా|్రెహెవాహ్! మాషూఖ్ ఆయీ_ మై కే జామ్ భర్
ఆతేహైఁ

అంద: లపక్ లపక్ కర్ లే పీతేహైఁ_ మస్త్ హో ఝడ్జాతేహైఁ
(మధ్యమధ్య వాహ్వాలు_ తలలూపులు_ ముకర్రర్ ఇర్షా
దులు_ చప్పట్లు వినిపిస్తుంటాయి.)

జహా: షాబాష్! చాలా బాగున్నది. వీరికి దివాణంనుండి
నూటపదార్లు బహుమానం_ (ముల్లాసాహెబ్ వైపు
చూస్తాడు_ ముల్లాసాహెబ్ అందజేస్తాడు)

అజీ: (లేచి, అందుకొని, కనులకద్దుకొని) బక్షిష్ సర్దార్ కీ.

జహా: ఖవ్వాలీ సర్దార్, మియాఅజీజ్ కు ఇది ఇనామ్_
(ముత్యాలహారం తీసి ఇస్తాడు.)

అజీ: (తలవంచి, ముందుకువచ్చి, గ్రహించి) బక్షిష్ బంద
గాన్ ఆలాకీ ! (వెనుక వెనుకకు నడుస్తాడు)

జహా: ఇక మీకు సెలవు.

(ఖవ్వాలి బృందం నిష్క్రమిస్తుంది)

దర్బాన్: (ప్రవేశించి తలవంచి) ఝూన్సీనుండి పైగామ్
వచ్చింది హుజూర్! (చేతులు కట్టుకొ నిలుచుంటాడు)

ముల్లా: ఈ పానకంలో పుడుక యేంటి? (దర్బాన్ వైపు విసు
గుతో చూస్తాడు)

బహా: సరే! ప్రవేశపెట్టు.

దర్బాన్: చిత్తం! (నిష్క్రమిస్తాడు)

వార్తాహరుడు: (ప్రవేశించి వినమ్రుడై, నజరానాయుక్తంగా పత్రం సమర్పించుకుంటాడు)

బహా: (ముల్లాసాహెబును చూస్తాడు)

ముల్లా: (పత్రం అందుకొని చదువుతాడు)

"శ్రీ శ్రీ శ్రీ మొగలాయి షహన్షావారల సముఖానికి— వందనాలు!

తెల్లవారిని పారదోలి, ఢిల్లీలో తిరిగి మొగలాయి సామ్రాజ్యం స్థాపించినారని విని సంతోషిస్తున్నాం. ఈ శుభసమయంలో, ఝాన్సీ రాజ్యం తరపున మీకు చిన్న నజరానా సమర్పించుకోటానికి గర్విస్తున్నాం. మా పౌరులంతా మీకు విధేయులై స్వాతంత్ర్య సమరం సాగించుటకు ఎంతయో ఉత్సహిస్తున్నారు. కావున తమ అనుజ్ఞతో పాటు తగు సహాయ సంపత్తిని ప్రసాదింతురుగాక యని ప్రార్థన.

ఇట్లు

తమ విశ్వాసపాత్రురాలు,

ఝాన్సీ లక్ష్మీబాయి."

బహా: స్త్రీలు స్వాతంత్ర్య సమరం నడుపుట—వాహ్వా!

అమీ: మనలను సహాయము వేడుట—భేష్!

ముల్లా: మనం ఇమ్దాద్ అందచేయుట — బహాదుర్షా!

బహా: కాదు; అమీర్ జాదో! మన దేశంలో వీరశిఖామణు లుగా ఎందరు షాహజాదీలూ, రాజకన్యలూ వాసి కెక్కలేదు? రజియాబేగం, చాంద్‌బీబీ, అహల్యాబాయి, రుద్రమదేవి మొదలైనవాళ్ళను అప్పుడే మరిచారా? లక్ష్మీబాయికూడా వీరికి ఏవిధంగానూ తీసిపోని వ్యక్తి అని నా నమ్మకం. ఆమె కోరినట్లు వెంటనే ఫర్మానా జారీ అవుగాక! వజీర్‌సాహెబ్! (ముల్లాసాహెబ్‌ను చూస్తాడు)

ముల్లా: జో హుకుమ్! జహాపనాహ్!

బహా: నమాజుకు వక్తు ఐంది. ఇంతటితో దర్బారుకు సెలవు.

(అందరూ నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

---

## తృతీయాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: ఝాన్సీ కోట మైదానం

ప్రవేశం: గురుబక్ష్‌సింగ్ సిపాయిలను మార్చింగ్ చేయిస్తూ

సిపా: (ఎడమకు చూస్తూ నడుస్తూ)

నడునడుడీ ముందులకు
అడుగులిడుడు తొందరగా
వడివడిగా చేరబోవ
వలయు మనము ఢిల్లీకి ॥నడు॥

బాహాదుర్‌షా చక్రవర్తి
నానాసాహెబ్ పీష్వా
ఝాన్సీ కీ మహారాణి
లక్ష్మీబాయీ- లక్ష్మీబాయీ ॥నడు॥
స్వాతంత్ర్యపు సమరమును
జరిపిస్తాం- జయిస్తాం
స్వారాజ్యం మనమంతా
సాధిస్తాం- స్థాపిస్తాం ॥నడు॥
(అందరు నిష్క్రమిస్తారు)

(ప్రవేశం- ధోండోపంత్, ఖాసింసాహెబులు చెరోవైపునుండి)

ఖాసిం: రాం రాం! పండిత్ జీ!

ధోం: సలాం సలాం! సాహెబ్ జీ!

ఖాసిం: మీకి జోష్యంకి సత్యంకి ఐంది- పంత్ జీ! మనకి స్వాతంత్రంకి వచ్చింది కాని-

ధోం: దాన్ని నిల్పుకోవడమే కష్టంగా తోస్తున్నది.

ఖాసిం: అవును, ఆ తెల్ల సైతాన్లకి బలంకి జమాయిట్టుకొని మళ్ళి ఎప్పుడు మీదపడ్డ పడవచ్చు భాయ్!

ధోం: కాని, మీవంటి శూరులు సిపాయిలు, గురుబక్ష్‌సింగ్ వంటి స్వామిభక్తిగల సర్దార్లు, రాంచందర్‌రావువంటి దూరదృష్టిగల మంత్రులున్నంతవరకు మనకు భయపడాల్సిన అవసరంలేదు.

ఖాసిం: కాని, కొందరు బేవఫాల్కి, నమక్‌హరాముల్కి వుండకపోరు. వారియెడల కొంచెం నిగాహ్‌కి, వుంచాలి.

ధోం: ఈ విషయంలో మన రాణీగారు చాల అప్రమత్తత తోనే వున్నారు. (ఇటు అటు చూచి మెల్లిగా) మనకు బహదుర్‌షా షహెన్షా మద్దతు మరియు నానాసాహెబు పీష్వాల సహాయంకూడా రానున్నది. ఇది ఎవరికి తెలియకూడదు సుమా!

ఖాసిం: అయితే మరిచాను, మీకి పెండ్లికి దావత్‌కి ఎప్పట్కి ఇస్తావు భాయ్!

ధోం: పెండ్లి కాందే7

ఖాసిం: మనకి స్వాతంత్ర్యంకి వచ్చింది. ఇంక ఎందుకి దేర్?

ధోం: పాపం, రాణీగారికి ఊపిరి పీల్చుటకే తీరుపాటు లేదాయె.

ఖాసిం: సరె! నాకి ఖవాత్‌కి వక్తు అయింది వెళ్తాను.

ధోం: నేను మహారాణి దర్శనానికి పోవాలి_ వస్తాను.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు _ తెరపడుతుంది)

---

## ద్వితీయ రంగం

ప్రదేశం: ఝాన్సీరాణి దర్బారు.

ప్రవేశం: లక్ష్మీబాయి, రాంచంద్రరావు, గురుబక్ష్‌సింగ్, ధోండోపంతులు_

లక్ష్మి: మహామంత్రీ! మహాసేనాపతీ! మీ అందరి అండ దండలూ, సహాయసంపత్తులవల్ల మనం తిరిగి స్థాపించుకున్న స్వరాజ్యంలో ప్రజలకు ఇప్పటికిప్పుడే సుఖ జీవన మేర్పడుతున్నది. ఖజానాకూడా మెల్ల మెల్లగా నిండుతున్నది. కాని మన స్వాతంత్ర్యపు సుస్థిరత గాలిలోని దీపంలా అల్లల్లాడుతూనే వున్నది. మనం ఏమాత్రం ఏమరినను ప్రమాదం ముంచుకొచ్చేట్టు వున్నది.

రామ: మరేం భయంలేదు_ మహారాణీ! కోటను తగురీతి బలిష్ఠం చేయించాను. కావలసిన సరకులను నిలవ చేయించాను.

ఘోం: ఖాసింఖాన్ తోపుఖాన మనకు శ్రీరామరక్ష.

గురు: మన సైన్యాల సంఖ్యకూడా పెరిగింది. వారికి శిక్షణ కూడ సక్రమంగా జరుగుతున్నది.

లక్ష్మి: బహదుర్‌షాను ఖైదుచేసి, రంగూనుకు పంపారనియు, మొగలాయి వంశమును నిర్మూలించుటకై ఇద్దరు షాహజాదాలను కాల్చి చంపారనియు, నానాసాహెబును కాన్పూరునుండి తరిమివేశారనియు, ఉత్తర హిందూస్థానంలో మరల కంపని జండా ఎగురుతున్నదనియు చారులవలన వార్తలందాయి. ఇప్పుడు వారి పూర్తి దృష్టి మధ్య హిందూస్థానంపై మరలింది. అందు మొదటి దెబ్బ ఝాన్సీపైనే పడగలదు. మనం అప్రమత్తులమై యుండాలి.

రామ: మహారాణులవారి మార్గదర్శకత్వంలో ఈ పదకొండు మాసాల కొలది కాలంలోనే అనుకున్నదానికన్న ఎక్కువ ప్రమాణంలో సర్వసన్నద్ధులం ఐనాం- ఉత్పత్తులు పెంచుకున్నాం- భాండాగారంనుండి ముప్పాతికపాలు యుద్ధవ్యయంక్రింద కెటాయించాం- మన ప్రజలలో వర్ణభేదంకాని, కక్షలుకాని లేవు. అందరు స్త్రీలూ పురుషులు- ఝాన్సీ స్వాతంత్ర్య రక్షణకై తమ ప్రాణాలైనా అర్పించటానికి సిద్ధంగా వున్నారు.

గురు: మన రాజ్యంలో స్త్రీ పురుష విచక్షణ లేకుండా సుశిక్షితులై యుద్ధంలో పాల్గొనుటకు ఉవిళ్ళూరుతున్నారు పౌరులు.

లక్ష్మి: ఇట్టి ఐకమత్యం, దేశాభిమానం, స్వాతంత్ర్య దీక్ష, రాజభక్తి దేశమందంతటా వున్న మనకీ దుర్దశ రాకుండా వుండేదిగదా!

రామ: బహునాయకత్వం- నాయకులలో గల అసమర్థత, పరస్పర ఈర్ష్య- దేశద్రోహ బుద్ధి, ఇవియే మన ప్రస్తుతపు ఓటమికి ముఖ్య కారణాలు.

గురు: మనలో కొందరు- హైద్రాబాద్ సాలార్‌జంగు, గ్వాలియర్ దినకర్‌రావు మున్నగు సర్దారులవంటి దేశద్రోహులు ఇంగ్లీషువారి చెప్పుచేతల్లో వుండి, మనపైకి కత్తికడుతున్నారు. ఎంత దురదృష్టం!

లక్ష్మి: అవును. అఫగనిస్థాన్ పఠానులు, పంజాబ్ సిక్కులు, నేపాల్ గుర్ఖాల సహాయంతోనేకదా చేజారిన రాజ్యంను తిరిగి సాధించుకోగల్గింది- కంపనీ సర్కారే.

ధోం: ఈ స్వాతంత్ర్య సమరానికి మన మహారాణులవారి నాయకత్వమే లభ్యివుంటే- నేటికీ తెల్లవారిజాడ లేకుండా పోయేదికదా!

లక్ష్మి: మన దేశంలో స్త్రీ నాయకత్వం సహించే డెవరు? సరే కాని, మన సైనిక వ్యవస్థ యెట్లున్నది? సేనాపతీ!

గురు: సుశిక్షితులైన మన పదివేలమంది సిపాయీలు తమ చివరి రక్తబిందువు నేలరాలువరకు పోరాడటానికి దీక్ష బూని, సర్వసన్నద్ధులై వున్నారు. ఐదువేలకు పైగా కొత్తగా శిక్షితులైనవాళ్ళు అహమహమని ముందుకు వస్తూ వున్నారు.

లక్ష్మి: కోట బందోబస్తును గూర్చి వివరించెదరుగాక- మహామంత్రులు.

రామ: దుర్గ పునిర్నిర్మాణం పూర్తైంది. రక్షణ బందోబస్తు చక్కగా ఏర్పడ్డది. ఆహారపదార్థాలు, నీటి వసతులు, మందుగుండు సామగ్రి సరఫరా మనకు, ఆరు మాసాలకు చాలినంత భద్రపరచడమైంది. అయినను శత్రువును దూరంనుండే ఎదిరించడానికి మోర్చాబంది మొదలగు వ్యవస్థలుగూడా ఏర్పాటు చేయబడ్డాయి.

లక్ష్మి: (మహామంత్రి మొగమై) బయటి సహాయ మేమైన రావచ్చునా?

రామ: చిన్న సంస్థానాల సహాయం వస్తే రావచ్చును.

లక్ష్మి: అది అందినను అందని సమానమే.

రామ: నానాసాహెబ్ సహాయ మేమైన వస్తే అక్కరకు వచ్చేది.

లక్ష్మి: నమ్మకం లేదు. ఆడవారి సహాయం పుచ్చుకోక పోతే పోనీ; అబలలకు సహాయం చేయడంకూడా వారి మగతనానికి భంగమేమో! అంతా ఈశ్వరాజ్ఞ!

ధో: 'కదలదు నీ సంకల్పము లేనిది గడ్డిపోచయైన రామా!' కదలదు.

(అందరు నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

---

## తృతీయ రంగం

ప్రదేశం: కాన్పూర్ కోట

ప్రవేశం: కర్నల్ హ్యూరోజ్, లెఫ్టినెంట్ జాన్సన్

హ్యూరో: థ్యాంక్ గాడ్! ఉత్తర హిందూస్థానంలోని విద్రోహ చర్యలు పూర్తిగా అణచివేయబడ్డాయి. తిరుగుబాటు దార్ల చేతుల్లో పడ్డ కోటలన్నీ మన స్వాధీనాత్తె నాయి. వానిపై మన యూనియన్ జాక్ రెపరెపలాడుతూ వుంది.

జాన్సన్: ఇప్పుడు విద్రోహచర్య లన్నియు బుందేల్ ఖండ్

మరియు సెంట్రల్ ఇండియాలో కేంద్రీకరింపబడ్డాయి. తాంత్యాతోపే తన సర్వ బలాలను కూర్చుకొని కాల్ కోటలో బలిష్ఠుడై వున్నాడు.

హ్యూరో: ఉండనిమ్ము. మొదట మనకు పక్కలో బల్లెమైన ఝాన్సీరాణిని హతమార్చాల్సి వుంది. ఆమె రణకౌశలం మన యుద్ధ నీతిని తలదన్నేట్లుంది.

జాన్సన్: అట్లు మీరెంచవద్దు సార్! గొప్ప గొప్ప క్లిష్ట సమయాల్లో విజయలక్ష్మిని వరించిన మీ జోంట్లకు ఝాన్సీ ఒక లెక్కయా?

హ్యూరో: నో, లెఫ్టినెంట్! యు ఆర్ మిస్టేకన్. ఆమె ధైర్యసాహసాలు, యుద్ధనైపుణ్యాలు ఇప్పటి దేశనాయకులలో ఏ ఒక్కరియందును కానరావు. ఆమె స్త్రీయై పుట్టినందులకు మన భాగ్యం పండిందనుకో. ఆమెయే పురుషుడైనచో ఈపాటికి మనం ముళ్ళేమూటా సర్దుకొని పోవలసి వుండేది.

జాన్సన్: శత్రువును, అదీ స్త్రీని మీరింతగా పొగిడ్తే నాకు సహనం అవడంలేదు సార్!

హ్యూరో: పొగడుట కాదు, మై డియర్ ఫ్రెండ్! ఇది అక్షరాల సత్యం. అనుభవమైన పిదపనే మీరు నాతో ఏకీభవింతురుగాక!

జాన్సన్: సార్! తాంత్యా సేనలు, ఝాన్సీ సహాయార్థం కదిలాయని చారవార్త!

హ్యూ్యరో: డోన్ట్ వరీ_ సింధియా బలాలు మనకు సాయం రాగలవు. మీరు వానితో కలిసి తాంత్యా మార్గం అరి కట్టాలి. నేను హైద్రాబాదు పటాలాలతో కలుసుకొని. ఝాన్సీ కోటను ముట్టడిస్తాను. కేర్‌ఫుల్‌గా మెదలాలి సుమా! యు మే గో నౌ.

జాన్సన్: (సెల్యూట్ చేసి నిష్క్రమిస్తాడు)

హ్యూ్యరో: ఇంతవరకు యుద్ధరంగాల్లో శత్రుల నోడించి ఆర్జించిన విజయాలే నన్నీ రంగానికి ప్రత్యేకంగా ఈడ్చుకొని వచ్చాయి. కాని, యీ ఝాన్సీ పోరాటంలో చిరకాలార్జిత యశస్సుకు మచ్చ వస్తుందేమో అని భయం వేస్తున్నది. నెవర్ మైండ్! గాడ్ ఈజ్ గ్రేట్! వీరయోధులకు_ విజయమో లేక వీర మరణమో_ తప్పదు కదా! ఉభయత్ర కీర్తియే ప్రాప్తమగును. ఇక ఝాన్సీ దండయాత్రకు ఉపక్రమింతునుగాక!

(నిష్క్రమిస్తాడు _ తెరపడుతుంది)

---

## చతుర్థ రంగం

ప్రదేశం: ఝాన్సీ కోటలో రహస్య సమాలోచన మందిరం

ప్రవేశం: లక్ష్మీబాయి సైనిక దుస్తుల్లో, రాంచందర్ రావు, ధోండోపంత్ మరియు కాశి_

లక్ష్మి: అయ్యో! ఎట్టి దుర్దినం గాంచనైనది. తెల్లవారి

యుద్ధనీతి, వ్యూహరచనకూడ కొనియాడతగినదే! బయటి సహాయమందకుండా ఎక్కడికక్కడ మార్గాలు అరికట్టబడ్డాయి.

రాం: తాంత్యాతోపే సైన్యం మన సహాయంకొరకు బయలు దేరినట్లు వార్తలు వచ్చియుండెను. ఆ సాయం మన కిప్పుడు అందితే ఎంత బాగుండెడిది!

లక్ష్మి: పాపం! దానికిగూడా ఇతర సైన్యాలకు పట్టిన దుర్గతియే పట్టివుండవచ్చును. ఆహా! నిలువలు దాదాపుగా ఒడిసిపోయాయి. సైన్యాలు ఇంచుమించుగా క్షీణించాయి.

రామ: మహావీరుడు, గురుబక్ష్‌సింగ్ మాతృభూమికై ప్రాణాలర్పించి స్వర్గస్థుడయ్యాడు.

లక్ష్మి: దాంతో నా కుడి భుజం రాలిపోయింది.

ధోం: తన తోపుఖానా బలంతో తెల్లవారి బతుకు తెల్లారగొట్టే నా మిత్రుడు, ఖాసింఖాన్ స్వీయ రక్తంతో దేశమాత కభిషేకం చేసి, జన్నత్‌కు చేరుకున్నాడు. (కంటనీరు పెడతాడు)

లక్ష్మి: దీంతో నా ఎడమ భుజంకూడా విరిగిపోయింది. హా! దుర్విధీ!

రామ: ప్రస్తుత కర్తవ్యం? (ప్రశ్నార్థకంగా చూస్తాడు)

ధోం: "గతం గోష్టిం న కర్తవ్యం".

లక్ష్మి: నా బుద్ధికి రెండే రెండు మార్గాలు కనబడుతున్నాయి. ఒకటి— బొందిలో ప్రాణాలున్నంతవరకు పోరాడి, వీర స్వర్గమలంకరించుట; రెండు— కోట వదలి తప్పించు కొనిపోవుట.

రామ: ఝాన్సీ పతనంతో భారత స్వాతంత్ర్య సమరం ఆగి పోదు. దానిని కొనసాగించుట ప్రతి భారతీయుని కర్తవ్యం. కనుక రెండవ మార్గమే వాంఛనీయం, అవ లంబనీయమూ అని నాకు తోస్తున్నది. మీద మహా రాణులవారి ఆజ్ఞ.

లక్ష్మి: అవును, నిష్ప్రయోజనంగా యుద్ధం సాగించి, నిష్కారణంగా నా బిడ్డలను సమరదేవతకు కోళ్ళ- గొర్రెలా బలిపెట్టడం ఎంతమాత్రం సమంజసం కాదు. స్వాతంత్ర్య సమరం కొనసాగించుటకు విశాలమైన భారతదేశం మిగిలియే వున్నది.

ధోం: అదిగో! వీరులను, దేశభక్తులను భారతమాత యుద్ధా నికి ఆహ్వానిస్తున్నది.

రామ: నిజం! కాల్పికోటలో పీష్వా సేనలు ఎదురుదాడికై సర్వ సన్నద్ధంగా వున్నాయని వార్తలందాయి.

లక్ష్మి: మహామంత్రీ! కోటలోనివారందరూ తెల్లారేవరకల్లా రహస్య మార్గాన కోట వదలి పోవుదురుగాక! రాజస్త్రీ లందరు మాన సంరక్షణార్థం ఆత్మాహుతి చేసుకొందురు

గాక! అంతవరకు బయట యుద్ధం సాగుతూనే యుండు
గాక! ఈ మా ఆజ్ఞలు తత్క్షణమే అమల్లోకి వచ్చుగాక!

ధో: మరి మా కాశి ఛావవలసిందేనా? కాదు, ముమ్మాటికి కాదు. కాశీబాయి బ్రాహ్మణ స్త్రీ. వీర వనితాధర్మంతో సంబంధం లేదు ఆమెకు. (దిగాలుపడి, కాశివైపు చూస్తాడు.)

కాశి: అమ్మా! ఈ దీనురాలు బొందిలో ప్రాణం వున్నంత వరకు మిమ్మొడబాయకుండునట్లు అనుగ్రహించండు.

లక్ష్మి: (పిపుతట్టి) సరే! అట్లే కానిమ్ము.

ధోం: (చంకలు కొట్టుకొనుచు సంబరపడతాడు)

లక్ష్మి: దీవాన్‌జీ! మరి మీరో?

రామ: భృత్యుని మీకు అంగరక్షకుడిగా వుండటానికి అనుగ్రహింపుడు.

లక్ష్మి: తథాస్తు!

రామ: ధన్యోస్మి!

ధోం: మరి నేనో? (బిక్క మొగంతో చూస్తాడు)

లక్ష్మి: నీ ప్రేయసిని అడుగు. (కాశివైపు చూస్తుంది)

ధోం: నేను మా కాశికి అంగరక్షకుణ్ణై వుంటాను.

కాశి: నేనే మీకు అంగరక్షకత్వం జరుపాల్సి వస్తుందేమో అని భయమౌతున్నది.

ధోం: (చిన్నబోయి చూస్తాడు)

లక్ష్మి: ఎట్లైనను ఫరవాలేదు. తమ వంశ దీపం ఆరకుండా వుండటం, మహారాజులు గంగాధర్‌రావులవారి ఆశయం. దాన్ని నిలబెట్టడం మా కర్తవ్యం. (కుమారరాజును వీపున కట్టుకొని) తల్లీ! ఝూన్సీదేవీ! నీ బిడ్డ నీ నుండి శాశ్వతంగా దూరమౌతున్నది. ఇవే దాని ఆఖరి వందనాలు– అందుకో. (హస్తాలు జోడించి, మస్తకం చేరుస్తుంది. కన్నులలో నీరు నిండుతుంది. అందరూ ఏడుపు మొగాలతో దండాలు పెడుతూ– వెనుకకు వెనుకకు చూస్తూ నిష్క్రమిస్తారు.)

(తెరపడుతుంది)

---

## చతుర్థాంకం

### ప్రథమ రంగం

ప్రవేశం: కాల్పి కోటలో రహస్య మందిరం

ప్రదేశం: నానాసాహెబ్, రావుసాహెబ్, తాంత్యా మరియు విదూషకుడు

నానా: పాపం, ఝాన్సీలక్ష్మీబాయి కోట వదలి వెళ్ళిందట.

విదూ: ఆఁ! (ముఖం తెరిచి) ఇంతేనా? (చేతులు వెళ్ళకల వేస్తాడు.)

రావు: ఆమె అంత అసమర్థురాలు కాదు.

విదూ: ఔను, కాదు– ఎన్నటికీ కాదు.

నానా: మరి అట్లు కోట వదలి వెళ్ళటానికి కారణం?

రావు: ఏదో ఒకటి ఉండి తీరుతుంది. అంతవరకు మన బుర్రలు పనిచేయవు. (ఆలోచిస్తూ వుంటాడు)

తాంత్యా: ఇక్కడ ఆపాటు ముహూర్తం చూసుకొని వెళ్ళే వరకూ ఒక్క ముహూర్తకాలం ఆలస్యమైంది. ఇంతలో ఆ తెల్ల పిశాచి సైన్యాలు కోటను ముట్టడించివేశారు. నేనే ఆ కోటను చేరియుంటేనా—

విదూ: (కళ్ళు చిపిలిస్తూ) చేరియుంటే?

తాంత్యా: ఈపాటికి ఏమయ్యేదో!

రావు: బహుశా, కాల్పి యుద్ధసన్నాహాల అవసరం వుండేది కాదేమో!

విదూ: ఉండేదే కాదు.

తాంత్యా: సరిగా ఆలోచించావు.

విదూ: రయితో! నాకూ అలాగే తోచింది.

ద్వారపాలుడు: (ప్రవేశించి, నమ్రుడై) ఝాన్సీ మహారాణిగారు కోట గుమ్మందగ్గర తమరి ఆజ్ఞలకై వేచి వున్నారు.

నానా: తక్షణమే ప్రవేశపెట్టు. (సర్దారనే చూస్తాడు)

ద్వార: చిత్తం! (తలవంచి నిష్క్రమిస్తాడు)

నానా: మంచి సమయానికే వచ్చింది. ఇత్తర ఈయమకు సర్వసేనా నాయకత్వం అప్పగించిన బాగుండునేమో!

రావు: చాలా బాగుంటుంది. ఇక స్త్రీల అదుపు ఆజ్ఞల్లో
పనిచేయడమే మాకు మిగిలింది. (కోపంగా చూస్తాడు)
తాంత్యా: మీ ఇష్టానుసారమే కానిండు. మహారాణిగా
చేస్తే ఇంకా బాగుంటుంది. (హేళనగా చూస్తాడు)
నానా: ఇది కేవలం మీ అభిప్రాయము కొట్టిచూచుటకే
పల్కినపలుకు. అది నాలుక చివరినుండి మాత్రమే
వెళ్ళినమాట సుమా! మీరు ఇరువురు నాకు ఇరుభుజాలు.
పీష్వా రాజ్య పునఃస్థాపన బాధ్యతాభారం మీ భుజస్కం
ధాలమీదనే ఆధారపడి వుందను సంగతి మర్చిపోవద్దు.
లక్ష్మి: (ప్రవేశించి, ఖడ్గం చేబూని) మీరు ప్రసాదించిన
ఈ అధికారం ఈ అభాగిని యగు అబల నిలుపుకోలేక
పోయినందుకు విచారిస్తున్నది. ఇదే మీ అధికారం
మీకు అప్పగిస్తున్నది. (కత్తి నానాసాహెబ్ పాదాల
కడ వుంచుతుంది) ఇక సెలవు. (పోబోతుంది)
నానా: (ఆపి) ఝాన్సీరాణీ! మీబోటి వీరవనితల గన్నం
దుకు భారతమాత గర్వపడుతున్నది. జయాపజయాలు
ఈశ్వరాధీనాలు.
రావు: అది అక్షరాల సత్యం.
విదూ: "షడ్భాగంతు మనుష్యాణాం సప్తమం దైవచిం
తితం" అన్నారు పెద్దలు.
తాంత్యా: నేను మీ సహాయార్థం బయలుదేరియు మిమ్ము
చేరజాలనందుకు చింతిస్తున్నాను.

లక్ష్మి: కృతజ్ఞతలు.

నానా: పీష్వాలు స్వయం దత్తాపహారులు కారు. (కత్తి తిరిగి అందిస్తాడు)

మీ యధీనంలో ఐదువందల గుఱ్ఱపుసవార్లను ఇస్తున్నాం మీ ఆగమనంవల్ల కాల్పి యుద్ధంలో మేము గెలిచినట్టే భావిస్తున్నాం.

రావు: ఝాన్సీ కోట మళ్ళా మీ హస్తగతమైనట్లే లెక్క.

తాంత్యా: ఈ తెల్ల కాకులను మధ్య హిందూస్థానంనుండి తరిమివేసినట్లే నేను భావిస్తున్నాను.

విదూ: కాదు, అవి హిందూ మహాసముద్రంలో పడి కొట్టుకోపోతున్నట్లు నేను చూస్తున్నాను.

నానా: ఇప్పుడు మన సైన్యంలో నూతన చైతన్యం వచ్చి చేరింది. శ్వేత రక్కసులదాడినుండి రక్షించుకోటానికి తగిన కట్టుదిట్టాలు చేయాలి.

రావు: మీరు ప్రశాంతంగా వుండండి. దుర్గ రక్షణభారం నాది.

తాంత్యా: దుర్గంలో ఉండి మనం శత్రువులను ఒక సంవత్సరం వరకు నిరాఘాటంగా ఎదిరించగలం.

లక్ష్మి: మనం ఎప్పుడూ శత్రువులను కోటకు దూరంగానే ఎదుర్కోవాలి.

తాంత్యా: నేను ఈ మాటతో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. ఈ పని నేను వహిస్తాను.

రావు: ఈ సలహా బాగున్నది.

విదూ: ఇది నాకూ నచ్చింది.

నానా: ఈ మేరకు అన్ని ఏర్పాట్లు జరుగుగాక!- అందరు తమతమ విధులయందు అప్రమత్తులై యుందురుగాక! ఇక మీకు సెలవు.

(తాంత్యా, రావుసాహెబ్ మరియు లక్ష్మీబాయి నిష్క్రమిస్తారు.)

విదూ: మరి నేను?

నానా: మమ్ము కొల్చుటయే నీ పని.

విదూ: మమ్మ ఏలుటయే నీ పని_ తప్పు తప్పు_ మమ్ము_ కాదు కాదు_ నన్ను ఏలుటయే నీ పని_ తుప్ప తుప్ప- మీ పని.

నానా: మతి పోయిందా ఏం?

విదూ: ఉంటేగా పోవుటకు? (ఆశ్చర్యంగా చూస్తాడు)

(ఇద్దరు నిష్క్రమిస్తారు _ తెరపడుతుంది)

---

## ద్వితీయ రంగం

ప్రదేశం: అరణ్య సీమ

ప్రవేశం: నానాసాహెబ్, రావుసాహెబ్, తాంత్యా మరియు విదూషకుడు.

నానా: హమ్మయ్య! 'చావు తప్పి కన్ను లొట్టవోయె'

నన్నట్లు- ప్రాణాలతో మట్టుకు బయటపడి మన మిత్రుల
చేరగలిగాం. (నిట్టూర్పు విడుస్తాడు)

రావు: ఈ కీకారణ్య బ్రహ్మారణ్యంలో తెల్ల భల్లూకాల భయ
మైతే లేదనే అనుకోవచ్చు. (ప్రశాంతంగా ఊపిరి
పీలుస్తాడు.)

తాంత్యా: తాంత్యా పేరు వింటే- పిరంగి స్త్రీల గర్భాల్లో
పిండాలు గడగడలాడుతాయి- అన్న మన కీర్తి సంపా
దించిన నాకు, తెల్లవారికి భయపడి, అరణ్యాల్లో తల
దాచుకునే దురవస్థ పడుతుందని స్వప్నంలో కూడ అను
కోలేదు. హా! హతవిధీ!

విదూ: నేను మొదటినుంచి దుశ్శకునాలే చూస్తూవున్నాను.
మనం కాన్పూర్ పైకి దాడి వెళ్ళేటపుడే చెప్పాను-
తుమ్మింది కొంచెం ఆగుదాం, నా తుమ్ము మంచి పాటి
గలది- అని. నా మాట ఎవరికి కావాలి? తాంతియా
మహాశయులకు ముహూర్తం దాటుతుందట ముహూర్తం!

తాంత్యా: నోరు మూయి- పీనుగ!

విదూ: ఇప్పుడు చచ్చు మొగం ఎవరిదో కనబడుతూనే
వుందిగా. (చేతులు త్రిప్పుతాడు)

తాంత్యా: ఈ వెధవకూతలు కూయకు- మందబలం చూసు
కొని కుక్క మొరిగిందట- నాలిక చీల్చివేస్తాను.
(కత్తి తీస్తాడు)

నానా: తాంత్యా మహానుభావా! శాంతించు; విదూషక మహాత్మా! నోరు మూసుకో.

విదూ: (రెండు చేతులతో నోరు గట్టిగా మూసుకుంటాడు)

రావు: తాంత్యా! అంటే కోపం వస్తుంది గాని, మొన్న ముహూర్తమని జాగుచేయుటచేతనే ఝాన్సీ కోటను చేరలేకపోయానవి నీ నోటనే చెప్పియుంటివి కదా! ఇప్పుడు పాపం! విదూషకుల మాటపై విర్చుకపడుతు న్నావు.

తాంత్యా: ఖిల్లాలమీద ఖిల్లాలు గెల్చి, మీ కంటగట్టినప్పుడు ఈ నోటనే పొగిడావు; ఇప్పుడు గ్రహచారం చాలక ఓడుతున్నందుకు అదే నోట కించపరుస్తున్నావు. నీది నీది నోరా? పట్నం తూపురాణా? ఝాన్సీరాణీ నాయ కత్వంను నీ వప్పుడు కాదనలేదా? దాని ఫలితమే మన ఈ దురవస్థ కాదా? చాలు నీ పురుషార్థం— తల్లి పుటు కలు మేనమామకు తెలీవనుకుంటావా?

రావు: (ఏమో అనబోతాడు— నానాసాహెబ్ వేలు చూపి ఆపుతాడు.)

నానా: మిత్రులారా! మనం, కర్తవ్యవిమూఢులమై వాదు లాడుట విడిచిపెట్టి ముందు కార్యం విచారింతాము.

రావు: నా మనసులోనూ అదే ఆలోచన మెసలుతున్నది.

తాంత్యా: నేనును అదే యూహిస్తున్నాను.

విదూ: నేనూ అదే మాట అందామనుకున్నాను. పెదవుల దాక వచ్చిందో లేదో ఈ పాడు లోల్లి ముందరపడింది.

(అందరు ఒకరి మొగం వొకరు చూస్తుంటూరు.)

నానా: బ్రిటిషువారు మిక్కిలి అప్రమత్తులు- మన జాడల కై వేగులను ఈవరకే నలువైపుల పంపి వుంటారు.

రావు: ఆ పాడు సైన్యాలు ఏ క్షణాన ఐనా మనపై పడొచ్చు.

తాంత్యా: పాపం! రాణి ఏమై వుంటుందో!

నానా: ఇప్పుడామె యున్న- ముందుదారి మనకు తప్పక చూపించి వుండేవారు.

(దూరంనుండి ధూళి- గుర్రపు డెక్కల చప్పుడు- అందరు పలాయన మంత్రం పఠింప నుంటారు- విదూ షకు డేమియు తోచక తత్తరపాటుతో ఇటు అటు పరు గులు తీస్తుంటాడు.)

తాంత్యా: (చెట్టెక్కి చూచి) భయపడకుడి- స్మరించినంతనే మన రక్షణదేవతవలె ఝాన్సీరాణిగారు ఇటే వేంచేస్తు న్నారు.

నానా: ఇప్పుడు మనకు ముందుదారి దొరకగలదు.

విదూ: కలదేమిటి? దొరికినదనాలి.

లక్ష్మి: (ప్రవేశించి, గుర్రం దిగి, తలవంచి నిలుస్తుంది)

నానా: మహారాణికి సుస్వాగతం!

లక్ష్మి: మిమ్ములను కలుసుకున్నందుకు ధన్యురాలను.

విదూ: కిం కర్తవ్యం ?

నానా: (చిరుకోపంతో) చాలించవయ్యా నీ వాచాలత్వం.

విదూ: (కోపంతో) వాచాలత్వమే కాదు; జీత భత్యాలు లేని మీ కొలువునే చాలించుకుంటాను. (లేస్తూ) ఏదో మీరు పీష్వాలైతే నాకో ఖజాంచి పనైనా యిస్తారనే ఆశతో ఇన్నాళ్ళు గడిపాను. వచ్చిన పని వాకిట్లోనే ఎదురైంది. ఇక సెలవు_ (పోబోతాడు.)

రావు: (రెక్కపట్టి ఆపి) లక్ష్మీబాయి వచ్చారు, పీష్వాపదవి స్థిరమైంది. నాకు మహామంత్రి హోదా, నీకు ఖజాంచి పని ఖాయం. ఊరి ముందరికి వచ్చి ఉరుకులాడతావేమి? కాస్త వోపికపట్టు_ (కూర్చుండ పెడతాడు.)

తాంత్యా: మన విదూషకులవారు ముక్కుమీద ఈగవాలిందంటే ముక్కే కోసివేసుకుంటారు. (అందరు నవ్వుతారు)

విదూ: మరి లేకపోతే! (గర్వంగా అందరిని చూస్తాడు.)

నానా: లక్ష్మీబాయీ! ఇక మా కరణ్యమే శరణ్యమని విచారించుచుండ_ మీ నామం స్మరణకు వచ్చింది.

తాంత్యా: వెంటనే మీరు ప్రత్యక్షమయ్యారు.

రావు: ఇక వరప్రదానమే మిగిలింది.

విదూ: నా మొరే దేవునికి ముట్టింది.

నానా: ముందు దారి ?

లక్ష్మి: పురుషుడు కష్టకాలమందు ధైర్యం చేపట్టాలి_

వివేకం గోలుపోకూడదు. చెదరిపోయిన సేనల సమ కూర్చుకోవాలి. ఒక బలిష్ఠమైన కోట మొదట పట్టుకోవాలి. ఇది మన ప్రస్తుత కర్తవ్యం. త్వరపడాలి. ఒక్కొక్క నిమిషం మన కెంతో విలువైంది.

రావు: సేనలను ప్రోగుచేసే పని నాకు వదలండి.

తాంత్యా: కోటను పట్టుకునే పని నా కప్పగించండి.

నానా: బాగు! బాగు! కోటను పట్టుకోవాలి. దేనిని?

(రావుసాహెబ్ వైపు చూస్తాడు)

రావు: ఝాన్సీ కోటను.

విదూ: చక్కని ఆలోచన.

లక్ష్మి: ఇది ప్రస్తుతం మన చేత అయ్యే పని కాదు.

నానా: మరి దేనిని?

తాంత్యా: కాల్పిని.

లక్ష్మి: ఊహూఁ! ఇప్పుడదీ మన తాహత్తుకు మించిందే!

నానా: అయితే ఇంకేది? (అందరు ఒకరి మొగాలు ఒకరు చూసుకుంటారు. అందరి దృష్టి ఒకేసారి లక్ష్మీబాయి పై నిలుస్తుంది. ప్రశ్నార్థకంగా)

లక్ష్మి: గ్వాలియర్ కోట.

నానా: చాలా బాగున్నది. ఎవ్వరి దృష్టికీ రాలేదాయె.

విదూ: ఎందుకు రాలేదు? నాకు నాల్గుక చివరిదాక వచ్చింది. కాని, నేను నోరుతెరిస్తే 'ముఖ్యు' అంటారని

నోటికి తాళం వేసుకున్నాను. (పెదవులు బిగపట్టి చూపుతాడు)

నానా: సింథియా మన సామంతుడు. తప్పక మన ఆహ్వానిస్తాడు.

తాంత్యా: ఇది పగటి కల. అక్కడి దివాను, దినకర్రావు బ్రిటిషువారి తొత్తు. నా ఝాన్సీ త్రోవ నరికట్టింది వాడే.

రావు: అయినను సింథియాకు రాయబారం పంపి చూస్తాం. జియాజీరావుమాత్రం అంత దేశద్రోహి కాడనుకుంటాను.

విదూ: నాకూ అదే తోస్తున్నది.

తాంత్యా: అట్లే అనుకోండి.

లక్ష్మీ: నేను నా సఖియగు కాశీకి ధోండోపంథ్ సాయం ఇచ్చి, గ్వాలియర్ కోట రహస్యాలు రహస్యంగా తెలిసికోరమ్మని పంపిస్తాను. అదీ మహారాజులవారి ఆజ్ఞ అయితేనే!

నానా: అయ్యో! ఎంతమాట! తప్పక పంపండి. ఇక ఎవరి పనులు వారు చూసుకోగలరు.

(నానా, విదూషకులు తప్ప, ఇతరులు నిష్క్రమిస్తారు)

నానా: (తనలో) దినములు మంచివి కానప్పుడు అడుగడుగున విఘ్నాలే. భవిష్యత్తు అంధకారబంధురంగానే కానవస్తున్నది. పీష్వా రాజ్య పునఃస్థాపనా స్వప్నాలు, స్వప్నాలుగానే నిల్చే దౌర్భాగ్యమే ఎదురయ్యేట్టుంది.

ఝాన్సీ రాయబారి వచ్చిన లగాయతు ఈ స్వాతంత్ర్య సమరానికి సర్వ నాయకత్వం ఝాన్సీరాణికే కట్టిపెట్టా లని నా అంతర్వాణి పలుకుతునే వున్నది. దానినే నా వాణి బహిర్గతంకూడా చేస్తూ వచ్చింది. కాని దానిని పాటించేవారెవరు? నా భుజద్వయముపై న— తాంత్యా, రావుల విముఖత్వం గని, నాకు లొంగవలసి వచ్చింది. విధికి తల వొగ్గక తప్పదు కదా! (ఆవేదనలో మరికొ— ప్రకాశంగా) ఝాన్సీరాణి పురుషుడైతే ఎంత బాగా వుండేది!

విదూ: నానాసాహెబ్ స్త్రీ ఐతే ఏంతక్కా వుండేది! కాదు కాదు— (చెంపలు వేసుకుంటూ) నేను స్త్రీ ఐతే— ఛీ! పాపం ఉపశమించుగాక!

నానా: అను అను— నీకూ ఇదే సందు. ఈ స్థితిలో నీ హాస్యాలే నాకు కొంత ఓదార్పులు.

విదూ: ఈ భృత్యుడు కృతకృత్యుడు. మహారాజులవారికి భోజన సమయం అయింది. వేంచేతురుగాక! (ముందు దారి చూపుతాడు.)

(ఇద్దరు నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

---

## తృతీయ రంగం

ప్రదేశం: గ్వాలియరు కోటలో ఉద్యానవనం

ప్రవేశం: ధోండోపంత్ ప్రవేశిస్తూ

ఢోం: (బొత్త పుణుక్కుంటూ) బేవ్! పిష్వా రాజ్యాల్లి చల్ల గుండ! బేవ్! లడ్డూలు అంతకంటె చల్ల గుండ! బేవ్! నా కడుప్పు అన్నిటికంటె చల్ల గుండ! బేవ్! ఏం సంతర్పణలు! ఏం వంటకాలు! బేవ్! నా నోరూర కడుపార షడ్రసోపేతే పంచభక్ష్యపరమాన్నాలు భుజించాలంటే బ్రాహ్మణ జన్మమెత్తి తీరాలి. బేవ్! అదృష్టమంటే పంథ్‌దే అదృష్టం. బేవ్!

(విదూషకుడు ప్రవేశిస్తాడు)

విదూ: ఓహో! పండత్‌జీకి వార్షం రోజులకే అజీర్తి వ్యాధి పట్టుకున్నట్టుందే! ఇంకా మూడు వారాల ఉత్సవాలు మిగిలే వున్నవాయె. (కిందికి మీదికి ఎగాదిగా పంథ్‌ను చూస్తాడు)

ఢోం: ఏంటయ్యా! బాగా చూస్తున్నావ? దృష్టి తగుల్తుంది. బేవ్!

విదూ: ఏం లేదు. అసలు మీరు బ్రాహ్మణులేనా? అని—

ఢోం: ఏం? అసలు బ్రాహ్మణ్ణి కాకుంటే నకలు బ్రాహ్మణ్ణి అనుకుంటున్నావా? కనబడుతులేవా? యజ్ఞోపవీతాలు; తీరుపాటు లేక కాస్త తోముకోలేదు. (జంద్యాలు వ్రేళ్లతో త్రింపుతుంటాడు.) బేవ్!

విదూ: దానికేం? పొలెపాని కండెలు చల్లనా వుంటే జంద్యాలు కొల్లలు.

ధోం: అయితే నీ జంద్యాలు అలాంటివే అన్నమాట. బేవ్!

విదూ: అవును; తప్పేం? మనమంతా బ్రాహ్మణబ్రువులం.
సరే కాని, ఓ సంగతి అడుగుదామనుకుంటున్నాను.

ధోం: అడుగు; సంకోచం విడిచి. బేవ్!

విదూ: ఇంత ఘనంగా విజయోత్సవాలు జరుగుతుంటే మీ మహారాణి కానరాదేం?

ధోం: అసలు మీవారు కానితేకదా! (ప్రశ్నార్థకంగా చూస్తాడు.) బేవ్!

విదూ: కానేటట్టుంటేగా మా వారు! (చేతులు వెలికల వేస్తాడు.)

ధోం: ఆరోజు సింధియా తోపుఖానా ధాకకు ఆగలేక మన సైన్యాలు శత్రువులకు వెన్నిచ్చి, కాళ్ళకు బుద్ధిచెప్పుతుండగా మా మహారాణి సింహంవలె గర్జించి సింధియాపై లంఘించకుండా ఉన్నచో— బేవ్!

విదూ: ఏమయ్యేదిదా? ఇప్పుడు మనం ఏ కానలోనో కాన రాకుండా తిరుగాల్సి వచ్చేది. లేదా, శత్రువుల చేతి కర వాలాల ధాటికి ఖండకాయలవలె మన తలకాయలు ఎగిరి పడి వుండేవి. ముఖ్యంగా నీ కీ బేవుల బాధ కలిగేదే కాదు.

ధోం: ప్రళయకాల మేఘంలా గర్జించి, అపర కాళిలా అక స్మాత్తుగా లఘించిన రాణిని గని, పిరంగులు చల్ల

బడ్డాయి. జియాజీరావు హడలిపోయాడు. వారుభయుల సమయుద్ధం వర్ణనాతీతం. బేవ్!

విదూ: అప్పుడు, వాహ్! రాణీ! వాహ్! అన్న వాక్యం సింధియా నోట అప్రయత్నంగా వెళ్ళింది. ఇంతలో రాణీదే పైచేయి కాగా చివరికి సింధియాకు పారిపోక తప్పదాయె. ఆహా ! ఏమి పౌరుషం! ఏమి వీరత్వం! 'న భూతో న భవిష్యతి'_

ధోం: ఆమె శౌర్య సాహసాలను, యుద్ధనీతిని శత్రువులు కొనియాడాల్సిందే కాని, మనవారి దృష్టిలో ఆమె యొక స్త్రీ- అబల మాత్రమే_ బేవ్!

విదూ: ఇప్పటికైనా ఆమెను వారు అనుసరిస్తే ఆ తెల్లపీనుగుల అవలీలగా స్మశానానికి తరలించవచ్చు.

ధోం: అదే కాని పని. మొన్న మా రాణి ఈ హంగులన్ని చూచి, విజయోత్సవాలకు సమయం ముందుంది_ ఇప్పుడు మనం ఎక్కవల్సింది పెద్ద కొండ, దాటవల్సింది మహా సముద్రం_ అని, ముందు కార్యమును గూర్చి రహస్య సమాలోచన కోరగా_ బేవ్!

విదూ: విజయోత్సవాల అనంతరం సావకాశంగా ఆలోచిద్దామని జవాబు వచ్చింది కదూ! అప్పుడు నేను అక్కడే వున్నాను. రాణిని నేను సమర్థించానుకూడా. 'నోరుముయ్' అను నానా గర్జన నా మూతికి బీగం వేసింది.

'వినాశకాలే విపరీత బుద్ధిః_'

ధోం: విజయగర్వం మనవారికి కండ్లు కానపడకుండా, చెవులు వినపడకుండా చేసింది.

విదూ: ఆ పిరంగివారి మరపిరంగులనుండి గుండ్ల వర్షం కోటపై కురిసినప్పుడు కాని కనులు కానరావు_ చెవులు వినరావు. అరె! భగవంతుడా! ఏమి తలపెట్టావురా తండ్రీ!

ధోం: ఇంకేం తలపెడ్తాడు? 'చేసుకున్నంత కుడువు మహాదేవ' అంటాడు.

విదూ: అయ్యో: మాటల సందడిలో మర్చాను.

ధోం: నేనుకూడా బేవు మర్చాను. బే_వ్_

విదూ: ఇదిగో! ఈ చూర్ణం మూడు చిటికెలు సేవించు_ ఇల్లు మింగుదునా, వాసాలు మింగుదునా_ అన్నంత ఆకలి కాకుంటే_ ఏమన్నావు_ అను. (చూర్ణం ఇస్తాడు)

ధోం: (ఆతురతతో సేవిస్తాడు) ఇప్పుడు నా ఆయాసం అంతా మంత్రం వేసినట్లు మాయమైంది. భేష్! భోజనాలకింకా ఎంత అలస్యం వుందో? ఆకలి వేస్తూనే వుంది.

విదూ: అరే! గంట మ్రోగుతున్నది_ పద.

ధోం: పద పద_ (తొందరపడతాడు.)

(ఇద్దరు నిష్క్రమిస్తారు _ తెరపడుతుంది)

---

## చతుర్థ రంగం

ప్రదేశం: మహారణ్య మధ్య పల్లెసీమ.

ప్రవేశం: రక్తసిక్తాంగయై లక్ష్మీబాయి పడుకొని- ప్రక్కన కుమారుడు, దామోదర్ రావు- చుట్టూ రామచంద్రరావు, ధోండోపంథ్, కాశీలు కూర్చొని-

లక్ష్మీ: (హీనస్వరంతో) దాహం- దాహం-

కాశి: ఇదిగో! గంగాంబువులు. (చేతికందిస్తుంది)

లక్ష్మీ: (మెల్లిగా గ్రహించి, దీర్ఘ శ్వాసలతో) చల్లని గంగా మతల్లీ! చల్లగా నన్ను నా నాథుని పాదసన్నిధికి చేర్చుము. (మెల్లిమెల్లిగా త్రాగి, రామచంద్రరావును చూచి, ఆయాసంతో) మహామంత్రీ! నీ రుణం నేను తీర్చుకోలేను. బ్రతికియున్నంతవరకు నాకు అంగరక్షకుడివిగా వుంటివి- ఇప్పుడు నా కళేబరాన్ని అగ్ని రక్షణలో అప్పగించే గురుతర భారం నీవే వహించాలి- మ్లేచ్ఛస్పర్శ మాత్రం తగలగూడదు సుమా! త్వరపడు- చితి సిద్ధం చేయించు- (అందరి కన్నుల్లో నీరునిండుతుంది)

రామ: ఆ భారము నాది. అభయం ఇస్తున్నాను- నిశ్చింతగా ఉండగలరు, మహారాణులవారు.

లక్ష్మీ: (కాశివైపు తిరిగి, ఆప్యాయపు చూపులతో) కాశీ!

కాశి: అమ్మా! (బావురుమని మీదికి వ్రాలుతుంది.)

లక్ష్మీ: (తల నిమురుతూ) నీ సేవలు మరువజాల- నీవు

నాకు తల్లివి_ తోడువు_ బిడ్డవు. (దామోదర్‌రావు చేతిని కాశీ చేతిలో ఉంచి) ఈ బిడ్డడు ఇక నా బిడ్డడు కాడు_ నీ బిడ్డడు.

కాశీ: (దామోదర్‌రావును అక్కున చేర్చుకొని, కన్నుల నీరు నించుతూ_ గద్గదస్వరంతో) మహాప్రసాదం! కుమారరాజులవారు నేటినుండి నా బిడ్డడే_ వీరి కేలాటి లోటుకాని, భయంకాని రానీయను. వీరు నా ప్రాణానికి ప్రాణం. నిర్విచారంగా వుండండి. మహారాణీ!

లక్ష్మి: (రామచంద్రరావును ప్రార్థనా దృష్టితో చూస్తూ) మా కుమారునకు రాజోచిత శిక్షణ కల్పించు బాధ్యత మీ మహా భుజాలమీద మోపుతున్నాము. (కన్నీరు కారుస్తుంది)

రామ: మీ పుత్రుని సర్వ విద్యాపారంగతుని చేసి, భావి భారత స్వాతంత్ర్య యోధుల్లో అగ్రేసరుని చేస్తానని శపథపూర్వకంగా వాగ్దానం చేస్తున్నాను. (చేతిలో చేయి వేస్తాడు.)

లక్ష్మి: (ధోండోపంత్‌ను దగ్గరకు పిలిచి, ప్రయత్నపూర్వక చిరునవ్వుతో_ కాశీ హస్తం, పంత్ హస్తంలో ఉంచి) మీ వివాహం చేతులారా చేసి, కన్నులారా చూచే భాగ్యం నోచనైతి. ఇక మీరు మరదలు బావలు కారు_ ఆలు మగలు. చిలకా గోరింకల్లా బ్రతకండి. (ఇద్దరి తలలపై

చేతులుంచి దీవిస్తుంది_ ఉభయులు తలలు వంచుతారు_
కన్నీళ్ళతో నిండిన కళ్ళతో చూస్తారు)

రామ: తథాస్తు!

లక్ష్మి: (దామోదర్‌రావు తల నిమురుతూ, అందరిని కలయ చూస్తూ, దీర్ఘశ్వాసలు వదుల్తూ, నిర్విచార ముద్రతో) మాట్లాడు శక్తి నశిస్తున్నది; ఐన ఒక మాట_ మేము నాటిన స్వాతంత్ర్య బీజాలు వృక్షాలై_ పూసి, కాసి, ఫలించుగాక! ఆ ఫలముల భావి భారతీయులు భుజింతురుగాక! (శ్వాసలు ఎగబీలుస్తూ) అంతా ఈశ్వరాజ్ఞ! జయ్_ రాం!__ (శ్వాస ఆగిపోతుంది)

అందరు: హా! మహారాణి! (గొల్లుమంటారు.)

(తెరపడుతుంది)

---

## పంచమాంకం

### ప్రథమ రంగం

ప్రదేశం: గ్వాలియర్ కోటలో దర్బారు

ప్రవేశం: ఆసీనుడై జనరల్ హ్యూరోజ్_ ఇరువైపుల చేతులు కట్టుకొని నిలబడిన జియాజీరావు వెనకరావులు

హ్యూ: మహారాజా సింధియా మరియు దీవాన్ బహాదుర్ దినకర్‌రావుగార్లకు వెల్‌కమ్! మా కంపని పక్షంలో

మెని మెని థ్యాంక్స్! దయచేసి మీరు మీ ఆసనాలు తీసుకోండి.

జీయా: లేదు హుజూర్! కంపనీ సర్కారుకు మేము నమ్మిన బంట్లం.

దెన: కాదు, సర్కార్! గులాములం.

జీయా: ప్రభువులతో సమానంగా కూర్చుండుటకు అర్హత గలదా? మాకు.

దెన: కాదు, మీ సమక్షాన నిల్చుండుటకుకూడా తగు దుమా? మేము- అను శంక బాధిస్తూవుంది.

హ్యూ: నో! నో! నాట్ ఇన్ ది లీస్ట్! మీరు కంపనీ గవ ర్నమెంటుకు ఫేత్‌ఫుల్ అలయెన్స్. మీరును, హైద రాబాద్ నవాబు, వారి దీవాన్ సర్ సాలార్‌జంగ్ బహాదుర్‌లాంటి విశ్వాసపాత్రులగు మిత్రుల సహాయం తోనే ఈ విద్రోహుల చర్యల ననతి కాలాననే సునాయా సంగా రూపుమాపగలిగాం.

జీయా: ఇదంతా దేవరవారి ప్రతాప పురుషార్థాల ఫలం.

దెన: మీ ఛత్రచ్ఛాయలోనే మేం సేవచేయగలిగిండి.

జీయా: సింధియా గాది మళ్ళా మాకు దక్కిందంటే మీ ప్రసాదమేకదా! అది.

దెన: నాకు దీవాన్ బహాదుర్ బిరుదప్రదానం తమరి కరుణాకటాక్షానికి సాక్ష్యం.

హ్యూ: అరే! మీరింకా నిల్చునే వున్నారా? వెరి వెరి సారీ!
(లేచి, ఇద్దరిని తన ఇరువైపుల ఆసనాలమీద కూర్చోపెడతాడు)
(జియ్యాజీరావు, దినకరరావులు బెదురుచు ఒదిగి కూర్చుంటారు.)

హ్యూ: ఝాన్సీరాణి, నానాసాహెబ్, తాంత్యాతోపేలను ప్రాణాలతో పట్టుకోరమ్మని లెఫ్టినెంట్ జాన్సన్‌కు ఆజ్ఞలిచ్చాం.

జియా: విద్రోహ విషబీజాలు చల్లి, మొలకలు పెంచి పెద్ద చేసిన స్వామిద్రోహులలో ముఖ్యురాలగు ఝాన్సీరాణికి మరణదండన చాలదనియే నా విశ్వాసం.

దిన: అల్లరిమూకల కూడగట్టుకొని, కంపనీ సేనల్ను నానా విధ హింసలకు పాల్జేసిన, ఆ తాంత్యాతోపేను, చిత్రహింస చేసినా సరిపోదని నా నమ్మకం.

హ్యూ: ఆహా! వీరవనిత, ఝాన్సీరాణి ప్రతాపమే ప్రతాపం. ఆమె రణకౌశల్యం, సమయస్ఫూర్తి, చాకచక్యం వేనోళ్ళ పొగడతగింది. ఎన్నిసార్లు మా కన్నుల్లో దుమ్ముకొట్టి తప్పించుకోపోలేదు. కత్తి తీసికొని రణరంగంలో ప్రవేశించిందంటే– అంతట ఆమెయే ప్రత్యక్షం.

దిన: ప్రభూ! క్షమింతురుగాక! శత్రువుల పొగడ్తలు మాకు కర్ణశూలాలవుతున్నాయి.

హ్యూ: నో! మిస్టర్ దినకర్‌రావ్! శౌర్యం శౌర్యమే! అది శత్రువుదే అవుగాక! వీరుడైనవాడు అట్టిదానిని కొనియాడక వుండలేడు.

జియా: యజమానుల ఈ మాటతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. మొన్న నానాసాహెబ్ మన కోటపై రాగా, రాణి సింహంవలె గర్జించి, చండివలె విజృంభించి వీరవిహారం చేయుచుండ నేనే ఎదుర్కోవలసి వచ్చింది. చివరికి నన్నుకూడా గడ్డికరపించింది.

దిన: (సిగ్గున తలదించుకుంటాడు.)

హ్యూ: ఆమెను పట్టుకొనుటకు ప్రయత్నించుట ఎండమావుల్లో నీళ్ళు వెదకుటయే- యని నా భావం.

సోల్జర్: (ప్రవేశించి- టక్కున సాల్యూట్ చేసి) సర్! మన లెఫ్టినెంట్, జాన్సన్‌గారు తమ దర్శనం కోరుతున్నారు.

హ్యూ: యస్! మై బాయ్!

జాన్సన్: (ప్రవేశించి- టక్కున సాల్యూట్ కొట్టి) సర్! చెప్పుటకు సిగ్గుగా వుంది. ఆ 'జోన్ ఆఫ్ ఆర్క్' ను మించిపోయిందీ ఝాన్సీరాణి. ఆమె మనకు చిక్కిందే కాని, ఈమె మనకు చిక్కుతూ చిక్కుతూ తప్పించుకొపోయింది.

హ్యూ: ఆ నేర్పేమో? నేను విన నుత్సాహపడుతున్నాను.

జాన్సన్: పారిపోయే రాణిని మన సవార్లు అందుకు న్నారు. ఒక్కుమ్మడిగా ఆమెపై పడ్డారు. ఆహా! చక్ర భ్రమణచేస్తూ అందరికి జవాబు చెప్పుతూవుంటే నేను వెనుకనుండి కత్తితో బలమైన వ్రేటు వేశాను. ఓహో! ఆమె నేర్పు! ఆ దెబ్బకు ఇంకోరైతే నేల కూలాల్సిందే! నేను కూలిందే అనుకున్నాను కాని—

హ్యూ: ఏమైంది?

(జియాజీరావు దినకర్రావులు ఆశ్చర్యంతో నోర్లు తెరచు కొని చూస్తారు.)

జాన్సన్: మెరపువలె తప్పించుకొన్నది. ఎడమ భుజం మాత్రం గాయపడింది.

దిన: (కసితో) మాంచి పనైంది. (హ్యూరోజును చూచి నాలుక కర్చుకుంటాడు.)

హ్యూ: సరే! తర్వాత?

జాన్సన్: దెబ్బతిన్న పులివలె గిర్రున తిరిగి ఒక్క వ్రేటు వేసింది. చెట్టు కూలినట్లు కూలాను. అంతే! తర్వాత ఏం జరిగిందో తెలియదు.

జియా: ఏం జరిగివుంటుందో?

దిన: సోల్జర్లు ఆమెను అవలీలగా పట్టుకొని వుంటారు.

హ్యూ: నో! సర్! ఆమె మెరుపువలె మాయమై వుంటుంది.

జాన్సన్: అంతే సర్! ఎగ్జాక్ట్లీ అంతే జరిగింది సర్.

తర్వాత తెల్సింది- నేను క్రిందపడగానే చచ్చానని మన వాళ్ళందరు పలాయనం చిత్తగించారు. ఆమె గాలికంటే వేగంగా ఉడాయించింది- అని.

జియా: ఎక్కడికి పోతుంది సార్? ఆ చక్కుల్లోనే పడి వుంటుంది. మా సేనాపతిని పంపి బంధించి తెమ్మంటాను-

దిన: చచ్చిన పీనుగునైనా సరే, మా వారు వదలిరారు.

జాన్సన్: తెలివి రాగానే ఆ పనికూడా చేయించాను, సర్! ఆమె చితి మాత్రం కాలుతూ వుండె. అది ఆమెదే అని రుజువుకూడా చేసుకొని తీరా వచ్చాను.

హ్యూ: సరే! లెఫ్టినెంట్! శక్తివంచన లేకుండా నీ డ్యూటీ నెరవేర్చావు- థ్యాంక్స్! ఇక వెళ్ళి రెస్టు తీసికో.

జాన్సన్: (తిరిగి సెల్యూట్ బజాయించి నిష్క్రమిస్తాడు.)

హ్యూ: నానా తాంత్యాల సంగతి ఏమైందో?

జియా: ఈపాటికి చిక్కాలి, లేకుంటే-

దిన: చిక్కకపోవాలి.

హ్యూ: ఇదియు ఒక ఊహయేనా? మై ఫ్రెండ్స్! పోయిన వాడు హైద్రాబాద్ రిసాల్దార్. ఏమంటారు? (నవ్వుతాడు.)

(జియాజీరావు దినకర్‌రావులు బిక్కమొగాలు వేసుకొని ఒకరినొకరు చూసుకుంటారు.)

జొంజర్: (ప్రవేశించి, టక్కున సెల్యూట్ కొట్టి) సర్! హైద్రాబాద్ రిసాల్‌దార్ ప్రవేశం కోరుతున్నాడు.

హ్యూ: (గంభీర వదనంతో) యస్! పర్మిటెడ్.

షమ్షేర్‌ఖాన్: (ప్రవేశించి, సాల్యూట్ చేసి) ఈ రాజద్రోహులు, బుందేల్‌ఖండ్ అడవుల్లో పట్టుబడ్డారు సార్!
(బేడీలతో బంధింపబడియున్న నానాసాహెబ్, తాంత్యాతోపేలను చూపుతాడు.)

హ్యూ: వెరిగుడ్! కంపనీ గవర్నమెంటు ప్రకటించిన 500/- రూ. ప్రజెంటేషన్‌కు ఈ షమ్షేర్‌ఖాన్ అర్హుడైనాడు. వెరీ గ్లాడ్ టు మీట్ యూ. మీ సర్‌సాలార్‌జంగ్ బహాదుర్‌గారిక్కి నా ధన్యవాదాలు! (షేక్హాండ్ ఇస్తాడు)

జియా: స్వాతంత్ర్య సమర అధినేతలు, నానాసాహెబ్ పీష్వాగారిక్కి క్షేమమే కదా! (వెటకారంగా నవ్వుతాడు)

నానా: (చురచుర సింధియాను చూస్తాడు)

దిన: స్వాతంత్ర్య సమర సర్వసేనానులు, తాంత్యాగారికి కుశలమేకదా! (ఎగతాళిగా నవ్వుతాడు.)

తాంత్యా: (గుడ్లురిమి చూస్తూ హుంకరించి) నీచా! ఏమిరా యీ కూతలు! (మీద పడబోయి వెనుకకు లాగబడతాడు.)

హ్యూ: విద్రోహ సింహాలిప్పటికికదా వలలో చిక్కాయి. (తల వూపుతాడు.)

తాంత్యా: (రోషంతో) వలలో చిక్కినను సింహం సింహమే.

దిన: కాదు, గ్రామసింహం.

తాంత్యా: ఓరీ! దేశద్రోహీ! (కన్నుల నిప్పులు గ్రక్కుతూ పండ్లు పటపట కొరుకుతాడు.)

జియా: ఈ రాజద్రోహులను నిలువునా కాల్చినను దోషం లేదు.

జెన: ఈ అశాంతికారకులను తోపు ముఖాన కట్టి ప్రేల్చినను పాపంరాదు.

తాంత్యా: ఛీ! భారతీయులమని పేరుపెట్టుకొని, పరులకు దాస్యంచేస్తూ వున్నారు. మీకీ బ్రతుకు లేనా? "బండ కట్టుకొ మూత బడుటమేలు."

నానా: మేమూ క్షాత్రంగలవారమని కులుకుతున్నారు. జీవచ్ఛవాలు- థూ!

హ్యూ: (షమ్మీర్‌ఖాన్ నుద్దేశించి) ఈ రాజద్రోహులను లెఫ్టినెంట్ జాన్సన్‌కు అప్పగించు- ఇక పోవచ్చు.

షమ్మీర్: (సెల్యూటు చేసి, నానా తాంత్యాల తీసుకొని వెళ్ళిపోతాడు.)

హ్యూ: ఫ్రెండ్స్! లంచ్ టైం పంపి. మనంకూడ డిపార్టు అవుదామా? (లేస్తాడు.)

(జియాజీ జెనరల్లు ఆయనకంటె ముందే లేచి నిలబడతారు భయభక్తులతో.)

(అందరు నిష్క్రమిస్తారు — తెరపడుతుంది)

## తృతీయ రంగం

ప్రదేశం: ఢిల్లీలో రాజమార్గం

ప్రవేశం: చమన్‌లాల్ అజీజ్‌మియాఁలు పరధ్యానంలో ఎదు రెదురుగా నడుస్తూ ఒండొరులను ఢీకొంటారు_

అజీ: (అదిరిపడి) కండ్లు కనబడుతులేవా? అంధా!

చమన్: (సంభాళించుకొని) కండ్లు కనబడితే నన్ను ఢీకొం టూవా? గధా!

అజీ: క్యా బక్తారే! బే! (ఆ స్తీన్లు ఎక్కిస్తాడు)

చమన్: (ఉగ్రుడై) ఇంకా వదిరావంటే పండ్లూడ్తవి. బద్మాష్! (పిడికిలి బిగిస్తాడు.)

(ఇద్దరు కలియపడపోతూ మొగాలు చూసుకొని నిల్చి పోతారు.)

చమన్: (పరకాయించి చూచి విస్తుపోతూ) అరే! కవ్వాలి సర్దార్_ అజీజ్‌మియాఁనేనా నేను చూస్తున్నది!

అజీ: (ఎగాదిగా చూచి ఆశ్చర్యంతో) అజీ! చమన్‌లాల్ రిసాల్దార్! మాఫ్ కర్నా_ ఏర్పాటు చేయలేనంతగా చిక్కావు. నీకి పట్టుకొన్న బద్‌నసీబీకి యేంటి? భాయ్!

చమన్: నాకరేమొ ఊడిపోయె; ఒక్కపూటే తిని కృష్ణా! అని దినాలు గడుపుతున్నాం. మరి జల్సాలరాయునిలా తిరిగే నీకి భికారివేషం ఏమిటా? అని_

అజీ: మొగలాయి సల్తనత్‌కి దీపంకి ఆరిపోతూ మాకీ ఈ

సిపాయికి తోహ్ఫా ఇచ్చిపోయింది. (చూపిస్తాడు) పూటా పూటకీ గడ్చటంకీ కష్టం ఐంది. ఈ పూటకీ బిచ్చానిక్కి ఎటు పోవాలి అని ఆలోచిస్తూవుంటే నీకి వచ్చి తాకినయి. సరె కాని, నీకి ఎక్కడ్నుంచి రాకడ? యేమ్టి సంగతి?

చమన్: నేను ఢిల్లీ దర్బారు చూడపోయాను. విక్టోరియా మహారాణి ఫర్మానా విని వస్తున్నాను. మా మాజీ సిపాయిల నౌకరీలన్ని బహాల్ చేస్తారుట. ఆ ఖుషీలో ఆలోచిస్తూ నడుస్తుంటే నువ్వు వచ్చి ఢీకొంటివాయె.

అజీ: అయితే ఆ ఇవరాల్కి చెపితే నేనూ ఇంటాను. మాకి గుజరాన్కి ఏమన్నా మార్గాల్కి వుంటే చూతాం.

చమన్: సరే! నడి సడ్కుమీద మాట్లాడుతుంటే_ ఇందాక మనలోమనం గుద్దుకున్నాం సరిపోయింది_ ఏగుఱ్ఱంబండో మనమీంచి పోతే ఇంకేమైనా వుందా? నేను మా అమ్మకు ఒక్కణ్ణే కొడుకును.

అజీ: యాల్లా! మంచిగా చెప్పినవ్. నాకీ పెండ్లాంకి నేను ఒక్కణ్ణే మొగుణ్ణి భాయ్!

చమన్: (నవ్వుతూ) ఒక్కడు కాకపోతే ఎందరు మొగుళ్ళుంటారోయి సాయబు!

అజీ: తోబా! తోబా! (చెంపలు వేసుకుంటాడు) మర్చాను_ మాకి మాఁకీ ఒక్కణ్ణే కొడ్కుని.

(ఇద్దరూ పక్కకు జరిగి కూర్చుంటారు)

అజీ: ఊఁ ఇగ కానీ_

చమన్: అక్కడ పెద్ద ఆమ్ దర్బారు ఏర్పడింది. లార్డ్ క్యానింగ్, గవర్నర్ జనరల్ సింహాసనంమీద ఆసీను లైనారు. ఒక్క ప్రక్క గవర్నర్లు, జర్నల్లు, కర్నల్లు_ రెండో ప్రక్కన దేశీయ రాజులు, ప్రతినిధులు, దివాన్లు_ ముందరి వరుసల్లో సర్దార్లు, నాయకులు_ వారి వెనుక వరుసల్లో ప్రజలు తమ తమ నియమిత స్థలాల్లో కూర్చున్నారు.

అజీ: అక్కడ కవ్వాలీ వగైరా పార్టీల్కి ఏమైనా జర్గాయా?

చమన్: కవ్వాలీలు, ముషాయిరాలు, నాచ్ గానాపార్టీలు అన్ని మొగలాయి సల్తనత్‌తో, పీష్వా రాజ్యంతోపాటే అంతం అయినాయి.

అజీ: అఫ్సోస్! (నిట్టూర్పు విడుస్తాడు) ఊఁ! తర్వాత_

చమ: విప్లవం అణచటంలో సహాయపడిన దేశీయరాజులకు, సర్దార్లకు; సిపాయీలకు గవర్నర్ జనరల్ కృతజ్ఞతలు తెలిపారు. ఈ పోరాటంలో ప్రత్యేక విజయాలు సాధించిన, అద్భుత శౌర్యం చూపిన సర్దార్లకు, సిపాయీలకు బహుమతులు, బిరుదాలు, పతకాలు ప్రసాదింపబడ్డాయి.

అజీ: వాహ్వా! తరువాత తరువాత_

చమన్: యుద్ధాల్లో వీరమరణం చెందినవారికి వీర బహుమతులు, వారి కుటుంబాలకు పెన్షన్లు ప్రకటింపబడ్డాయి.

చివరికి గవర్నర్ జనరల్‌సాహెబ్_ ఇంగ్లండు రాణి, ఇండియా చక్రవర్తినియైన విక్టోరియా మహారాణి ఫర్మానా ఈ విధంగా చదువసాగారు:—

1. ఇండియాపరిపాలన నేరుగా బ్రిటిషురాణిహస్తగతమగును
2. ఆమె ప్రతినిధిగా ఇక్కడ వైస్రాయ్ పరిపాలనసాగించును
3. స్వదేశీ రాజ్యాలకు ఆంతరంగిక స్వాతంత్ర్యం మరియు ముతబన్నా మొదలైన హక్కులు బహాలుగా ఉండును.
4. ప్రజలకు సంపూర్ణ మత స్వాతంత్ర్యం ఉండును.
5. తెలుపు నలుపు భేదం లేకుండా ప్రజలందరికి అర్హతను బట్టి ఉద్యోగావకాశాలు కల్పింపబడును.
6. విప్లవసమరాల్లో పాల్గొన్న సామాన్య లోకానికి అభయం ప్రసాదింపబడును.
7. యుద్ధ నేరస్థులకు, ఖైదీలకు న్యాయ భద్రతలు సమకూర్పబడును.
8. బర్తరఫ్ అయిన సిపాయిలను_ నిర్దోషులైనచో_ మరల భర్తీ చేసుకోబడును.
9. భారతీయులకు క్రమక్రమంగా స్వపరిపాలనాధికారం అనుగ్రహింపబడును.

అజీ: అయితే మాకీ పక్కిరు బిచ్చంకి బహాల్ అన్నమాట. (విచార ముఖంతో) ఆ వెనుక_

చమన్: జాతీయగీతం పాడిన తరువాత కరతాళధ్వనులతో దర్బారు ముగిసింది.

అజీ: సరే! (చేయికల్పి) ఖుదాహాఫిజ్! (పోబోతూ చటుక్కున మర్లి) అరే! అడ్గుటకి మర్చాను. నానాసాహెబ్‌కి, మరి ఝాన్సీరాణీకి సంగతి ఏమిటికైనా తెల్సిందా?

చమన్: బహాదుర్‌షావారు రంగూన్ ఖైదుఖానాలో వున్న సంగతి బహుశా నీకు తెలిసే వుంటుంది.

అజీ: హాయ్! బద్బఖ్తి!

చమన్: నానాసాహెబ్, తాంత్యాగార్లు పట్టుబడి, అండమాన్‌కు పంపబడుతుంటే మధ్యలో తాంత్యాగారు తప్పించుకున్నట్లు వార్తలు. ఆయనజాడలు ఇంతవరకు దొరకలేదుట.

అజీ: ఇక ఝాన్సీరాణీగారి మాటో–

చమన్: ఆమె అగ్గిపిండం. వీళ్లెవరికి చిక్కకుండ తప్పించుకొని అంతర్ధానం చెందిందట– చివరికి ఆమె చితికి దండంపెట్టి వచ్చారట. (మెల్లిగా) తెల్లమొగాలు వేసుకొని తెల్ల మొనగాండ్లు. (అటు ఇటు చూస్తాడు.)

అజీ: తెల్లమొగాలు కాదు, నల్లమొగాలు– (కసితో)

చమన్: ఆమె ఆత్మకు శాంతి కల్గుగాక!

అజీ: ఆమీన్! (అటూ ఇటూ చూచి భయపడుతూ మెల్లిగా) ఆమె పెట్టిన ఆజాదికి మొల్క– పెర్గుతది, పూస్తది, కాస్తది. (చేతులు జాపి మీాపెకి చూస్తాడు.)

చమన్: (రెండు చేతులు బోర్లించి) తథాస్తు! తథాస్తు!!

(తెరపడుతుంది)

సమాప్తం — మంగళమ్ మహత్.

# స్వస్తి!

క॥ స్వస్తి! ప్రజాళికిన్, శ్రీ
రస్తు! శుభాభ్యుదయ మాయురారోగ్యంబుల్,
సిస్తుల శాంతి సుఖములు, బ్ర
శస్త యశము సుప్రతిష్ఠ సంప్రాప్తమగున్.

శా॥ నిత్యశ్రీశుభ మంగళంబులు ప్రజన్ నిత్యంబుసేవించెడున్
సత్యాహింసల మార్గగాము లగుచున్ సాధింత్రు
లక్ష్యంబులన్
సత్యుత్సాహులు, భారతీయు లిఁక సర్వానర్థ జాత్యాదులన్
వ్యత్యాసంబులు మాని గాంచెదరు ప్రఖ్యాతుల్
ప్రపంచంబునన్.

తే. గీ॥ పాడిపంటలు, బహుళమౌ పశుసమృద్ధి,
ధనకనక వస్తువాహన ద్రవ్యవృద్ధి,
ఆధునిక సర్వ శాస్త్ర కళాభివృద్ధి,
స్నేహ సౌహార్ద్ర బుద్ధియు సిద్ధియగుత!

తే. గీ॥ జయము! జయమగు! భారత జనని కెపుడు;
జయము! జయమగు! గాంధికి జాతిపితకు;
జయము! జయమగు! భారత జాతి కెల్ల;
జయము రాజ్యాంగమునకుఁ దద్రక్షకులకు.

---

## కృతికర్త రచనలు

| | | |
|---|---|---|
| 1. | రుక్మిణీ కల్యాణము | ముద్రితము. |
| 2. | పార్వతీ విజయము | ,, |
| 3. | శ్రీమద్భగవద్గీతాగానము | ముద్రణలో |
| 4. | పరీక్షిచ్చరితము | ముద్రితము. |
| 5. | గంగా రూపకాలు | ,, |
| 6. | గంగా శతకములు | అముద్రితము |
| 7. | భగవన్నుతి కీర్తనలు | ,, |